శ్రీః

మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

ప్రథమః సర్గః

రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యా

వల్లభదేవవిరచితపఞ్జికాసంస్కృతవ్యాఖ్యాసముల్లసితమ్



**రామోరా,** **M.Sc., M.A. (Sanskrit)**

లెక్చరర్ రిటైర్డ్,

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523155**



శ్రీః

మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

కుమారసమ్భవమహాకావ్యమ్

ప్రథమః సర్గః

రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యా

వల్లభదేవవిరచితపఞ్జికాసంస్కృతవ్యాఖ్యాసముల్లసితమ్

ప్రథమ ముద్రణ: ***21-5-2010***

ద్వితీయ ముద్రణ : ***డిసెంబర్, 2017***

ప్రతులు : ***500***

పేజీలు : ***184***

వెల రూ. : ***100/-***



**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Lecturer Retd., V.R.S. & Y.R.N. College, Chirala.

**Residence :**
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
**Andhra Pradesh.**
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# శ్రీః

# శ్రీకుమారసమ్భవమహాకావ్యమ్

## 'ఉమోత్పత్తిర్నామ' ప్రథమః సర్గః

## హిమాలయవర్ణనమ్

**అవతారికా** : వస్తు నిర్దేశం కుర్వన్ కావ్యమారభతే.
వస్తు నిర్దేశమును చేయుచు కావ్యమును ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా**
**హిమాలయో నామ నగాధిరాజః।**
**పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య**
**స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః॥** 1

### ❁ మృణాలినీవ్యాఖ్యా ❁

***పదవిభాగము:*** – అస్తి, ఉత్తరస్యామ్, దిశి, దేవతాత్మా, హిమాలయః, నామ, నగాధిరాజః, పూర్వాపరౌ, తోయనిధీ, వగాహ్య, స్థితః, పృథివ్యాః, ఇవ, మానదణ్డః.

***అన్వయక్రమము:*** – ఉత్తరస్యామ్ దిశి దేవతాత్మా హిమాలయో నామ నగధిరాజః పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య పృథివ్యాః మానదణ్డః ఇవ స్థితః అస్తి.

***ప్రతిపదార్థము:*** – ఉత్తరస్యామ్ దిశి = భారతదేశము యొక్క ఉత్తరదిక్కు నందు, దేవతా+ఆత్మ = దేవతాత్మగా గలవాడు, హిమాలయః నామ = హిమాలయము అని పేరు పొందిన, నగ+అధిరాజః = కొండల ఱేడు, పూర్వ + అపరౌ తోయనిధీ = తూర్పు పడమరల సముద్రములను, వగహ్య = వ్యాపించి, పృథివ్యాః = భూమికి, మానదణ్డః+ఇవ = కొలతకఱ్ఱయా అన్నట్లు, స్థితః = ఉన్నవాడు, అస్తి = కలడు.

***తాత్పర్యము:*** – భారతదేశమునకు ఉత్తరదిక్కున దేవతాత్మయై హిమాలయము అని పేరు పొందిన కొండల ఱేడు తూర్పుపడమరల సముద్రములలోనికి వ్యాపించి భూమిని కొలుచుటకు ఏర్పడిన కొలతకఱ్ఱయా అన్నట్లు ఉన్నవాడు కలడు.

***విభక్తులు/క్రియలు:*** – అస్తి–క్రియ; ఉత్తరస్యామ్–ఉత్తరస్యాం, ఉత్తరాయాం; ఉత్తరయోః, ఉత్తరాసు.'ఉత్తరా' శబ్దము, ఆకారాంతస్త్రీ లింగము, సప్తమావిభక్తి ఏకవచనము; దిశి–దిశి, దిశోః, దిక్షు. దిక్ఛశబ్దము, శకారాంత స్త్రీ లింగము, సప్తమా విభక్తి ఏకవచనము; దేవతా+ఆత్మా–ఆత్మా, ఆత్మానౌ, ఆత్మానః. ఆత్మన్ శబ్దము, నకారాంత పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము; హిమాలయః–హిమాలయః, హిమాలయౌ, హిమాలయాః, హిమాలయ



శబ్దము, అకారాన్త పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము; నామ–నామ, నామ్నీ–నామనీ, నామానీ, నామన్ శబ్దము, నకారాన్త నపుంసకలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము; నగాధిరాజః–నగాధిరాజః, నగాధిరాజౌ, నగాధిరాజాః, నగాధిరాజ శబ్దము అకారంత పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము. పూర్వాపరౌ–పూర్వపరమ్, పూర్వాపరౌ, పూర్వాపరాన్; అపర శబ్దము, అకారాంత పుంలింగము, ద్వితీయా విభక్తి ద్వివచనము, వగాహ్య–కృదన్తావ్యయము (ల్యబన్తము), స్థితః–స్థితః, స్థితౌ, స్థితాః, స్థిత శబ్దము, అకారాన్త పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము; పృథివ్యాః–పృథివ్యాః, పృథివ్యోః, పృథివీనామ్, పృథివి శబ్దము, ఇకారాన్త స్త్రీలింగము, షష్ఠీవిభక్తి ఏకవచనము, ఇవ–అవ్యయము, మానదణ్డః–మానదణ్డః, మానదణ్డౌ, మానదణ్డాః, దణ్డ శబ్దము, అకారాంత పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనము. తోయనిధీ– తోయనిధిమ్, తోయనిధీ, తోయనిధీః, తోయనిధి శబ్దము, ఇకారాన్త పుంలింగము, ద్వితీయవిభక్తి ద్వివచనము.

***సమాసములు :–***

1) దేవతాత్మా – దేవతా ఆత్మా యస్య (బహువ్రీహి) సః;
2) హిమాలయః – హిమానామ్ ఆలయః (షష్ఠీతత్పురుష);
3) నగాధిరాజః – న గచ్ఛతి ఇతి – నగః, అగః (నకారలోపము వికల్పము), (నఞ్తత్పురుష), అధిరాజః – అధికఃరాజా (ప్రాదితత్పురుష); నగానాం అధిరాజః (షష్ఠీతత్పురుష);
4) పూర్వాపరౌ – పూర్వశ్చ అపరశ్చ (ద్వంద్వ) తౌ;
5) తోయనిధీ – తోయానాం నిధిః (షష్ఠీతత్పురుష) తౌ;
6) మానదణ్డః – మానస్య దణ్డః (షష్ఠీతత్పురుష).

***సంధులు :–***

1) అస్తి + ఉత్తరస్యామ్ = అస్త్యుత్తరస్యామ్ – యణాదేశ సంధి.
2) దేవతా + ఆత్మా = దేవతాత్మా – సవర్ణదీర్ఘ సంధి.
3) నగ + అధిరాజః = నగాధిరాజః – సవర్ణదీర్ఘ సంధి.
4) పృథివ్యాః + ఇవ = పృథివ్యా ఇవ – విసర్గలోప సంధి.

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణములు – కావ్య ప్రయోగాలు.**

1. **అస్తి** ఎ) మహాకవి శ్రీ కాళిదాసు 'కుమారసంభవ' మహాకావ్యమును రచింపగోరి

*శ్లో॥ సర్గబన్ధో మహాకావ్యముచ్యతే తస్య లక్షణమ్।*
*ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్॥*

అను శాస్త్రసంప్రదాయము ననుసరించి కావ్యాది యందు భారతదేశము యొక్క ఉత్తర దిక్కున 'హిమాలయ' మను పేరు ప్రసిద్ధిచెందిన ఱేడు కలడు అను వస్తువును 'అస్తీ'తి శ్లోకముచే నిర్దేశము చేసినాడు.

బి) కావ్యాది 'అక్షర' మఱియు 'గణ' ప్రాశస్త్యమును గూర్చి మహాకవి శ్రీ కాళిదాస విరచిత 'పుష్పబాణవిలాసము'నకు 'శృఙ్గారచన్ద్రికా' వ్యాఖ్యానము నందించిన శ్రీ పణ్డిత

వేంకట సార్వభౌముడు పేర్కొనిన 'చమత్కార చన్ద్రిక' యందలి భాగమును ఇచట అనుసంధానము చేసికొనదగును. ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు ప్రచురించిన 'చమత్కార చన్ద్రిక' చూడదగును. ఇందు కించిత్ వైవిధ్యమున్నది.

శ్లో॥ యథోచితమిమే వర్ణా రసాదేరుపయోగినః ।
న్యస్తా కావ్యముఖే వర్ణాస్తత్తద్దైవతమూర్తయః ॥ *1-18*

శ్లో॥ కర్తుః కారయితుః శ్రోతుః కల్పయన్తి శుభాశుభే ।
అ(ఆ)కారః ప్రీతిదాయీ స్యాన్నిషేధే తు విపర్యయః ॥ *1-19*

శ్లో॥ అకారో హర్షదః సోఽపి క్రోధార్యాదిషు నోచితః ।
ఇకారాది చతుష్కం తు కుర్యాత్తుష్టిమనోరథౌ ॥ *1-20*

**శ్లో॥ అస్త్యుత్తరస్యాం వాగర్థౌ కశ్చిత్కాన్తేత్యుదాహృతిః ।**
**కాళిదాస త్రయే(యో) జ్ఞేయా శుభయోర్గణ వర్ణయోః ॥ 1-39**

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః ।
పూర్వాపరౌ తోయనిధీ వగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః ॥ కు.సం. 1-1

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥ రఘువంశమ్ - 1-1

శ్లో॥ కశ్చిత్కాన్తా విరహగు రుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తఙ్గమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః ।
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు ॥ మేఘదూతమ్ -1

సి) **అస్తి** - సత్తాయామ్, అస్తిమాన్ = ధనికః, ఆస్తికః = పరలోకోఽస్తీతి జ్ఞానవాన్, అస్య లిఙ్గౌ తిజన్తత్వేఽప్రాతిపదికత్వాత్తద్ధితానాపత్తిః - అవ్యయము

డి) **అస్తి** - అస (అస్) భువి (ఉండుట), అదాది ప్రకరణమ్ (2), పరస్మైపదీ, అకర్మకమ్, సేట్. **అస్తి** - స్తః - సన్తి. లట్, ప్రథమపురుష ఏకవచనము.

ఇ) **'అ'** - వర్ణమాలలో ప్రథమాక్షరమైన 'అ' స్థితికారుడైన శ్రీ మహావిష్ణువును సూచించుటచే 'అస్త్యుత్తరస్యాం...' అని. ఈ కావ్యమును ప్రణవాక్షరమైన 'ఓం' కారము లోని ప్రథమాక్షరము 'అ' తో ప్రారంభించుట పరమపవిత్రముగ భావింపతగును.
**'అకారో విష్ణురుద్దిష్టః';**

**2. దేవతాత్మా - హిమాలయః**

ఎ) దేవతా ఆత్మా యస్య సః దేవతాత్మా. దేవత ఆత్మగా కలవాడు అని వ్యుత్పత్తి. ఋషిపుంగవులు భూభౌతిక సంపదలగు గిరులు, నదులు, పర్వతాలు, సముద్రాలు, గ్రహాలు, నక్షత్రాలు మొదలైన దేవతామూర్తులకు స్థావరజంగమ రూపాలున్నట్లు దర్శించినారు.



పైకి కనిపించే కదలని రూపాలు - స్థావరములు; పైకి కన్పించని కదిలే రూపాలు - జంగమములు. పర్వతసార్వభౌముడైన హిమవంతుడు భారతదేశముయొక్క ఉత్తరదిశ నందు కన్నులకు కన్పిస్తున్న మంచు కొండ రూపమే కాక తపోదృష్టికి మాత్రమే కనపడు జంగమ స్వరూపమూ ఉంది. ఇచట కుమారసంభవమహాకావ్యమున ఆఱవ సర్గలోని దిగువ శ్లోకాలను అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ ధాతు తామ్రాధరః ప్రాంశుర్దేవదారుబృహద్భుజః ।
ప్రకృత్యైవ శిలోరస్కః సువ్యక్తో హిమవానితి ॥ *6-51*

శ్లో॥ కాఠిన్యం స్థావరే కాయే - భవతా సర్వమర్పితమ్ ।
ఇదం తు తే భక్తినమ్రం సతామారాధనం వపుః ॥ *6-73*

శ్లో॥ జంగమం ప్రైష్యభావే వః - స్థావరం చరణాఙ్కితమ్ ।
విభక్తానుగ్రహం మన్యే - ద్విరూపమపి మే వపుః ॥ *6-58*

ఓ ఋషిపుంగవులారా! "1. నా జంగమాత్మకమయిన శరీరము మీయొక్క దాస భావము వలనను, 2. నా స్థావరమయిన పర్వతశరీరము మీ పాదములచే చిహ్నితమగుట వలనను, జంగమ స్థావరాత్మకములగు నా రెండు శరీరములును మీ అనుగ్రహమును విభజించుకొని పంచుకొన్నవని" నేను తలంచుచున్నాను.

హిమవంతుని 'దేవతాత్మ' గా వివరించటం వల్ల పితృదేవతల కూతురగు మేనకాదేవిని హిమవంతుడు వివాహమాడుట; ఈ దంపతులు జగన్మాతయగు ఉమాదేవిని కూతురుగా పొందుట, జగత్పితయగు పరమశివుణ్ణి 'జామాతా'గా పొందుట మొదలగు వక్ష్యమాణకథాంశాలు సూచితమయినాయి.

**బి) శ్లో॥ ....ఉదగద్రిస్త్వద్రిరాడ్ మేనకా.**
**ప్రాణేశో హిమవాన్ హిమాలయ హిమప్రస్థో భవానీగురుః ॥ 4-93**

1. ఉదగద్రిః, 2. అద్రిరాట్, 3. మేనకాప్రాణేశః, 4. హిమవాన్, 5. హిమాలయః, 6. హిమప్రస్థః, 7. భవానీగురుః అని అభిధానచింతామణిః

సి) **హిమవన్నగము -** భారతదేశానికి తూర్పు పడమరల నున్న రెండు సముద్రాల లోనికి జొచ్చుకొనిపోయి ఉన్న విషయాన్ని బ్రహ్మాండ పురాణము వివరించింది.

శ్లో॥ కైలాసో హిమవాంశ్చైవ దక్షిణే వర్షపర్వతౌ ।
పూర్వపశ్చిమ గావేతావర్ణవాన్తరూపస్థితౌ ॥

డి) ఉత్తరస్యాం దిశి దేవభూమయః, దక్షిణస్యాం దిశ్యసురభూమయః, మధ్యే మనుష్యభూమయః ఇతి పురాణప్రసిద్ధిః. ఉత్తర దిక్కునందలివి దేవభూములని, దక్షిణ దిక్కులందలివి అసురభూములని, మధ్యలోనివి మనుష్యభూములని పురాణప్రసిద్ధి.

ఇ) భూగోళం మీద ఏడు ప్రధాన పర్వతాలున్నాయి. వీనిని సప్తకుల పర్వతములు అంటారు.

*శ్లో॥ మహేంద్రో మలయస్సహ్యః శుక్తిమాన్ ఋక్ష ఏవచ ।*
*వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః ॥ శి.త.ర -4-1-19,20.*

1. మహేంద్రము, 2. మలయము, 3. సహ్యము, 4. శుక్తిమంతము, 5. ఋక్షము, 6. వింధ్యము, 7. పారియాత్రము.

***ఎఫ్)*** 'హిమవన్నగ' పరిధిని 'శ్రుతి' ఇలా పేర్కొన్నది

***శ్లో॥ యావన్మాత్రా పృథివీ తావన్మాత్రో హిమాలయః ।***
***యావన్మాత్రో హిమాలయః తావన్మాత్రా పృథివీ ॥***

***పాఠాంతరాలు :*** –1) తోయనిధీ – వారినిధీ; 2) వగాహ్య – విగాహ్య

***క్రియాదర్శము :–*** "సత్తాయామస్తి భవతి విద్యతే" అని 'ఆఖ్యాతచన్ద్రికా' 1-1-1

ఎ) అస (అస్) భువి (ఉండుట) అదాది ప్రకరణమ్ – అకర్మకమ్ – అనిట్ – పరస్మైపదీ **అస్తి** – స్తః – సన్తి – లట్ ప్రథమపురుషైకవచనము.

బి) భూ సత్తాయామ్ (ఉండుట) భ్వాదిప్రకరణమ్ – అకర్మకమ్ – సేట్ – పరస్మైపదీ **భవతి** – భవతః – భవన్తి – లట్ – ప్రథమపురుషైకవచనము

సి) విద (విద్) సత్తాయామ్ (ఉండుట) దివాదిప్రకరణమ్ – ఆకర్మకమ్ – అనిట్ – ఆత్మనేపదీ, **విద్యతే** – విద్యేతే – విద్యన్తే – అట్ ప్రథమపురుషైకవచనము

**ఛందస్సు –** 'కుమారసంభవ' మహా కావ్యమున ప్రథమసర్గ నందు శ్లోకములు ఇంద్రవజ్రా, ఉపేంద్రవజ్రా, వాటి కలయికతో నేర్పడిన ఉపజాతికిన్ని చెందినవి.

***లక్షణము:*** *శ్లో॥ స్యాదిన్ద్రవజ్రా యది తౌ జగౌ గః । ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ ।*
*అనన్తరోదీరితలక్ష్మభాజౌ పాదౌ యదీయా వుపజాతయ స్తాః ॥ ఇతి.*

***అలంకారాలు:–*** ఉత్ప్రేక్షాలంకారము – హిమవత్పర్వతము పూర్వాపర సాగరములలోకి వ్యాపించుట చేత భూమి కొలవటానికి సహజంగా ఏర్పడిన కొలతబద్దవలె ఉన్నదని సంభావించుటచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారము ఉన్నదని చెప్పదగును.

***లక్షణము :*** *శ్లో॥ అవివక్షితసామాన్యా కించిచ్చోపమయా సహ ।*
*అతద్గుణక్రియాయోగా దుత్ప్రేక్షాతిశయాన్వితా ॥ కావ్యాలంకారః 2-91*

వివక్షితము కాని సాదృశ్యము కలదియు, కొంచెము ఉపమా సంబంధము కలదియు, ఏగుణక్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అట్టి గుణ క్రియలు లేనిదియు, అతిశయముతో కూడినదియు అగునది 'ఉత్ప్రేక్ష'. ఉత్ప్రేక్షలో నాలుగు విషయము లుండవలెను. 1) ఇవాది శబ్దములు ప్రయోగించినను కవి సంభావన యందే తాత్పర్యము కాని సాదృశ్యము నందు ఉండదు. 2) ఇవ శబ్దములను ప్రయోగించుటచే కొంచెము ఉపమాచ్ఛాయ ఉండును. 3) ఒక వస్తువునందు ఏ గుణ క్రియలు ఉన్నట్లు వర్ణింపబడునో అవి వాస్తవమున అందు ఉండవు. 4) అతిశయము ఉండును. –బాలానందిని. ❁





***అవతారికా :–*** ఇతఃపరం షోడశభిః శ్లోకైః హిమాద్రిం వర్ణయతి.

**శ్లో॥ యం సర్వశైలాః పరికల్ప్య వత్సం**
**మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే ।**
**భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ**
**పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్ ॥ 2**

***పదవిభాగము :–*** యమ్, సర్వశైలాః, పరికల్ప్య వత్సమ్, మేరౌ, స్థితే, దోగ్ధరి, దోహదక్షే, భాస్వన్తి, రత్నాని, మహౌషధీః చ, పృథూపదిష్టామ్, దుదుహుః, ధరిత్రీమ్.

***అన్వయక్రమము :–*** సర్వశైలాః యమ్ వత్సమ్, పరికల్ప్య, దోహదక్షే, మేరౌ, దోగ్ధరి, స్థితే, (సతి), భాస్వన్తి, రత్నాని, మహౌషధీః చ పృథూపదిష్టామ్, ధరిత్రీమ్, దుదుహుః.

***ప్రతిపదార్థము :–*** సర్వశైలాః = మందరము మొదలైన అన్ని పర్వతములు, యమ్=ఆ హిమవంతుని, వత్సమ్ = లేగదూడనుగా, పరికల్ప్య = చేసినవై, దోహదక్షే = పిదుకుట యందు నేర్పరియైన, మేరౌ = మేరు పర్వతము, దోగ్ధరి = దోగ్ధగా, స్థితే (సతి) = నిలచి యుండగా, భాస్వన్తి = కాంతులీనుచున్న, రత్నాని = మరకత పద్మరాగాది శ్రేష్ఠములయిన మణులను, మహౌషధీఃచ = సంజీవని మొదలగు గొప్ప ఓషధులను, పృథూపదిష్టామ్ = పృథుచక్రవర్తి యొక్క ఉపదేశము మేరకు, ధరిత్రీమ్ = భూమిని గూర్చి, దుదుహుః = పిదికిరి.

***తాత్పర్యము :–*** మందరము మొదలైన సర్వ పర్వతములు ఆ హిమవంతుని లేగదూడనుగా చేసినవై, పిదుకుటయందు నేర్పరియైన మేరు పర్వతము దోగ్ధగా నిలిచియుండుగా కాంతులీనుచున్న మరకత పద్మరాగాది శ్రేష్ఠములయిన మణులను, సంజీవని మొదలగు గొప్ప ఓషధులను పృథుచక్రవర్తియొక్క ఉపదేశము మేర భూమిని గూర్చి పిదికిరి.

1. **విభక్తులు – క్రియలు :–** 1) **యమ్** – యమ్, యౌ, యాన్; దకారాన్త పుంలింగయచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) సర్వశైలాః – సర్వశైలః, సర్వశైలౌ, **సర్వశైలాః;** అకారాన్త పుంలిఙ్గ శైల శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 3) పరికల్ప్య – అవ్యయము, ల్యబన్తము. 4) వత్సమ్ – **వత్సమ్**, వత్సౌ, వత్సాన్, అకారాన్త పుంలింగ వత్స శబ్దము, ద్వితీయవిభక్తి ఏకవచనము. 5) మేరౌ – **మేరౌ**, మేర్వోః, మేరుషు; ఉకారాన్త పుంలింగ మేరు శబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. 6) స్థితే –**స్థితే**, స్థితయోః, స్థితేషు; అకారాన్త పుంలింగ స్థిత శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 7) దోగ్ధరి – **దోగ్ధరి**, దోగ్ధ్రోః, దోగ్ధృషు; ఋకారాన్త పుంలింగ దోగ్ధృ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 8) దోహదక్షే – **దోహదక్షే**, దోహదక్షయోః, దోహదక్షేషు; అనారాన్త పుంలింగ దోహదక్ష శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) భాస్వన్తి – భాస్వత్, భాస్వన్తీ, **భాస్వన్తి**; అకారాన్త నపుంసకలింగ భాస్వచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. భాస్ + మతుప్. తద్ధితాన్తము. 10) రత్నాని – రత్నమ్, రత్నే, **రత్నాని**; అకారాన్త నపుంసక లింగ రత్నశబ్దము, ద్వితీయవిభక్తి బహువచనము. 11) మహౌషధీః – మహౌషధిమ్, మహౌషధీ, **మహౌషధీః,** ఇ/ఈకారాన్త స్త్రీలింగ ఓషధిశబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 12) చ–అవ్యయము, 13) పృథూపదిష్టామ్ – ఉప + దిశ + తృచ్, కృదన్తము, ఋకారాన్త పుంలింగ ఉపదిష్టృ శబ్దము, ఉపదిష్టామ్ – ఉపదిష్టామ్, ఉపదిష్టారౌ, ఉపదిష్టౄన్. 14) దుదుహుః – క్రియ. 15) ధరిత్రీమ్ – **ధరిత్రీమ్,** ధరిత్ర్యౌ, ధరిత్రీః; ఈకారాన్త స్త్రీలింగ ధరిత్రీశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1. సర్వశైలాః – సర్వే చ తేశైలాః చ, సర్వశైలాః (కర్మధారయ సమాసం).
2. దోహదక్షే – దోహే దక్షః (సప్తమీతత్పురుష.) తస్మిన్.
3. మహౌషధీః – మహత్యశ్చ తాః ఔషధ్యశ్చ (కర్మధారయ.) తాః,
4. పృథూపదిష్టామ్ – పృథునా ఉపదిష్టా (తృ.తత్పురుష.) తామ్
5. భాస్వన్తి – భాస్వన్తి చ భాస్వత్యశ్చ (ఏకశేష.)

***సంధులు :–***

1. మహా + ఓషధీః + చ = మహౌషధీశ్చ – వృద్ధిసంధిః, వృద్ధిరేచి (సూ 6–1–85).
2. పృథు + ఉపదిష్టామ్ = పృథూపదిష్టామ్ – సవర్ణదీర్ఘసంధిః, అకః సవర్ణే దీర్ఘః (సూ 6–1–97).

***పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు.***

1. **పృథూపదిష్టామ్ –**

ఎ) శ్లో॥ *వేనోనామ భవద్రాజా దుశ్శీలో దుష్పరాక్రమః ।*
*తం శప్త్వా మునయో జగ్ముః పీడితాస్తదుపద్రవేః ॥*
*రాజాభావాత్తతో జాతా ధరిత్రీ దుర్జనకులా ।*
*తతస్తు మునయః సర్వే సంచిన్త్య మనసా హరిమ్ ॥*
*మమన్థుస్తస్య వేనస్య గతప్రాణం కలేవరమ్ ।*
*అస్మాదభూన్మహాతేజా అరణేరివ పావకః ।*
*నారాయణాంశ సమ్భూతః పృథు పృథుపరాక్రమః ॥* శ్రీమద్భాగవతము4.

బి) పృథువు వేనుని మర్దింపగ నతని శరీరము నుండి పుట్టిన వనితను 'అర్చి' యను దానిని పృథువు పెండ్లాడినాడు. వేనుని పాలనమున నధర్మము పెరిగి వర్షములుగాని, పంటలుగాని లేకయుండుటచే పృథువు ప్రజా సంరక్షణము చేయుటకై గోరూపధారిణియైన భూమిని బాణముతో గొట్టబోయెను. భూమి భయమొంది "క్రతువులు లేక, ధర్మములు లేక పుడమి చోరీభూతమై యుండగ నారూపము ఉపసంహరించుకొంటిని. నాకు వత్సమును కల్పించి క్షీరము పిదుకుమని వేడెను. –పూర్వగాథాలహరి. మరిన్ని వివరములకై, ఆప్టే నిఘంటువు, శ్రీమద్భాగవతం–4 స్కంధము చూడగలరు.

సి) "ఆదిరాజః పృథుర్వైన్యః .... – అభిధానచిన్తామణి 3–364. ఆదిరాజః, పృథుః, వైన్యః అను మూడు నామములను పేర్కొన్నది.

డి) "ప్రథిమ్రదిభ్రస్జాం సంప్రసారణం సలోపశ్చ", "ప్రథతే కీర్తిం వా విస్తారయతి స పృథుః రాజవిశేషో, విస్తీర్ణః పదార్థో వా" – ఉణాదికోషః 1–28

ఇ) పృథుః – పృథ్వీ – పృథు (పుం–స్త్రీ–న), ప్రథ్ to be famous; aff. కు; and 'ర' changed to 'ఋ'. –శబ్దసాగరః



2) శ్లో॥ గౌర్భూమిరచలాస్సర్వే కర్తారోఽత్ర పయాంసి చ ।
ఓషధ్యశ్చైవ భాస్వన్తి రత్నాని వివిధాని చ ।
వత్సశ్చ హిమవానాసీద్దోగ్ధా మేరుర్మహాగిరిః । –సంజీవినీ వ్యాఖ్య నుండి.

3) శ్లో॥ శైలైశ్చ శ్రూయతే రాజన్పునర్దుగ్ధా వసుంధరా ।
ఔషధీర్వై మూర్తిమతీ రత్నాని వివిధాని చ ॥
శ్లో॥ వత్సస్తు హిమవానాసీద్దోగ్ధా మేరుర్మహాగిరిః ।
సమంద్రాః పాత్రతాం జగ్మురితిహాసం పురాతనమ్ ॥ హ.వం 1.6.40,41

***క్రియాదర్శము :–* దుదుహుః.** 1) దుహ – (దుహ్) ప్రపూరణే (పిదుకుట), అనిట్ – ద్వికర్మకమ్ – (ఉభయ) పరస్మైపదీ.

2) దుదోహ – దుదుహతుః – **దుదుహుః**, లిట్ ప్రథమపురుష బహువచనము.

3) శ్లో॥ సర్వే స్వముఖ్యవత్సేన స్వేస్వే పాత్రే పృథక్పయః ।
సర్వ కామదుఘాం పృథ్వీం ***దుదుహుః*** పృథుభావితమ్॥ *భా. 4–18–26.*

4)శ్లో॥ ***దుదోహ*** *గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివమ్*। *రఘువంశమ్ –1–26.*

యజ్ఞార్థము ఆ దిలీపమహారాజు భూమిని పిండెను. పైరును వృద్ధిపొందించుటకు దేవేంద్రుడు స్వర్గమును పిండెను.

***అలంకారములు :–*** ఇట 'తుల్యయోగితాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణమ్: శ్లో॥ న్యూనస్యాపి విశిష్టేన గుణసామ్యవివక్షయా ।***
***తుల్యకార్యక్రియాయోగాదిత్యుక్తా తుల్యయోగితా ॥***

తక్కువ దానికి కూడ విశిష్టమైన దానితో గుణసామ్యమున్నదని చెప్పవలెననెడు ఇచ్ఛతో, అది విశిష్టమైన దానితో సమానమగు కార్యమును చేసినట్లు చెప్పుట తుల్యయోగితాలంకారము. కావ్యాలంకారః – బాలానందిని వ్యాఖ్యా. భూమి – ఆవు, హిమాలయము – లేగదూడ, మేరు పర్వతము – గొల్లవాడు. ఇచట దోహన క్రియారూప సమాన ధర్మమును చేసినట్లు చెప్పుటచే ఇందు తుల్యయోగితాలంకారము కలదని చెప్పబడదగును.



**శ్లో॥ అనన్తరత్నప్రభవస్య యస్య**
**హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్ ।**
**ఏకో హి దోషో గుణసన్నిపాతే**
**నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః ॥ 3**

***పదవిభాగము :–*** అనన్తరత్న ప్రభవస్య, యస్య, హిమమ్, న, సౌభాగ్యవిలోపి, జాతమ్, ఏకః, హి, దోషః, గుణసన్నిపాతే, నిమజ్జతి, ఇన్దోః, కిరణేషు, ఇవ, అఙ్కః.

***అన్వయక్రమము :–*** అనన్తరత్నప్రభవస్య, యస్య, హిమమ్, సౌభాగ్యవిలోపి, న, జాతమ్, హి, ఏకః, దోషః, గుణసన్నిపాతే, ఇన్దోః, కిరణేషు, అఙ్కః, ఇవ, నిమజ్జతి.

***ప్రతిపదార్థము :–*** అనన్తరత్నప్రభవస్య = అపరిమితమయిన శ్రేష్ఠ వస్తువులకు జన్మ స్థానమైనట్టి, యస్య = ఆ హిమవంతునికి, హిమమ్ = మంచు, సౌభాగ్యవిలోపి = సౌందర్యమును తఱుగజేయునది, న జాతమ్ = కాలేదు, హి = ఏలయన, ఏకః దోషః = ఒకదోషము, గుణసన్నిపాతే = గుణములయొక్క సమూహములో, ఇన్దోః = చంద్రుని యొక్క, కిరణేషు = వెలుగులలో, అఙ్కః = మచ్చ, ఇవ = వలె, నిమజ్జతి = మునిగిపోవును.

***తాత్పర్యము :–*** అపరిమితమైన శ్రేష్ఠవస్తువులకు జన్మస్థానమైనట్టి ఆ హిమవంతునికి మంచువల్ల సౌందర్యమేమియు తఱుగలేదు. ఏలయన, సద్గుణాల సమూహములో ఒక్క దోషము చంద్రకిరణాలలో నల్లని మచ్చవలె అంతర్లీనమైపోవును.

***విభక్తులు / క్రియలు :–*** 1) అనన్తరత్నప్రభవస్య – **ప్రభవస్య,** ప్రభవయోః, ప్రభవాణామ్; అకారాన్త పుంలింగము, ప్రభవ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) యస్య – **యస్య,** యయోః, యేషామ్; దకారాన్త పుంలింగము, యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 3) హిమమ్ – **హిమమ్,** హిమే – హిమాని, అకారాన్త నపుంసక హిమ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) న – అవ్యయము. 5) జాతమ్ – **జాతమ్,** జాతే, జాతాని; అకారాన్త నపుంసక జాతశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6)సౌభాగ్యవిలోపి – **సౌభాగ్యవిలోపి,** విలోపినీ, విలోపీని; ఇకారాన్త నపుంసకలింగ విలోపిశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) ఏకః – అకారాన్త పుంలిఙ్గస్సంఖ్యావాచకో నిత్యైకవచనాన్త ఏకశబ్దము. 6) హి – అవ్యయము. 9) దోషః – దోషః, దోషౌ, దోషాః; అకారాన్త పుంలింగ దోషశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 10) గుణసన్నిపాతే – సన్నిపాతే, సన్నిపాతయోః, సన్నిపాతేషు; అకారాన్త పుంలింగ సన్నిపాతశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) నిమజ్జతి – క్రియ, 12) ఇన్దోః – ఇన్దోః, ఇన్ద్వోః, ఇన్దూణామ్; ఉకారాన్త పుంలింగ ఇన్దుశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 13) కిరణేషు – కిరణే, కిరణాయోః, కిరణేషు; అకారాన్త పుంలింగ కిరణశబ్దము, సప్తమీవిభక్తి బహువచనము. 14) ఇవ – అవ్యయము. 15) అఙ్కః – అఙ్కః, అఙ్కౌ, అఙ్కాః; అకారాన్త పుంలింగ అఙ్కశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) అనన్తరత్నప్రభవస్య–అనన్తాని చ తాని రత్నాని(కర్మధారయ),అనన్తాని–అవిద్యమానః అన్తః యేషామ్ (బహువ్రీహి) తాని, అనన్తరత్నానాం ప్రభవః (ష.త.)తస్య.
2) సౌభాగ్యవిలోపి – సౌభాగ్యం విలుంపతీతి తచ్ఛీలః (ఉపపద తత్పురుష).
3) గుణసన్నిపాతే – గుణానాం సన్నిపాతః (షష్ఠీతత్పురుష), తస్మిన్.

***సంధులు :–***

1) కిరణేషు+ఇవ+అఙ్కః = కిరణేష్వివాఙ్కః,
2) కిరణేషు+ఇవ = కిరణేష్వివ, యణాదేశసన్ధిః, **ఇకో యణచి** (సూ 6–1–74).
3) ఇవ+అఙ్కః = ఇవాఙ్కః, సవర్ణదీర్ఘసన్ధిః, **అకః సవర్ణే దీర్ఘః** (సూ 6–1–97).

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. రత్నమ్ – ఎ) 'రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి మణావపి నపుంసకమ్' –మేదినీకోశః



బి) 'రత్నం శ్రేష్ఠే మణావపి'. –విశ్వకోశః

సి) 'రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి'. –అమరకోశః

డి) 'రమేస్త చ' –ఉణాదికోశః, 3–14. ణ్యన్తాద్ రమేర్నప్రత్యయో మస్య తశ్చాదేశః। రమయతి హర్షయతీతి రత్నమ్। "జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్ధి రత్నం ప్రచక్షతే।" అశ్వరత్నమ్, గజరత్నమ్, మణిరత్నమ్, స్త్రీరత్నమ్, ఇత్యాది.

ఇ) 'రత్నం వసు మణి' ...... అని అభిధానచిన్తామణి '3' నామములను పేర్కొన్నది.

ఎఫ్)శ్లో॥ *దివం యది ప్రార్థయసే వృథా శ్రమః*
*పితుః ప్రదేశాస్తవ దేవభూమయః ।*
*అథోపయన్తారమలం సమాధినా*
*న* ***రత్నమ****న్విష్యతి మృగ్యతే హితత్ ॥* –కు.సం. *5–45.*

"... రత్నము తన్ను గైకొమ్మని ఒకరిని వెదికికొనదు. దానినే కోరి బరులు వెదికికొందురు."

జి) 'కన్యారత్నమయోనిజన్మ భవతామాస్తే వయం చార్థినః' –మహావీరచరిత్ర.1–30.

హెచ్) 'అగ్రేసరీభవతు కాంచనచక్రరత్నమ్' –నాగానందం. 5–37.

ఐ) ఉమాదేవి అనే కన్యారత్నానికి, వైదూర్యము మొదలయిన మణిరత్నాలకు, దేవదారు మున్నగు వృక్షరత్నాలకు, మృతసంజీవని మున్నగు ఓషధి రత్నాలకు, గంగ మొదలైన నదీరత్నాలకు, సోమలత మున్నగు యజ్ఞద్రవ్యరత్నాలకు హిమవంతుడు జన్మస్థానమే.

2. ***'ఏకో హి దోషో గుణసన్నిపాతే, నిమజ్జతేన్దోః కిరణేష్వివాఙ్కః।'*** అనేది 'లోకోక్తి' కి ఉదాహరణ.

***క్రియాదర్శము :–*** **నిమజ్జతి,** ని–మజ్జతి. 1) టుమస్జో (మస్జ్) శుద్ధౌ (శుభ్రపడుట) – సకర్మకమ్, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్ (6). **మజ్జతి** – మజ్జతః, మజ్జన్తి; లట్ ప్రథమపురుషైకవచనము.

2) ***మజ్జత్యాప్లవతే స్నాతి స్నాయత్యేతేఽవగాహతే*** *॥ 49*
*స్యుర్మజ్జనే క్రుదత్యేతే ... ఆఖ్యాతచన్ద్రికా, 2–2–2.*

1. మజ్జతి, 2.ఆప్లవతే, 3.స్నాతి, 4.స్నాయతి (ఏతే), 5.అవగాహతే (స్యుః), 6.మజ్జనే, 7.క్రుదతి (ఏతే).

***అలంకారములు :–*** ఇందు 'అర్థాంతరన్యాసాలంకార'మున్నది.

***లక్షణము :–*** శ్లో॥ *ఉపన్యసనమన్యస్య యదర్థస్యోదితాదృతే ।*
*జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసః పూర్వార్థానుగతో యథా ॥* కావ్య. *2–71.*

'చంద్రకిరణాలలో నల్లనిమచ్చ మునిగిపోయినట్లు, ఈ లోకంలో సద్గుణాల సమూహములో ఒక్క దోషము లెక్కకు రాదు కదా' అని ఉత్తరార్ధమునందలి అర్థము పూర్వార్థమునందలి అర్థముతో సంబంధించు విధమునను, దానిని సమర్ధించు విధమునను చెప్పబడుటచే ఇందు 'అర్థాంతరన్యాసాలంకార' మున్నదని చెప్పబడినది. ❀

**శ్లో॥ యశ్చాప్సరోవిభ్రమమణ్డనానాం**
**సమ్పాదయిత్రీం శిఖరైర్బిభర్తి ।**
**వలహకచ్ఛేదవిభక్తరాగా-**
**మకాలసన్ధ్యామివ ధాతుమత్తామ్ ॥ 4**

***పదవిభాగము :-*** యః, చ, అప్సరోవిభ్రమమణ్డనానామ్, సంపాదయిత్రీమ్, శిఖరైః, బిభర్తి, వలాహకచ్ఛేదవిభక్తరాగామ్, అకాలసన్ధ్యామ్, ఇవ, ధాతుమత్తామ్.

***అన్వయక్రమము :-*** చ, యః, అప్సరోవిభ్రమమణ్డనానామ్, సంపాదయిత్రీమ్, బలహకచ్ఛేదవిభక్తరాగామ్, ధాతుమత్తామ్, అకాలసన్ధ్యామ్, ఇవ, శిఖరైః, బిభర్తి.

***ప్రతిపదార్థము :-*** (కిం) చ = మఱియు, యః = ఆ హిమవంతుడు, అప్సరోవిభ్రమ - మణ్డనానామ్ = అచ్చరల యొక్క విపర్యాసముగా ధరించిన అలంకారములను, సంపాదయిత్రీమ్ = సమకూర్చునదియు, వలాహక - ఛేద - విభక్త - రాగామ్ = మేఘములయొక్క తునియల యందు సంక్రమితమయిన ఎఱుపుగలదియు, ధాతుమత్తామ్= సిందూర గైరికాది ధాతువులు కలిగి యుండుటను, అకాలసన్ధ్యామ్-ఇవ = కాల నియమము లేని సంజకెంజాయనువలె, శిఖరైః = శిఖరముల చేత, బిభర్తి = వహించుచున్నాడు.

***తాత్పర్యము :-*** మఱియు, ఆ హిమవంతుడు, అప్సరసలు విపర్యాయముగా ధరించిన అలంకారములను సమకూర్చునదియు, మబ్బుతునకల యందు సంక్రమితమయిన ఎఱుపు గలదియు, సిందూరగైరికాది ధాతువులు కలిగియుండుటను, అకాల సంజకెంజాయవలె శిఖరములచే వహించుచున్నాడు.

***విభక్తులు / క్రియలు :-*** 1) యః - **యః,** యౌ, యే; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) అప్సరోవిభ్రమమణ్డనానామ్ - మణ్డనస్య, మణ్డనయోః, **మణ్డనానామ్**; అకారాన్త పుంలింగ మణ్డనశబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 3) సంపాదయిత్రీమ్ - **సంపాదయిత్రీమ్,** సంపాదయిత్ర్యా, సంపాదయిత్రీః; ఈకారాన్త స్త్రీలింగ సంపాదయిత్రీశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 4) శిఖరైః - శిఖరేణ, శిఖరాభ్యామ్, **శిఖరైః;** అకారాన్త పుంలింగ శిఖరశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 5) బిభర్తి - క్రియ; 6)వలాహకచ్ఛేదవిభక్తరాగామ్ - **రాగామ్,** రాగే, రాగాః; ఆకారాన్త స్త్రీలింగ రాగా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) అకాలసంధ్యామ్ - **సంధ్యామ్,** సన్ధే, సంధ్యాః; ఆకారాన్త స్త్రీలింగ సంధ్యాశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) ఇవ - అవ్యయము. 9) ధాతుమత్తామ్ - మతుప్ ప్రత్యయము. ధాతు+ మతుప్ + తల్ + టాప్. **ధాతుమత్తామ్,** ధాతుమత్తామ్, ధాతుమత్తే, ధాతుమత్తాః; ఆకారాన్త స్త్రీలింగ ధాతుమత్తాశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.



***సమాసాలు :-***

1) అప్సరోవిభ్రమమణ్డనానామ్ - విభ్రమేణమణ్డనమ్ (తృతీయతత్పురుష) విభ్రమమణ్డనమ్; అప్సరసాం విభ్రమమణ్డనమ్ (షష్ఠీతత్పురుష) తేషామ్.

2) బాలాహకచ్ఛేద విభక్తరాగామ్ - బలాహకానాం ఛేదాః (షష్ఠీతత్పురుష), బలాహకచ్ఛేదాః, బలాహకచ్ఛేదేషు విభక్తిః (సప్తమీతత్పురుష), రాగో యయా (బహుబ్రీహి), తామ్.

3) అకాలసన్ధ్యామ్ - అకాలే సన్ధ్యా (సప్తమాతత్పురుష) తామ్.

***సంధులు :-***

1) యః+చ = యశ్చ, **శ్చుత్వసన్ధిః, స్తోఃశ్చునా శ్చుః** (సూ 8-4-39)

2) చ+అప్సరో = చాప్సరో, సవర్ణదీర్ఘసన్ధిః

***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగములు.***

1. **అప్సరసః -**

ఎ) అప్సరశ్శబ్దము స్త్రీలింగము నందే బహువచనము నందే ప్రయోగింపబడును. 'స్త్రియాం బహుష్వప్సరసః' అని అమరము.

బి) జలము నందు పుట్టినవారు అప్సరసలు. 'అద్భ్యః సరన్తి ఉద్గచ్ఛన్తీతి అప్సరసః.

సి) అందఱిని ధైర్యము నుండి స్ఖలింపచేయువారు. అప్సరసలు. ***"అపసారయన్తి స్ఖాలయన్తి ధైర్యాత్ సర్వాన్ ఇతి అప్సరసః."***

డి) *శ్లో॥ ఘృతాచీ మేనకా రమ్భా ఉర్వశీ చ తిలోత్తమా ।*
*సుకేశీ మంజుఘోషాద్యాః కథ్యతే ఽ ప్సరసో బుధైః॥* *హలాయుధకోశః 88.*

*శ్లో॥ అప్సు నిర్మథనాదేవ రసాత్తస్మాద్వరస్త్రియః ।*
*ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽ భవన్ ॥* రామాయణమ్.

ఎఫ్) సాధారణంగా ఈ శబ్దము ఏకవచనం 'అప్సరా' గా కూడా కనబడుతుంది.
*నియమవిఘ్నకారిణీ మేనకా నామ అప్సరాః ప్రేషితా' -అభిజ్ఞానశకుంతలమ్ 1.*

జి) **Bana** mentions 14 different families of these nymphs. ('కాదంబరి' చూడగలరు.)

2. **విభ్రమః :-** 1) త్వరచేత భూషణాలను తాఱుమాఱుగా ధరించుటను అలంకారశాస్త్రానుసారము 'విభ్రమ' మందురు.

*శ్లో॥ "త్వరయా హర్షరాగాదేర్దయితాగమనాదిషు।*
*అస్థానే భూషణాదీనాం విన్యాసో **విభ్రమో** మతః॥" -సాహిత్యదర్పణమ్, 3-104.*
*'**విభ్రమ**స్త్వరయాఽకాలే భూషాస్థానవిపర్యయే' -దశరూపకమ్.*

త్వరచేత భూషణాలను తాఱుమాఱుగా కాలంగాని కాలములో ధరించుటను **'విభ్రమ'** మందురు.

శ్లో॥ *కామౌత్సుక్యకృతాకారం రూపయౌవనసంపదా।*
*అనవస్థితచేష్టత్వం విభ్రమః పరికీర్తితః॥"* –నాట్యశాస్త్రమ్.

శ్లో॥ *"వల్లభప్రాప్తివేలాయం మదనావేశసంభ్రమాత్।*
*విభ్రమో హారమాల్యాదిభూషాస్థానవిపర్యయః॥"* –ఉజ్జ్వలనాలమణిః

3. **వలాహకః – బలాహకః** –1. వలాహకము (బలాహకము) అనగా మబ్బు. బలం న జహాతి ఇతి బలాహకః.ఓహాక్ త్యాగే. వబయోరభేదాత్ వలాహకః – అని లింగాభట్టీయము. జలములకు వాహకములు గనుక మబ్బులకు వలాహకములని పేరు. వారీణాం వాహకం వలాహకా మేఘాః. పృషోదరాదిత్వాత్ సాధుః.

2. **పృషోదరాదీని యథోపదిష్టమ్** (సూ. 6–3–108) – పృషోదరమ్ మున్నగునవి యథాప్రయోగముగ గ్రహింపదగినవి. దీని యందు వర్ణలోప, వర్ణాగమ, వర్ణవిపర్యయ, వర్ణవికృతులు జరిగినట్లూహింపవలెను. ఉదా: పృషతః ఉదరమ్ – పృషోదరమ్ – ఇందు తకారలోపము వచ్చినది. వారి వహతి ఇతి–వారి వాహకః–వలాహకః–ఇందు పూర్వపదము (వారి) నకు వ ఆదేశము, ఉత్తరపదాది (వా) వకారమునకు లకారము వచ్చినది.

శ్లో॥ ***అభ్రమబ్దో ఘనో మేఘః స్తనయిత్నుః పయోధరః ।***
***ధారాధరో ధూమయోనిర్జీమూతశ్చ బలాహకః ।***

అని మేఘమునకు (మబ్బునకు) పది నామములను హలాయుధకోశము (58) పేర్కొన్నది.

***క్రియాదర్శము :–*** 1) **'బిభర్తి'** – డుభృఞ్ (భృ) ధారణ పోషణయోః (ధరించుట, పోషించుట). జుహోత్యాది ప్రకరణమ్ (3), సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ. **బిభర్తి** – బిభృతః, బిభ్రతి ప్రథమపురుష ఏకవచనము.

2) ..... *బిభర్తి ధృతిపోషణయోః । తమీర్దధాతి దానే చాభిదధాత్యుక్తిబన్ధయోః ।*
*శ్రద్దధాతి తు విస్రమ్భస్పృహయోః పంచ చాత్మనే ॥ –అఖ్యాతచన్ద్రికా, 3–3–161.*

3) డుధాఞ్ (ధా) – ధారణ పోషణయోః (ధరించుట, పోషించుట) సకర్మకమ్, అనిట్, ఉభయపదీ, జుహోత్యాదిప్రకరణమ్. 1. దధాతి – ధత్తః – దధతి. 2. ధత్తే – దధాతే– దధతే. మొ॥

***అలంకారములు :–*** అత్ర సన్ధ్యాశబ్దస్య జాతివాచిత్వాజ్జాత్యుత్ప్రేక్షా. 'అకాలసన్ధ్యామ్ ఇవ'– సన్ధ్యాశబ్దము జాతివాచకము. దండి మహాశయుడు 'కావ్యాదర్శము'న ఇచ్చిన లక్షణము దిగువ నీయబడినది. 2–234.

మూ. *మన్యే శఙ్కే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।*
*ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥*





శ్లో॥ **ఆమేఖలం సఞ్చరతాం ఘనానాం**
**ఛాయామధస్సానుగతాం నిషేవ్య ।**
**ఉద్వేజితా వృష్టిభిరాశ్రయన్తే**
**శృఙ్గాణి యస్యాతపవన్తి సిద్ధాః ॥** **5**

***పదవిభాగము :–*** ఆమేఖలమ్, సఞ్చరతామ్, ఘనానామ్, ఛాయామ్, అధః, సానుగతామ్, నిషేవ్య, ఉద్వేజితాః, వృష్టిభిః, ఆశ్రయన్తే, శృఙ్గాణి, యస్య, ఆతపవన్తి, సిద్ధాః.

***అన్వయక్రమము :–*** సిద్ధాః, ఆమేఖలమ్, సఞ్చరతామ్, ఘనానామ్, అధః, సానుగతామ్, ఛాయామ్, నిషేవ్య, వృష్టిభిః, ఉద్వేజితాః, (సన్తః), యస్య, ఆతపవన్తి, శృఙ్గాణి, ఆశ్రయన్తే.

***ప్రతిపదార్థము :–*** సిద్ధాః = విశ్వవస్వాది సిద్ధజాతులు, ఆమేఖలమ్ = పర్వతసానువుల వఱకును, సఞ్చరతామ్ = తిరుగుచున్న, ఘనానామ్ = మేఘముల యొక్క, ఛాయామ్= నీడను, అధః = క్రిందనున్న, సానుగతామ్ = దరులను పొందియున్న దానిని, నిషేవ్య = అనుభవించి, వృష్టిభిః = వానల చేత, ఉద్వేజితాః (సన్తః) = చీకాకు పెట్టబడినవారై, యస్య = ఆ హిమవంతుని యొక్క, ఆతపవన్తి = ఎండగలవైన, శృఙ్గాణి = అగ్రములను, ఆశ్రయన్తే = చేరుదురు.

***తాత్పర్యము :–*** విశ్వావస్వాది సిద్ధజాతులు, పర్వతసానువుల వఱకును తిరుగుచున్న మేఘముల నీడను క్రిందనున్న దరులను పొందియున్న దానిని అనుభవించి, వానలచేత చీకాకుపెట్టబడినవారై, ఆ హిమవంతుని యొక్క ఎండగలవైన అగ్రములను చేరుదురు.

***విభక్తులు/క్రియలు :–*** 1) అమేఖలమ్ – 'మేఖలామభివ్యాప్య', అవ్యయీభావ సమాసము. ఆఙ్ మర్యాదాభివిధ్యోః (సూ. 2–1–12). మర్యాద, అభివిధి అను అర్థములలోని ఆఙ్ పంచమ్యన్తములో వికల్పముగా సమాసమునొందును. క్రియా విశేషణము, అవ్యయము. 2) సంచరతామ్ – సంచారతః, సంచారతోః, **సంచారతామ్;** తకారాన్త పుంలింగ సంచరత్‌శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 3) ఘనానామ్ – ఘనస్య, ఘనయోః, **ఘనానామ్;** అకారాన్త పుంలింగ ఘనశబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 4) ఛాయామ్ – **ఛాయామ్,** ఛాయే, ఛాయాః; ఆకారాన్త స్త్రీలింగ ఛాయాశబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) అధః – అవ్యయము, 6) నిషేవ్య – ని+సేవ్+క్త్వా, (ల్యప్) అవ్యయము. 7) ఉద్వేజితాః – ఉద్వేజితః, ఉద్వేజితే, **ఉద్వేజితాః;** అకారాన్త పుంలింగ ఉద్వేజితశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 8) వృష్టిభిః – వృష్టినా, వృష్టిభ్యామ్, **వృష్టిభిః;** ఇకారాన్త స్త్రీలింగ వృష్టిశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 9) ఆశ్రయన్తే – క్రియ. 10) శృఙ్గాణి – శృఙ్గమ్, శృఙ్గే, **శృఙ్గాని;** అకారాన్త నపుంసకలింగ శృఙ్గశబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము. 11) యస్య – **యస్య,** యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 12) ఆతపవన్తి – ఆతపవత్, ఆతపవన్తీ, **ఆతపవన్తి;** తకారాన్త నపుంసకలింగ ఆతపవత్‌శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము, ఆతప+మతుప్. 13) సిద్ధాః – సిద్ధః, సిద్ధా, సిద్ధాః; అకారాన్త పుంలింగ సిద్ధశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) ఆమేఖలమ్ – మేఖలామభివ్యాప్య (అవ్యయయీభావసమాసం),
2) అధస్సానుగతామ్ – అధః స్థితాని సానూని – అధస్సానూని (మధ్యమపదలోపి కర్మధారయ), అధస్సానూని గతామ్ (ద్వితీయాతత్పురుష).

**సంధులు :-**

1) వృష్టిభిః + ఆశ్రయన్తే = వృష్టిభిరాశ్రయన్తే, విసర్గసంధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగములు.**

1. సిద్ధాః - అష్టసిద్ధులు సిద్ధించుకొన్నవారు / గంధర్వులు విశ్వవస్వాది సిద్ధజాతులు.

శ్లో॥ *జగుర్మహేంద్రాసనమోజసా స్థితం - విశ్వవసుస్తుమ్బురురస్మదాదయః ।*
*గన్ధర్వసిద్ధా ఋషయోఽ స్తువన్ ముహుర్విద్యాధరాశ్చాప్సరసశ్చ పాణ్డవ ॥*
*శ్రీమద్భాగవతము, 7-4-14.*

నారదుడు - హిరణ్యకశిపునితో పలికిన పలుకులివి.

అష్టసిద్ధులు - ఇవి యోగసాధన, మంత్రజపాదుల వల్ల లభించే అతిమానుషశక్తులు. అణిమా, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి అష్టసిద్ధులు.

1) అణిమా - అణువంతగానగుట. 2)మహిమా - కొండంతగా, అనగా అతిపెద్దగా నగుట. 3) గరిమా - చెప్పరానంతగా బరువగుట. 4) లఘిమా - దూదిపింజవలె, గాలివలె తేలికయగుట. 5)ప్రాప్తి - తాను కోరినంతనే దేనినైన సిద్ధింపచేసికొనుట. 6) ప్రాకామ్యం - సంకల్పించినదానిని సాకారము చేయగల్గుట. 7) ఈశిత్వం - అన్నిటికి తానే యజమాని యగుట. 8) వశిత్వం - ప్రకృతిలోని దేనినైన తన వశమందుంచికొనుట. ఈ అష్టసిద్ధులు శరీరాలు ధరించి అనగా జంగమ శరీరాలతో హిమాలయ పర్వత భూముల మీద విహరిస్తున్నాయని చెప్పవచ్చు.

బి) ***'ఊహః శబ్దోఽ ధ్యయనం దుఃఖవిఘాతాస్త్రయస్సుహృత్ప్రాప్తిః దానం చ సిద్ధయోఽ ష్టౌ".*** - *సాంఖ్యకారికలు.* 1) ఊహము, 2) శబ్దము, 3) అధ్యయనము, 4) ఆధ్యాత్మికదుఃఖవిఘాతము, 5) ఆధిభౌతిక దుఃఖవిఘాతము, 6) ఆధిదైవిక దుఃఖవిఘాతము, 7. సుహృత్ప్రాప్తి, 8) దానము.

**క్రియాదర్శము :- ఆశ్రయన్తే** - ఆ+శ్రయన్తే

1) శ్రిఞ్ (శ్రి) సేవాయామ్ (సేవించుట), భ్వాదిప్రకరణమ్ (1) సకర్మకమ్, సేట్, (ఉభయ) ఆత్మనేపదీ. శ్రయతే - శ్రయేతే - **శ్రయన్తే**. లట్ ప్రథమపురుషైకవచనము.

2) శ్లో॥ *సేవతే జుషతే చాపి శేవతే క్లేవతేఽ పి చ ।*
*ఖేవతే గేవతే చాపి గ్లేవతే పేవతే తథా ।*
*మేవతే చాపి సేవాయాం భజతి శ్రయతీతి చ ॥*
*ఆత్మనేఽ నురుణద్ధ్వేఽ నుసరత్యనువర్తనే । -ఆఖ్యాతచన్ద్రికా. 2-3-13.*

**అలంకారములు :-** పరికరాలంకారము ఇందు గలదు. "వృష్టిభిః,ఉద్వేజితాః" అనునవి "సిద్ధాః" అనే విశేష్యానికి విశేషణములు, అట్లే "ఆతపవన్తి" అనేది 'శృంగాణి' అనే విశేష్యానికి విశేషణము ఉపయోగించి, విశేష్యంలో ఒక విధమైన వైశిష్ట్యాన్ని సూచించుటచే - పరికరాలంకారమని చెప్పబడినది.

***ఉక్తిర్విశేషణైః సాభిప్రాయైః పరికరో మతః*** అని లక్షణము.





శ్లో॥ **పదం తుషారస్రుతిధౌతరక్తం**
**యస్మిన్నదృష్ట్వాపి హతద్విపానామ్ ।**
**విదన్తి మార్గం నఖరన్ధ్రముక్తై -**
**ర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః ॥ 6**

**పదవిభాగము :-** పదమ్, తుషారస్రుతిధౌతరక్తమ్, యస్మిన్, అదృష్ట్వా, అపి, హతద్విపానామ్, విదన్తి, మార్గమ్, నఖరన్ధ్రముక్తైః, ముక్తాఫలైః, కేసరిణామ్, కిరాతాః.

**అన్వయక్రమము :-** యస్మిన్, కిరాతాః, తుషారస్రుతిధౌతరక్తమ్, హతద్విపానామ్, కేసరిణామ్, పదమ్, అదృష్ట్వా, అపి నఖరన్ధ్రముక్తైః, ముక్తాఫలైః, మార్గమ్, విదన్తి.

**ప్రతిపదార్థము :-** యస్మిన్ = ఏ హిమవత్పర్వతమందు, కిరాతాః = బోయలు, తుషారస్రుతిధౌతరక్తమ్ = మంచు ప్రవాహము చే కడుగబడిన రక్తము గల, హతద్విపానామ్= చంపబడిన ఏనుగులు గల, కేసరిణామ్ = సింహములయొక్క, పదమ్ = జాడను, అదృష్ట్వా అపి = చూడకున్నను, నఖరన్ధ్రముక్తైః = గోళ్లయొక్క దోనెలచే వదలబడిన, ముక్తాఫలైః= ముత్యములచేత, మార్గమ్ = దారిని, విదన్తి = తెలిసికొందురు.

**తాత్పర్యము :-** ఆ హిమవత్పర్వతమందు బోయలు మంచుప్రవాహము చే కడుగబడిన రక్తముగల, చంపబడిన ఏనుగులు గల, సింహములయొక్క జాడను చూడకున్నను గోళ్లయొక్క దోనెలచే వదలబడిన ముత్యముల చేత దారిని తెలిసికొందురు.

**విభక్తులు / క్రియలు :-** 1) పదమ్ - **పదమ్,** పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) తు...రక్తమ్ - **రక్తమ్,** రక్తే, రక్తాని; అకారాన్త నపుంసకలింగ రక్తశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) యస్మిన్ - **యస్మిన్,** యయోః, యేషు; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 4) అదృష్ట్వా - క్త్వా ప్రత్యయాన్తము, అవ్యయము. 5) హతద్విపానామ్ - ద్విపస్య, ద్విపయోః, **ద్విపానామ్;** అకారాన్త పుంలింగ ద్విపశబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 6) విదన్తి - క్రియ. 7) మార్గమ్ - **మార్గమ్,** మార్గే, మార్గాని; అకారాన్త నపుంసకలింగ మార్గశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) నఖరన్ధ్రముక్తైః - ముక్తేన, ముక్తాభ్యామ్, ముక్తైః; అకారాన్త నపుంసకలింగ ముక్తశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 9)ముక్తాఫలైః - ఫలేన, ఫలాభ్యామ్, **ఫలైః;** అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 10) కేసరిణామ్ - కేసరిణః, కేసరిణోః, కేసరిణామ్; నకారాన్త పుంలింగ కేసరిన్‌శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 11) కిరాతాః - కిరాతః, కిరాతౌ, **కిరాతాః;** అకారాన్త పుంలింగ కిరాతశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

**సమాసాలు :-**

1) తుషారస్రుతిధౌతరక్తమ్ - తుషారాణాం స్రుతయః (ష.త.) తుషారస్రుతయః, తుషారస్రుతిభిః ధౌతమ్ (తృ.త.) తుషారస్రుతిధౌతమ్; తుషారస్రుతిధౌతమ్ రక్తమ్ యస్య (బహువ్రీహి) తత్.

2) హతద్విపానామ్ - హతా ద్విపా యైః (బహువ్రీహి) తే హతద్విపాః, తేషామ్.

3) నఖరన్ధ్రముక్తైః - నఖానాం రన్ధ్రాణి (ష.త.) నఖరన్ధ్రాణి; నఖరన్ధ్రేభ్యో ముక్తాని (ష.త.) నఖరన్ధ్రముక్తాని తైః.

4) ముక్తాఫలైః – ముక్తా ఏవ ఫలాని, తైః (మయూరవ్యంసకాది సమాసం) **'మయూరవ్యంసకాదయశ్చ'** (సూ 2-1-71) అనేక విధములైన సమాసములీ గణము నందు నిపతింపబడినవి.

***సంధులు :–*** నఖరన్ధ్రముక్తైః + ముక్తాఫలైః = నఖరన్ధ్రముక్తైర్ముక్తాఫలైః. విసర్గసన్ధిః

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.***

**1) ముక్తాః –**

ఎ) ముచ్ + క్త + టాప్, ముచ్యతే స్మ । మోచ్యతే నిస్సార్యతే ఇతి వా। అని హలాయుధకోశము.

బి) ఉక్తా ముక్తా మౌక్తికం శౌక్తికేయమ్ అని 3 నామములను 'ముత్తెము' నకు చెప్పబడినవి.

సి) శ్లో॥ *రేవత్యశ్విధనిష్ఠాసు హస్తాదిషు చ పంచసు ।*
*శంఖవిద్రుమముక్తానాం పరిధానం ప్రశంస్యతే ॥* – ఇతి సమయప్రదీపః.

సి) **ముక్తాః –** *శ్లో॥ ద్విపేన్ద్రజీమూతవరాహశఙ్ఖమత్స్యాహిశక్త్యుద్భవవేణుజాని ।*
*ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం తు శుక్త్యుద్భవమేవ భూరి ॥*
*– గరుడపురాణం.*

ఏనుగుల నుండి, మేఘముల నుండి, వరాహాలనుండి, శంఖాల నుండి, మత్స్యాల నుండి, సర్పాల నుండి, ముత్యపు చిప్పల నుండి, వెదుళ్ళనుండి ముత్తెములు ఉద్భవిస్తాయని శాస్త్రవచనము. ముత్యపుచిప్పల నుండి జాలువారే ముత్యాలే శ్రేష్ఠమైనవి.

**2) 'విదన్తి' –**

ఎ) విద్ – విద (విద్) జ్ఞానే (తెలియుట). అదాది ప్రకరణమ్ (2); సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లట్ ప్రథమపురుష రూపాలు. వేద – విదతుః – విదుః.

బి) విద్ – విద (విద్) సత్తాయామ్ (ఉండుట), దివాదిప్రకరణమ్ (4); అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. లట్ ప్రథమపురుషరూపాలు – విద్యతే – విద్యేతే – విద్యన్తే.

సి) విద్ – విద్ల (విద్) లాభే (పొందుట) తుదాదిప్రకరణమ్ (6); సకర్మకమ్, భాష్యమతే అనిట్, వ్యాఘ్రభూతిమతేసేట్, ఉభయపదీ. లట్ప్రథమపురుషరూపాలు – విన్దతి – విన్దతః – **విన్దన్తి** – పరస్మైపదీ విన్దతే – విన్దేతే – విన్దన్తే – ఆత్మనేపదీ.

డి) విద్ – విద (విద్) విచారణే (ఆలోచించుట) తనాదిప్రకరణమ్ (8) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. లట్ ప్రథమపురుషరూపాలు – విన్తే – విన్వాతే – విన్దతే.

ఇ) విద్ – విద (విద్) చేతనాఖ్యాననివాసేషు (తెలివినొందుట, చెప్పుట, వసించుట) సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ. చురాది ప్రకరణమ్ (10). లట్ ప్రథమపురుషరూపాలు – వేదయతే – వేదయేతే – వేదయన్తే.



ఎఫ్) *"సత్తాయాం విద్యతే, జ్ఞానే వేత్తి, విన్తే విచారణే ।*
*విన్దతే విన్దతి ప్రాప్తౌ, రూపభేదో విదేస్స్మృతః ॥"*

'విద్' ధాతురూపభేదాలు (5 రకములు) చెప్పబడినవి.

జి) ***'విదో లటోవా' వేత్తేర్లటః పరస్మైపదానాం ణలాదయోం వా స్యుః।***
***ఇతి ణలోఽ భావపక్షే –***

ప్రథమపురుష రూపాలు – వేత్తి –విత్తః – **విదన్తి.**

***క్రియాదర్శము :–*** పదవ్యుత్పత్తి లో ఇవ్వబడినది.

***అలంకారములు :–*** ఇచట 'అలౌకిక వస్తు వర్ణన' వలన ఉదాత్తాలంకారము ఉన్నదని చెప్పదగును.

***లక్షణమ్ : శ్లో॥ ఆశయస్య విభూతేర్వా యన్మహత్త్వమనుత్తమమ్ ।***
***ఉదాత్తం నామ తం ప్రాహురలంకారం మనీషిణః ॥***
***– కావ్యాదర్శః ద్వితీయపరిచ్ఛేదః – 300***

అభిప్రాయముయొక్క గాని, ఐశ్వర్యముయొక్క గాని ఏ అత్యుత్తమమైన గొప్పతనము గలదో దానిని విద్వాంసులు 'ఉదాత్త' మనెడి అలంకారముగా చెప్పుదురు. ❀

**శ్లో॥ న్యస్తాక్షరా ధాతురసేన యత్ర**
**భూర్జత్వచః కుఞ్జరబిన్దుశోణాః ।**
**వ్రజన్తి విద్యాధరసున్దరీణా–**
**మనఙ్గలేఖ క్రియయోపయోగమ్ ॥ 7**

***పదవిభాగము :–*** న్యస్తాక్షరాః, ధాతురసేన, యత్ర, భూర్జత్వచః, కుఞ్జర బిందుశోణాః, వ్రజన్తి, విద్యాధరసున్దరీణామ్, అనఙ్గలేఖక్రియయా, ఉపయోగమ్।

***అన్వయక్రమము :–*** యత్ర, ధాతురసేన, న్యస్తాక్షరాః, కుఞ్జరబిన్దుశోణాః, భూర్జత్వచః, విద్యాధరసున్దరీణామ్, అనఙ్గలేఖక్రియయా, ఉపయోగమ్, వ్రజన్తి।

***ప్రతిపదార్థము :–*** యత్ర = ఆ హిమవన్నగము నందు, ధాతురసేన = సిందూరాదిగైరిక ధాతువుల ద్రవముతో, న్యస్తాక్షరాః = ఉంచబడిన (వ్రాయబడిన) వర్ణములు గలవియు, కుఞ్జరబిందుశోణాః = ఏనుగుల పొడలవలె ఎఱ్ఱనివియు అయిన, భూర్జత్వచః = భుజపత్ర వృక్షముల పట్టలు, విద్యాధరసున్దరీణామ్ = విద్యాధరాంగనలకు, అనఙ్గలేఖక్రియయా = మదన సంబంధ జాబులయొక్క చేత చేత, ఉపయోగమ్ = ఉపయోగమును, వ్రజన్తి = పొందుచున్నది.

***తాత్పర్యము :–*** ఆ హిమవన్నగమునందు సిందూరాది గైరిక ధాతువుల ద్రవముతో వ్రాయబడిన వర్ణములుగలవియు, ఏనుగుల పొడలవలె ఎఱ్ఱనివియు అయిన భుజపత్ర వృక్షముల పట్టలు, విద్యాధరాంగనలకు మదన సంబంధ జాబుల యొక్క చేత చేత ఉపయోగమును పొందుచున్నవి.

***విభక్తులు / క్రియలు :–*** 1) న్యస్తాక్షరాః – న్యస్తాక్షరా, న్యస్తాక్షరే, **న్యస్తాక్షరాః;** ఆకారాన్త స్త్రీలింగ న్యస్తాక్షరాశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 2) ధాతురసేన – **ధాతురసేన** – ధాతురసాభ్యామ్ – ధాతురసైః; అకారాన్త పుంలింగ రసశబ్దము. తృతీయావిభక్తి ఏకవచనము. 3) యత్ర – తద్ధితాన్తావ్యయము, త్రల్ ప్రత్యయాన్తము. 4) భూర్జత్వచః – త్వక్, త్వచౌ, **త్వచః;** చకారాన్త స్త్రీలింగ త్వక్శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము, కర్తృపదము. 5) కుఞ్జరబిన్దుశోణాః – శోణా, శోణౌ, **శోణాః;** ఆకారాన్త స్త్రీలింగ కుఞ్జరబిందుశోణాశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 6) వ్రజన్తి – క్రియ. 7) విద్యాధరసున్దరీణామ్ – సున్దర్యాః, సున్దర్యోః, **సున్దరీణామ్;** ఈకారాన్త స్త్రీలింగ సున్దరీశబ్దము. షష్ఠీవిభక్తి బహువచనము. 8) అనఙ్గలేఖక్రియయా – **క్రియయా,** క్రియాభ్యామ్, క్రియాభిః; ఆకారాన్త స్త్రీలింగ క్రియాశబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) ఉపయోగమ్ – **ఉపయోగమ్**, ఉపయోగమౌ, ఉపయోగాన్; అకారాన్త పుంలింగ ఉపయోగశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) ధాతురసేన – ధాతూనాం రసః (ష.త.) తేన.
2) న్యస్తాక్షరాః – న్యస్తాని అక్షరాణి యాసు (బహువ్రీహి) తాః.
3) కుంజరబిందుశోణాః – కుంజరాణాం బిందువః (ష.త.) కుంజరబిందువః, కుంజరబిందువ ఇవ శోణాః (ఉపపద కర్మధారయ).
4) భూర్జత్వచః – భూర్జానాం త్వచః (ష.త.).
5) విద్యాధరసుందరీణామ్ – విద్యాధరాణాం సుందర్యః (ష.త.) తాసామ్.
6) అనఙ్గలేఖక్రియయా – అనఙ్గస్య లేఖాః (ష.త.) అనఙ్గలేఖానాం క్రియా (ష.త.) తయా.

***సంధులు :–***

1) న్యస్తాక్షరాః + ధాతురసేన – న్యస్తాక్షరా ధాతురసేన – విసర్గలోపసంధి.
2) క్రియయా + ఉపయోగమ్ – క్రియయోపయోగమ్ – గుణసంధి.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.***

1. **కుఞ్జరః –**

ఎ) కుంజరము (ఏనుగు) "కుంజౌ కుంభాధో గర్తౌ అస్యస్తః ఇతి కుంజరః – కుంజములనగా కుంభస్థలములకు దిగువ నుండు గుంతలు. అవి కలిగినవి గనుక 'కుంజర'మని పేరు.

బి) ***హస్తీ మతంగజద్విపకర్యనేకపా మతంగ వారణమహామృగసామయోనయః । స్తమ్బేరమ ద్విరదసిన్ధుర నాగదన్తినో దన్తాబలః కరటికుంజర కుమ్భిపీలవః ॥ ఇభఃకరేణ్వగ్గర్జో....***



'ఏనుగు'కు –23 నామములను పేర్కొనుటయే కాక, వాటిలో వివిధ జాతులనూ పేర్కొంది. –అభిధానచిన్తామణి. 4–283.

భద్రః, మందః, మృగః, మిశ్రః,....

సి) మత్వర్థీయ ప్రకరణమ్ : మత్వర్థీయాః (మత్వర్థీయములు) అది దీనికి (వీనికి) కలదు, అది దీని యందు (వీని యందు) కలదు అను అర్థమున ప్రథమాన్తముపై మతుప్ మున్నగు ప్రత్యయములు చెప్పబడినవి. వీనిని 'మత్వర్థీయము'లందురు.

కుంజౌ కుంభాధో గర్తౌ అస్యస్తః ఇతి కుంజరః

***"ఊషసుషిముష్కమధో రః ।" (5–2–107)***

***వా॥ రప్రకరణే ఖముఖకుంజేభ్య ఉపసంఖ్యానమ్ (3198).***

***ఖరః । ముఖరః । కుంజో హస్తి హనుః । కుంజరః ।***

***క్రియాదర్శము :–*** **వ్రజన్తి** – 1) వ్రజ (వ్రజ్) గతౌ (వెళ్ళుట), భ్వాదిప్రకరణమ్ (1), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లట్ ప్రథమపురుషరూపాలు– వ్రజతి – వ్రజతః – **వ్రజన్తి.**

2) శ్లో॥ *ప్రతిష్ఠతేఽ ఇత్యయతే వ్రజత్యయతి గచ్ఛతి ।*
*ఋుణోత్యటతి యాత్యేతి సరతీయర్తి సర్పతి ॥* 104

శ్లో॥ *శునతి భజ్జయతి చ శ్వర్తయత్యపి రేవతే ।*
*ససర్తి చ్ఛాన్దసం కేచిదేషతే నేషతే గతౌ ॥* 111
*సప్తాశీతిరితోఽ ప్యన్యే నోక్తా విస్తరతో భయాత్ ।*

అని 'ఆఖ్యాతచన్ద్రికా' పేర్కొంది. 'ఆఖ్యాతచన్ద్రికా' రచయిత 'శ్రీభట్టమల్లు' నకు నమస్సుమాంజలులు.

***అలంకారములు :–*** 'ఉదాత్తాలంకారము'. ఇందు, 'హిమాలయముల అలౌకికమహిమ' వర్ణింపబడుటచే, 'ఉదాత్తాలంకారమున్నదని చెప్పదగును.

**శ్లో॥ యః పూరయన్ కీచకరంధ్రభాగాన్**
**దరీముఖోత్థేన సమీరణేన ।**
**ఉద్గాస్యతామిచ్ఛతి కిన్నరాణాం**
**తానప్రదాయిత్వమివోపగన్తుమ్ ॥ 8**

***పదవిభాగము :–*** యః, పూరయన్, కీచకరంధ్రభాగాన్, దరీముఖోత్థేన, సమీరణేన, ఉద్గాస్యతామ్, ఇచ్ఛతి, కిన్నరాణామ్, తానప్రదాయిత్వమ్, ఇవ, ఉపగన్తుమ్.

***అన్వయక్రమము :–*** యః, దరీముఖోత్థేన, సమీరణేన, కీచకరంధ్ర భాగాన్, పూరయన్, ఉద్గాస్యతామ్, కిన్నరాణామ్, తాన ప్రదాయిత్వమ్, ఉపగన్తుమ్, ఇచ్ఛతీవ.

***ప్రతిపదార్థము :–*** యః = ఆ హిమవంతుడు, దరీముఖోత్థేన = గుహ అనెడి నోటి నుండి

వెడలిన, సమీరణేన = గాలి చేత, కీచకరంధ్రభాగాన్ = బొంగు వెదుళ్ళ బెజ్జముల యొక్క ప్రదేశములను, పూరయన్ = ఊదుచున్నవాడై, ఉద్గాస్యతామ్ = ఉచ్చస్థాయిలో పాడనున్నట్టి, కిన్నరాణామ్ = దేవగాయకులకు, తానప్రదాయిత్వమ్ = 'తాన'మును ఇచ్చు వాడగుటను, ఉపగన్తుమ్ = పొందుటకు, ఇచ్ఛతీవ = కోరుచున్నాడో యనునట్లు ఒప్పును.

***తాత్పర్యము :–*** ఆ హిమవంతుడు గుహ అనెడి నోటి నుండి వెడలిన గాలిచేత బొంగు వెదుళ్ళ బెజ్జముల యొక్క ప్రదేశములను ఊదుచున్నవాడై, ఉచ్చస్థాయిలో పాడనున్నట్టి దేవగాయకులకు 'తాన'మును ఈయగోరుచున్నాడా అన్నట్లు ఒప్పుచున్నాడు.

***విభక్తులు / క్రియలు :–*** 1) యః – **యః,** యౌ, యే; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) పూరయన్ – **పూరయన్,** పూరయన్తౌ, పూరన్తః; పుంలింగ శత్రన్తో పూరయత్‌శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) కీచకరంధ్రభాగాన్ – భాగమ్, భాగౌ, భాగాన్; అకారాన్త పుంలింగ 'భాగ'శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 4) దరీముఖోత్థేన – **ఉత్థేన,** ఉత్థాభ్యామ్, ఉత్థైః; అకారాన్త పుంలింగ 'ఉత్థ' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 5) సమీరణేన – **సమీరణేన,** సమీరణాభ్యామ్, సమీరణైః; అకారాన్త పుంలింగ 'సమీరణ'శబ్దము. తృతీయావిభక్తి ఏకవచనము. 6) ఉద్గాస్యతామ్ – ఉద్గాస్యతః, ఉద్గాస్యతోః, **ఉద్గాస్యతామ్;** శత్రన్తో౽భ్యస్త సంజ్ఞకో పుంలింగ 'ఉద్గాస్యత్'శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 7) ఇచ్ఛతి – క్రియ. 8) కిన్నరాణామ్ – కిన్నరస్య, కిన్నరయోః, **కిన్నరాణామ్;** అకారాన్త పుంలింగ 'కిన్నర'శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 9) తానప్రదాయిత్వమ్ – (తాన + ప్ర + దా + ణిని + త్వ) – **ప్రదాయిత్వమ్,** ప్రదాయిత్వే, ప్రదాయిత్వాని; అకారాన్త నపుంసకలింగ ప్రదాయిత్వశబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) ఇవ = అవ్యయము. 11) ఉపగన్తుమ్ – ఉప + గమ్ + తుమ్ (తుమున్) కృదన్తమ్, అవ్యయము.

***సమాసాలు :–***

1) దరీముఖోత్థేన – దరీ ఏవ ముఖమ్ (మయూరవ్యంసకాది), దరీముఖమ్, దరీముఖాత్ ఉత్తిష్ఠతీతి దరీముఖోత్థః తేన.
2) కీచకరంధ్రభాగాన్ – కీచకరన్ధ్రాణాం భాగాః (ష.త.)తాన్.
3) తానప్రదాయిత్వమ్ – తానం ప్రదాతుం శీలం యస్య (ఉపపద సమాసము) సః, తస్య భావః ।

***సంధులు :–***

1) దరీముఖ + ఉత్థేన = దరీముఖోత్థేన. గుణసన్ధిః, ఆద్గుణః (సూ.6–1–84).
2) ఇవ + ఉపగన్తుమ్ = ఇవోపగన్తుమ్, గుణసన్ధిః.

***పాఠాంతరాలు :–*** 1. తానప్రదాయిత్వమ్ – స్థానప్రదాయిత్వమ్.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.***

1. కీచకరంధ్రభాగాన్ –

ఎ) శ్లో॥ *సః కీచకైర్మారుతరంధ్రైః కూజద్భిరాపాదితవంశకృత్యమ్ ।*
*శుశ్రావ కుంజేషు యశస్స్వముచ్చైః ఉద్గీయమానం వనదేవతాభిః ॥*
*– రఘువంశమ్ –2–12.*



'ఆ దిలీపమహారాజు వెదుళ్ళలో గాలి చేరి తానం కలిగిన శ్రావ్యమైన వేణునాదములను వినెను....'

బి) శ్లో॥ *భూర్జేషు మర్మరీభూతాః కీచకధ్వని హేతవః ।*
*గంగాశీకరిణో మార్గే మరుతస్తం సిషేవిరే ॥ ర.వం. 4–73.*

సి) శ్లో॥ *చీకయతేరాద్యన్తవిపర్యశ్చ । కీచకో వంశభేదః ॥ ఉణాదిప్రకరణమ్–714. (5–56).*

డి) శ్లో॥ *శబ్దాయన్తే మధురమనిలైః కీచకాః పూర్యమణాః*
*సంసక్తాభిస్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః ।*
*..... ....సమగ్రః ॥ మేఘదూతమ్ 56.*

హిమవత్పర్వతమున వాయువులచేత నింపబడినవై, ధ్వననమును కలిగించు వేణువులు ఇంపుగా మ్రోగుచున్నవి. వేణునాదానురక్తులగు కిన్నరస్త్రీలచేత శివభగవానుని 'త్రిపురవిజయము' ఆలపింపబడుచున్నది. 'గానము' నకు సంబంధించిన వివరములకు పుంసవనీ, వివరణవ్యాఖ్యలు చూడగలరు.

2) ఎ) **ఉపగన్తుమ్ :–**

క్రియార్థమైనక్రియ ఉపపదముగా నుండుగా, లేనపుడును ధాతువుపై భవిష్యదర్థమున తుమున్ (తుమ్), ణ్వుల్ (అక) ప్రత్యయములు చేరును. 'తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థయామ్" (సూ–3–3–10). ధాతువు – తుమున్, ణ్వుల్ (అక). దృశ్ – ద్రష్టుమ్, దర్శకః. భుజ్ – భోక్తుమ్, భోజకః. పా – పాతుమ్, పాయకః. **గమ్ – గన్తుమ్, గమకః.** లిఖ్ – లేఖితుమ్, లేఖకః. మొ॥

3) బి) **తానప్రదాయితమ్ –**

తానం ప్రదాతుం శీలం యస్య స తానప్రదాయీ 'సుప్యజాతౌ ణినిస్తాచ్ఛీల్యే' ఇతి తానప్రోపపదాత్ దాధాతోర్ణినిప్రత్యయః । తానప్రదాయినాం భావస్తానప్రదాయిత్వం, తత్ 'తస్య భావ స్త్వతలౌ' ఇతి భావార్థే త్వప్రత్యయః । 'త్వాన్తం క్లీబమ్' ఇత్యనుశాసనాదస్య క్లీబమ్।.

***క్రియాదర్శము :–*** **ఇచ్ఛతి** – ఎ) ఇష (ఇష్) ఇచ్ఛాయామ్ (కోరుట), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. తుదాది ప్రకరణమ్ (6).

లట్ ప్రథమపురుషరూపాలు – **ఇచ్ఛతి** – ఇచ్ఛతః– ఇచ్ఛన్తి.

బి) ***"లషతే లష్యతి లషత్యాశాస్తే మాంక్షతీప్సతి ।***
***ఆకాంక్షతి స్పృహయతి నాథతే వష్టి వాంఛతి ॥ 57***
***ఆశంసతే కామయతే లష్యతే వాంక్షతీచ్ఛతి ।***
***లిప్సతే హర్యతీచ్ఛాయాం ఖటత్యప్యనురుధ్యతే ॥ 58***
***వింశతిః స్యుః । ....... 'ఆఖ్యాతచన్ద్రికా'***

అని '20' లట్ ప్రథమపురుష ఏకవచనాలను తుల్యమైనవి పేర్కొన్నది.

***అలంకారములు :–*** ఇందు 'ఉత్ప్రేక్షాలంకారము' గలదు. సా చ దరీముఖోత్థేనేత్యేక దేశవివర్తి రూపకోజ్జీవితా। ముఖసాధ్యత్వాత్తాన ప్రదాయిత్వస్య। ఏకదేశవివర్తి రూపక లక్షణం యథా సాహిత్యదర్పణే –

*'రూపకం రూపితారోపాద్విషయే నిరపహ్నవే। ....అజ్గినోయది సాజ్గస్య రూపణం సాజ్గమేవ తత్॥ సమస్తవస్తువిషయమేకదేశవివర్తి చ। యత్రకస్యచిదార్థత్వమేకదేశవివర్తి తత్॥* ఇతి.



**శ్లో॥ కపోలకణ్డూః కరిభిర్వినేతుం**
**విఘట్టితానాం సరళద్రుమాణామ్ ।**
**యత్ర స్రుతక్షీరతయా ప్రసూతః**
**సానూని గంధః సురభీకరోతి ॥ 9**

***పదవిభాగము :–*** కపోలకణ్డూః, కరిభిః, వినేతుమ్, విఘట్టితానామ్, సరళద్రుమాణామ్, యత్ర, స్రుతక్షీరతయా, ప్రసూతః, సానూని, గంధః, సురభీకరోతి.

***అన్వయక్రమము :–*** యత్ర, కరిభిః, కపోలకణ్డూః, వినేతుమ్, విఘట్టితానామ్, సరళద్రుమాణామ్, స్రుతక్షీరతయా, ప్రసూతః, గంధః, సానూని, సురభీకరోతి.

***ప్రతిపదార్థము :–*** యత్ర = ఆ హిమవన్నగమునందు, కరిభిః = ఏనుగులచే, కపోలకణ్డూః= చెక్కులదురదలను, వినేతుమ్ = పోగొట్టుటకు, విఘట్టితానామ్ = ఒరిపిడి బడిన, సరళద్రుమాణామ్ = దేవదారు వృక్షములయొక్క, స్రుతక్షీరతయా = కాఱిన పాలు కలవి యగుట చేతను, ప్రసూతః = ఉత్పన్నమైనట్టి, గంధః = పరిమళము, సానూని = పర్వత సానువులను, సురభీకరోతి = పరిమళము కలవానిని గా చేయుచున్నది.

***తాత్పర్యము :–*** ఆ హిమవన్నగమునందు తమ చెక్కిళ్ళు దురదలను పోగొట్టుటకు ఏనుగులు దేవదారు వృక్షములకు ఒరిపిడిపడ, కాఱిన పాలు కలవి యగుట చేతను ఉత్పన్నమైనట్టి పరిమళము పర్వతసానువులను సువాసనభరితము చేయుచున్నవి.

***విభక్తులు / క్రియలు :–*** 1) కపోలకణ్డూః – కపోలకణ్డూమ్, కపోలకణ్డ్వౌ, **కపోలకణ్డూః;** ఊకారాన్త స్త్రీలింగ కణ్డూశబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము. 2) కరిభిః – కరా, కరిభ్యామ్, **కరిభిః;** నకారాన్త పుంలింగ కరిన్ శబ్దము. తృతీయావిభక్తి బహువచనము. 3) వినేతుమ్ – కృదన్త అవ్యయము, (తుమున్). 4) విఘట్టితానామ్ – విఘట్టితస్య, విఘట్టితయోః, **విఘట్టితానామ్;** అకారాన్త పుంలింగ విఘట్టితశబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 5) సరళద్రుమాణామ్ – ద్రుమస్య, ద్రుమయోః, **ద్రుమాణామ్;** అకారాన్త పుంలింగ ద్రుమశబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 6) యత్ర – అవ్యయము. 7) స్రుతక్షీరతయా – **క్షీరతయా,** క్షీరతాభ్యామ్, క్షీరతాభిః; ఆకారాన్త స్త్రీలింగ క్షీరతాశబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 8) ప్రసూతః – **ప్రసూతః,** ప్రసూతే, ప్రసూతాః; అకారాన్త పుంలింగ ప్రసూతశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) గంధః – **గంధః,** గంధౌ, గంధాః; ఆకారాన్త పుంలింగ గంధశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 10) సానూని – సాను, సానునీ, **సానూని,** ఉకారాన్త నపుంసకలింగ సానుశబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 11) సురభీకరోతి – క్రియ.



***సమాసాలు :–***

1) కపోలకణ్డూః – కపోలయోః కణ్డూః (ష.త.).

2) సరళద్రుమాణామ్– సరళాశ్చ తే ద్రుమాః (కర్మధారయ) తేషామ్.

3) స్రుతక్షీరతయా – స్రుతాని క్షీరాని యేషామ్ (బహువ్రీహి) తేషాం భావస్తత్తా, తయా।

***సంధులు :–***

1) కరిభిః + వినేతుమ్ = కరిభిర్వినేతుమ్ – విసర్గసంధి.

***పాఠాంతరాలు :–*** 1. ప్రసూతః – ప్రసూనః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.**

1. **సురభీకరోతి –** సురభి + చ్వి + కృ, లట్ – ప్రథమపురుష ఏకవచనము.

ఎ) 'కృభ్వస్తి యోగో సమ్పద్యకర్తరి చ్వి' – పాణినీయసూత్రమ్ 5–4–50.

బి) 'అభూతతద్భావే ఇతి వక్తవ్యమ్' – వార్తికమ్ (3340)

సి) వికారాత్మనాం ప్రాప్నువత్యాం ప్రకృతౌ వర్తమానాద్వికారశబ్దాత్స్వార్థే చ్విర్వా స్యాత్కరోత్యాదిభిర్యోగే। సి.కౌ 21, 22.

డి) ప్రకృతియగు శబ్దమునకు చ్వి ప్రత్యయము రాదు.

ఇ) కృభ్వస్తి యోగే – వికృతియగు వానికి 'కృ, భూ, మఱియు అస్' ధాతువు యోగమున 'చ్వి' ప్రత్యయము చేరును.

ఎఫ్) *శ్లో॥ ధీరస్యాశ్రమ సంశ్రితస్య వసతస్తుష్టస్య వన్యైః ఫలైః*
*మానార్హస్య జనస్య వల్కలవతస్త్రాసస్సముత్పాద్యతే।*
*ఉత్సికో వినయాదపేత పురుషో భాగ్యైశ్చలైర్విస్మితః*
*కోఽయం భోః! నిభృతం తపోవనమిదం **గ్రామీకరోత్యాజ్ఞయా**॥*

*స్వప్నవాసవదత్త 1–3.*

జి) సురభీకరోతి – అసురభిం సురభిం కరోతీతి సురభీకరోతి.



**శ్లో॥ వనేచరాణాం వనితాసఖానాం**
**దరీగృహోత్సఙ్గనిషక్తభాసః ।**
**భవన్తి యత్రౌషధయో**
**రజన్యామతైలపూరాస్సురతప్రదీపాః ॥ 10**

***పదవిభాగము :–*** వనేచరాణామ్, వనితాసఖానామ్, దరీ...భాసః, భవన్తి, యత్ర, ఓషధయః, రజన్యామ్, అతైలపూరాః, సురతప్రదీపాః.

***అన్వయక్రమము :–*** యత్ర, రజన్యామ్, దరీ...భాసః, ఓషధయః, వనితాసఖానామ్, వనేచరాణామ్, అతైలపూరాః, సురతప్రదీపాః, భవన్తి.

***ప్రతిపదార్థము :–*** యత్ర = ఆ హిమవన్నగమునందు, రజన్యామ్ = రాత్రియందు, దరీ...భాసః = గుహలను – ఇండ్లయొక్క – లోపలిభాగముల యందు ఆవరింపబడిన కాంతులు గల, ఓషధయః = ఓషధులు, వనితాసఖానామ్ = అనురక్తకామినులకు చెలికాండ్రయిన, వనేచరాణామ్ = కిరాతులకు, అతైలపూరాః = తైలస్రావమక్కఱలేని, సురతప్రదీపాః = సంభోగమందలి దీపములు, భవన్తి = అగుచున్నవి.

***తాత్పర్యము :–*** ఆ హిమవన్నగమునందు రాత్రియందు గుహలను ఇండ్లలోపల భాగముల యందు కాంతులు గల ఓషధులు, అనురక్తకామినులకు చెలికాండ్రయిన కిరాతులకు తైలస్రావమక్కఱలేని సంభోగమందలి దీపములు అగుచున్నవి.

***విభక్తులు / క్రియలు :–*** 1) వనేచరాణామ్ – వనేచరస్య, వనేచరయోః, **వనేచరాణామ్;** అకారాన్త పుంలింగ 'వనేచర' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) వనితాసఖానామ్ – వనితాసఖస్య, వనితాసఖయోః, **వనితాసఖానామ్;** అకారాన్త పుంలింగ 'సఖ' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 3) దరీ...భాసః – భాః, భాసౌ, భాసాః; సకారాన్త స్త్రీలింగ 'భాస్' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 4) భవన్తి – క్రియ. 5) యత్ర – అవ్యయము. 6) ఓషధయః – ఓషధిః, ఓషధీ, **ఓషధయః;** ఇకారాన్త స్త్రీలింగ 'ఓషధి' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 7) రజన్యామ్ – **రజన్యామ్**, రజన్యోః, రజనీషు; ఈకారాన్త స్త్రీలింగ రజనీ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 8) అతైలపూరాః – అతైలపూరః, పూరౌ, **పూరాః;** ఆకారాన్త పుంలింగ 'పూర' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 9) సురతప్రదీపాః – ప్రదీపః, ప్రదీపౌ, ప్రదీపాః; అకారాన్త పుంలింగ ప్రదీప శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) దరీగృహోత్సఙ్గనిషక్తభాసః – దర్యా ఏవ గృహాః (కర్మధార.) దరీగృహాః, దరీగృహాణామ్ ఉత్సఙ్గాః (ష.త.) తేషు నిషక్తాః (స.త.) భాసః (కర్మధార.) యాసామ్ (బహువ్రీహి) తాః ।.
2) వనితాసఖానామ్ – వనితానాం సఖాయః (ష.త.) వనితాసఖాః, తేషామ్.
3) వనేచరాణామ్ – వనే చరన్తీతి (ఉపపదతత్పు.) వనేచరాః తేషామ్.
4) అతైలపూరాః – తైలేన పూర్యన్త ఇతి (ఉపపదతత్పు.), న తైలపూరాః (నఞ్‌తత్పురుష), అతైలపూరాః.
5) సురతప్రదీపాః – సురతేషు ప్రదీపాః (సప్తమీ తత్పు.)

***సంధులు :–***

1) గృహ + ఉత్సఙ్గ = గృహోత్సఙ్గ, గుణసన్ధిః, **ఆద్గుణః** (సూ 6–1–84).
2) యత్ర + ఓషధయః = యత్రౌషధయః, వృద్ధిసన్ధిః, **వృద్ధిరేచి** (సూ 6–1–85).

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.***

ఎ) వనేచరాణామితి। 'తత్పురుషే కృతి బహుళమ్' (6–3–14) ఇత్యలుక్। ఇదం విశేషోక్త్యుదాహృతం వామనేన। అస్మన్మతే తు రూపకవిశేష ఏవాయమ్. –ప్రకాశికావ్యాఖ్యా.



బి) అలుక్ సమాసమనునది ప్రత్యేక సమాసము కాదు. తత్పురుషాది సమాసములందే విభక్తి లోపించని వానిని అలుక్సమాసములని వ్యవహరింతురు. ఈ సమాసమునందు పూర్వపదము యొక్క సుబన్తవిభక్తి లోపించకుండును. ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ అను ఆఱు సుబన్తవిభక్తుల వ్యత్యాసము చే తత్పురుషలో అలుక్సమాసము ఆఱు విధములు.

ఉదాహరణ : 1) కణ్ఠేకాలః ఈ సమాసపదమునందు 'కణ్ఠే' అను సప్తమీవిభక్తి లోపించనందువలన ఇది అలుక్సమాసము. 2) 'వనేచరః' అనునదియును అట్లే.

***క్రియాదర్శము :–*** **భవన్తి –** 1) భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ. వర్తమానే లట్ – ప్రథమపురుషరూపాలు – భవతి – భవతః – **భవన్తి.**

***అలంకారములు :–*** ఇచట 'పరిణామవిభావనాలంకారము'లకు 'సంసృష్టి' యని చెప్పవచ్చును.

***పరిణామాలంకార లక్షణమ్ :***

*విషయాత్మతయారోప్యే ప్రకృతార్థోపయోగిని ।*
*పరిణామోభవేత్తుల్యాతుల్యాధికరణో ద్విధా ॥ ఇతి*

*ఆరోప్యమాణస్యారోపవిషయాత్మతయా పరిణమనాత్పరిణామః।అత్ర ప్రదీపానామోషధ్యాత్మ తయా ప్రకృతే సురతోపయోగిత్వేన్ధకారనాశే ఉపయోగోఽ తైలపూరత్వేనాధికారూఢ వైశిష్ట్యమ్।*

సాహిత్యదర్పణమున విశ్వనాథుడు పరిణామాలంకారమునకు ఈ శ్లోకమును ఉదాహరణగా పేర్కొనగా, వామనుడు 'విశేషోక్త్యలంకారము' నకు ఉదాహరణగా పేర్కొనినాడు.

***విభావనాలంకార లక్షణమ్ :–***

***విభావనా వినా హేతుం కార్యోత్పత్తిర్యదుచ్యతే ।***
***ఉక్తానుక్తనిమిత్తత్వాద్ ద్విధా సా పరికీర్తితా ॥ ఇతి***
***తథా చ విభావనా పరిణామలంకారయోః సంసృష్టిరిత్యాహ ।***

దీపాలు వెలగటానికి కారణమైన తైలం లేకపోయినా దీపాలు వెలిగినట్లు వర్ణించడం చేత విభావనాలంకారము. కనుక ఇందు 'పరిణామవిభావనాలంకారము' లకు 'సంసృష్టి' అని చెప్పదగును.



**శ్లో॥ ఉద్వేజయత్యఙ్గులిపార్ష్ణిభాగాన్**
**మార్గే శిలీభూతహిమేఽపి యత్ర ।**
**న దుర్వహశ్రోణి పయోధరార్తా**
**భిన్దన్తి మన్దాం గతిమశ్వముఖ్యః ॥ 11**

***పదవిభాగము :–*** ఉద్వేజయతి, అఙ్గులిపార్ష్ణిభాగాన్, మార్గే, శిలీభూతహిమే, అపి, యత్ర, న, దుర్వహశ్రోణి పయోధరార్తాః, భిన్దన్తి, మన్దామ్, గతిమ్, అశ్వముఖ్యః।

***అన్వయక్రమము :–*** యత్ర, శిలీభూతహిమే, అఙ్గులిపార్ష్ణిభాగాన్, ఉద్వేజయతి, అపి, మార్గే, దుర్వహశ్రోణిపయోధరార్తాః, అశ్వముఖ్యః, మన్దామ్, గతిమ్, న, భిన్దన్తి।

***ప్రతిపదార్థము :–*** యత్ర = ఆ హిమవన్నగము నందు, మార్గే = దారి, శలీభూతహిమే= పేరుకున్న మంచు కలదై, అఙ్గులిపార్ష్ణిభాగాన్ = వ్రేళ్ళుయొక్క, మడమల యొక్క ప్రదేశములను, ఉద్వేజయతి అపి = క్లేశపెట్టునది అయినను, (సతిసప్తమీ), దుర్వహశ్రోణిపయోధరార్తాః = వహించుటకు శక్యముగాని, పిఱుదుల చేతను, పాలిండ్ల చేతను పీడితులైన, అశ్వముఖ్యః = కిన్నర స్త్రీలు, మన్దామ్ గతిమ్ = మెల్లనయిన నడకను, మందగమనమును, న భిన్దన్తి = మార్చరు.

***తాత్పర్యము :–*** ఆ హిమవన్నగమునందు దారి పేరుకున్న మంచుకలదై వ్రేళ్ళుయొక్క మడమలయొక్క ప్రదేశములను క్లేశపెట్టునది అయినను, వహింపశక్యము గాని పిఱుదుల చేతను పాలిండ్లచేతను పీడితులైన కిన్నర స్త్రీలు మందగమనమును మార్చరు.

***విభక్తులు / క్రియలు :–*** 1) ఉద్వేజయతి – ఉద్ + విజ్ + ణి + శతృ (అత్) ప్రత్యయము, **ఉద్వేజయతి,** ఉద్వేజయతోః, ఉద్వేజయత్సు; తకారాన్త నపుంసక ఉద్వేజయత్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 2) అంగుళిపార్ష్ణిభాగాన్ – భాగమ్, భాగౌ, **భాగాన్;** అకారాన్త పుంలింగ భాగశబ్దము. ద్వితీయావిభక్తి బహువచనము. 3) మార్గే – **మార్గే,** మార్గయోః, మార్గేషు; అకారాన్త పుంలింగ 'మార్గ' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 4) శిలీభూతహిమే – **హిమే,** హిమయోః, హిమేషు; అకారాన్త పుంలింగ 'హిమ' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) అపి – అవ్యయము. 6) యత్ర – అవ్యయము. 7) న – అవ్యయము. 8) దుర్వహ...ఆర్తాః – ఆర్తా, ఆర్తే, **ఆర్తాః;** ఆకారాన్త స్త్రీలింగ 'ఆర్తా' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 10) భిన్దన్తి – క్రియ. 11) మన్దామ్ **–మన్దామ్,** మన్దే, మన్దాః; ఆకారాన్త స్త్రీలింగ మన్దా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) గతిమ్ – **గతిమ్,** గతీ, గతీః; ఇకారాన్త స్త్రీలింగ గతి శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) అశ్వముఖ్యః – అశ్వముఖీ, అశ్వముఖ్యౌ, **అశ్వముఖ్యః;** ఈకారాన్త స్త్రీలింగ అశ్వముఖీ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) శిలీభూతహిమే – శిలీభూతాః హిమాః యస్మిన్ (బహువ్రీహి) తత్ర।
2) అంగులిపార్ష్ణిభాగాన్ – అంగులయశ్చ పార్ష్ణశ్చేతి అంగులిపార్ష్ణి (ద్వంద్వ) అంగులి పార్ష్ణినో భాగాః (ష.త.) తాన్.
3) దుర్వహశ్రోణిపయోధరార్తాః – శ్రోణయశ్చ పయోధరాశ్చ శ్రేణిపయోధరమ్ (ద్వంద్వ), దుర్వహ చ తత్ శ్రోణిపయోధరమ్ (కర్మధారయ.), దుర్వహశ్రోణి పయోధరేణ ఆర్తాః (తృ.త.)
4) అశ్వముఖ్యః – అశ్వానాం ముఖానీవ ముఖాని యాసాం (బహువ్రీహి), తాః।

***సంధులు :–***

1) ఉద్వేజయతి + అంగులిపార్ష్ణిభాగాన్ = ఉద్వేజయత్యఙ్గులిపార్ష్ణిభాగాన్, యణాదేశసన్ధిః, **ఇకో యణచి** (సూ. 6-1-74). ఇ, ఉ, ఋ, ఌ వర్ణములకు



అసవర్ణమైన అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా య్, వ్, ర్, ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

2) శిలీభూతహిమే + అపి = శిలీభూతహిమేఽపి. పూర్వరూపసన్ధిః

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగములు.***

ఎ) శిలీభూత –నిశిలా అశిలా; అశిలా శిలా సంపన్నం శిలీభూతం –చ్విప్రత్యయము.

బి) అశ్వముఖ్యః, అశ్వముఖాః, అశ్వముఖాః.

అశ్వముఖీ – అశ్వముఖ్యౌ – అశ్వముఖ్యః; ఈకారాన్త స్త్రీలింగ అశ్వముఖీ శబ్దము.

అశ్వముఖా – అశ్వముఖే – అశ్వముఖాః; ఆకారాన్త స్త్రీలింగ ముఖాశబ్దము.

అశ్వముఖః – అశ్వముఖౌ – అశ్వముఖాః; అకారాన్త పుంలింగ అశ్వముఖ శబ్దము.

సి) Different devayonies.

శ్లో॥ *యక్ష–రాక్షస–గన్ధర్వ–సిద్ధ–కిన్నర–గుహ్యకాః ।*
*విద్యాధరాప్సరో భూతపిశాచా దేవయోనయః ॥ – 87*

శ్లో॥ *కిన్నరః స్వాత్కిమ్పురుషో మయురశ్వముఖస్తథా ॥ 82 హలయుధకోశః*

శ్లో॥ *శరైరుత్సవసంకేతాంత్స కృత్వా వరతోత్సవాన్ ।*
*జయోదాహరణం బహ్వోర్గాపయామాస కిన్నరాన్ ॥ రఘువంశమ్ 4-78.*
ఈ జయమును కిన్నరులు ఒక ప్రబంధముగా గానం చేసిరి.

శ్లో॥ *వాసుదేవో భగవతాం త్వం తు భాగవతేష్వహమ్ ।*
*కింపురుషాణాం హనుమాన్విద్యాధ్రాణామ్ సుదర్శనః ॥ శ్రీమద్ భాగవతమ్ (11-16-29).*

సి) A mythical being with a human figure and the head of a horse. (అశ్వముఖః) -Apte

***క్రియాదర్శము :–*** ***భిన్దన్తి*** – 1)భిదిర్ (భిద్) విదారణే (భేదించుట) సకర్మకమ్, సేట్, (ఉభయ) పరస్మైపదీ.

లట్ ప్రథమపురుషరూపాలు :– భినత్తి – భిన్తః – **భిన్దన్తి** – పరస్మైపదీ.
భిన్తే – భిన్దాతే – భిన్దతే – అత్మనేపదీ.

2) ***భిన్దత్యవయవే భిన్దత్యవయౌతి సటత్యపి ॥ ఆఖ్యాతచన్ద్రికా. (3-1-5).***

***అలంకారములు :–*** ఈ శ్లోకమున 'కావ్యలింగాలంకార' మున్నదని చెప్పదగును. "శ్రోణిపయోధరార్తాః" అనేది హేతుగర్భవిశేషణము.

కారిక :– కావ్యలింగం హేతోర్వాక్యపదార్థతా.

ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువును చెప్పడం కావ్యలింగాలంకారము. వాక్యం చేతగాని, ఒక పదము చేతగాని, రెండు మూడు పదాల చేత కాని హేతువును చెప్పవచ్చు..... కావ్యప్రకాశం -10-114. (బాలానందిని).



శ్లో॥ దివాకరాద్రక్షతి యో గుహాసు
లీనం దివా భీతమివాన్ధకారమ్ ।
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే
మమత్వముచ్చైశ్శిరసాం సతీవ ॥ **12**

***పదవిభాగము :-*** దివాకరాత్, రక్షతి, యః, గుహాసు, లీనమ్, దివా, భీతమ్, ఇవ, అంధకారమ్, క్షుద్రే, అపి, నూనమ్, శరణమ్, ప్రపన్నే, మమత్వమ్, ఉచ్చైఃశిరసామ్, సతి, ఇవ.

***అన్వయక్రమము :-*** యః, దివా, భీతమివ, (దివాభీతమివ), గుహాసు, లీనమ్, అంధకారమ్, దివాకరాత్, రక్షతి. ఉచ్చైఃశిరసామ్, శరణమ్, ప్రపన్నే, క్షుద్రే, అపి, సతి ఇవ, నూనమ్, మమత్వమ్, (అస్తి).

***ప్రతిపదార్థము :-*** యః = ఆ హిమవంతుడు, దివా = పగలు, భీతమివ = భయపడినదా అన్నట్లు, (దివాభీతమివ) = (గుడ్లగూబవలె), గుహాసు = గుహలయందు, లీనమ్ = దాగిన, అంధకారమ్ = చీకటిని, దివాకరాత్ = సూర్యుని నుండి, రక్షతి = కాపాడుచున్నాడు, ఉచ్చైఃశిరసామ్ = ఉన్నతులయిన వారికి (మహాత్ములకు), శరణమ్ ప్రపన్నే = శరణు వేడినట్టి, క్షుద్రే + అపి = నీచుని యందునూ, సతి + ఇవ = సజ్జనుని యందువలె, నూనమ్= నిశ్చయముగ, మమత్వమ్ = మమకారము, అస్తి = ఉండును.

***తాత్పర్యము :-*** ఆ హిమవంతుడు, పగలు భయపడినదా అన్నట్లు గుహలయందు దాగిన చీకటిని సూర్యుడినుండి కాపాడుచున్నాడు. ఉన్నతులకు శరణువేడినట్టి నీచునియందునూ సజ్జనునియందువలె నిశ్చయముగ మమకారముండును.

***విభక్తులు / క్రియలు :-*** 1) దివాకరాత్ - **దివాకరాత్,** దివాకరాభ్యామ్, దివాకరేభ్యః; అకారాన్త పుంలింగ 'దివాకర' శబ్దము. పంచమీవిభక్తి ఏకవచనము. 2) రక్షతి - క్రియ. 3) యః - **యః,** యౌ, యే; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) గుహాసు - గుహాయామ్, గుహయోః, **గుహాసు;** ఆకారాన్త స్త్రీలింగ 'గుహా' శబ్దము, సప్తమీవిభక్తి బహువచనము. 5) లీనమ్ - **లీనమ్,** లీనే, లీనాని; అకారాన్త నపుంసకలింగ 'లీన' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) అన్ధకారమ్ - **అన్ధకారమ్,** అన్ధకారే, అన్ధకారాని; అకారాన్త నపుంసకలింగ 'అంధకార' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) దివా - అవ్యయము. 8) భీతమ్ - భీతమ్, భీతే, భీతాని; ఆకారాన్త నపుంసకలింగ 'భీత' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) ఇవ - అవ్యయము. 10) క్షుద్రే - **క్షుద్రే,** క్షుద్రయోః, క్షుద్రేషు; అకారాన్త పుంలింగ క్షుద్రశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) అపి - అవ్యయము. 12) నూనమ్ - అవ్యయము. 13) శరణం ప్రపన్నే - **ప్రపన్నే,** ప్రపన్నయోః, ప్రపన్నేషు; అకారాన్త పుంలింగ ప్రపన్న శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 14) మమత్వమ్ - మమ+త్వ, 'మమ' - అవ్యయపదము. 15) ఉచ్చైశ్శిరసామ్ - ఉచ్చైశ్శిరస్య, శిరయోః, **శిరసామ్;** అకారాన్త పుంలింగ 'శిర' శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 16) సతి-**సతి,** సతోః, సత్సు; తకారాన్త పుంలింగ 'సత్' శబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. 17) ఇవ - అవ్యయము.

***సమాసాలు :-*** 1) దివాభీతమ్ - దివా భీతః (అవ్యయీ) తమ్;

2) దివాకరాత్-దివా కరోతి ఇతి (ఉపపద సమాసము, తస్మాత్; ఉచ్చైః శిరసామ్ - ఉచ్చైః శిరః యేషామ్ (బహుబ్రీహి) తే, తేషామ్.



***సంధులు :-***

1) ఇవ + అన్ధకారమ్- ఇవాన్ధకారమ్-సవర్ణదీర్ఘసన్ధిః, **అకః సవర్ణే దీర్ఘః**

2) క్షుద్రే + అపి- క్షుద్రేఽపి - పూర్వరూపసన్ధిః,**ఏఙః పదాన్తాదతి**(సం 6-1-105)

3) ఉచ్చైః +శిరసామ్ ఉచ్చైః శిరసామ్,ఉచ్చైశ్శిరసామ్-విసర్గాదేశసన్ధిః, **వా శరి** (సూ. 8-3-36). శషసవర్ణములు పరముగా ఉన్నప్పుడు విసర్గమునకు శిషపలు వికల్పముగ వచ్చును. రాని పక్షమున విసర్గమునకు విసర్గమే వచ్చును.

***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగములు.***

1. **ఉచ్చైః** - ఉచ్చైః మహత్వే;

-ఉత్కృష్టే ఇతి శకటాయనః। కిం పునర్యస్తథోచ్చైః - మేఘదూతమ్॥

**ఉచ్చైరుదాత్తః** (సూ 1-2-29) ఇత్యాదిషు స్థలేషు ఊర్ధ్వభాగార్థకత్వమస్యేతి జ్ఞేయమ్। తుఙ్గత్వే - ఔన్నత్యాదయోఽ స్యార్థవిశేషాః ప్రకరణానురోధనోహ్యాః ।

అస్యావ్యయస్య, ఘుప్రత్యయాన్తస్య గుణవాచిత్వే 'కిమేత్ తిఙ్వ్యఘాదామ్. (5-4-11) ఇతి ఆముప్రత్యయే ఉచ్చైస్తరామ్, ఉచ్చైస్తమామ్ ఇతి సాధుః। యథా **'ఉచ్చైస్తరామ్ వా వషట్కారః'** (1-2-25) ఇత్యత్ర। ద్రవ్యప్రకర్షే తు వివక్షితే 'ఉచ్చైస్తరో వృక్షః' ఇత్యాదిషు న ఆముప్రత్యయ ఇతి చ జ్ఞేయమ్। ఉచ్చకైః, ఉచ్చైఃకృత్య,ఉచ్చైఃకృత్వా, ఉచ్చైఃకారం వా ఆచష్టే। కేచిత్తు ఏతదవ్యయం సబంతిప్రతిరూపకమితి మన్వతే । ఉచ్చశబ్ద ఔన్నత్యాద్యర్థకోఽస్తి, తస్య తృతీయాబహువచనే ఉచ్చైః ఇతి సమ్పద్యతే। తస్య ప్రతిరూపకమేతదిది తేషామాశయః। పరే తు సాన్తమేతదభ్యుపగచ్ఛన్తి। - అని అవ్యయకోశము (219).

***క్రియాదర్శము :-*** **రక్షతి** - 1) రక్ష (రక్ష్) పాలనే (పాలించుట) భ్వాదిప్రకరణమ్ (1), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ లట్ ప్రథమపురుషరూపాలు: **రక్షతి** - రక్షతః - రక్షన్తి.

2) *శ్లో॥ భునక్తి పాతి దయతే గోపాయతి పిపర్తి చ ।*

*రక్షతి త్రాయతే త్రాణే పాలయత్యపి తేజతి ॥ 77*

*స్పృణోతి కుణ్డయతి చ గుణ్డత్యవతి జంసతి । -ఆఖ్యాతచన్ద్రికా (2-3-2)*

***అలంకారములు :-*** ఇచట 'అర్థాంతరన్యాసాలంకార'మున్నది. ఉత్తరార్ధమునందలి అర్థము, పూర్వార్ధమునందలి అర్థమును సమర్థించుటచే నిట 'అర్థాంతరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణమ్ :-*** ***"జ్ఞేయః సోర్థాన్తరన్యాసో వస్తు ప్రస్తుత్య కించన***
***తత్సాధన సమర్థస్య న్యాసో యోఽ న్యస్య వస్తునః ॥ కావ్యదర్శః 2-169***

ఒక వాక్యముచే ప్రతిపాదితమగు విషయమును సమర్థించుటకై మఱియొక వాక్యమును ప్రయోగించినచో అది 'అర్థాంతరన్యాసాలంకారము'. ఈ రెండు వాక్యార్థములలో ఒకటి సామాన్యము, రెండవది విశేషము అయి ఉండును. -బాలానందిని. 

శ్లో॥ లాఙ్గూలవిక్షేపవిసర్పిశోభై -
రితస్తతశ్చన్ద్రమరీచిగౌరైః ।
యస్యార్థయుక్తం గిరిరాజశబ్దం
కుర్వన్తి వాలవ్యజనైశ్చమర్యః ॥ **13**

**పదవిభాగము :-** లా...శోభైః, ఇతస్తతః, చంద్రమరీచిగౌరైః, యస్య, అర్థయుక్తమ్, గిరిరాజశబ్దమ్, కుర్వన్తి, వాలవ్యజనైః, చమర్యః।

**అన్వయక్రమము :-** చమర్యః, ఇతస్తతః, లా....శోభైః, చంద్రమరీచిగౌరైః, వాలవ్యజనైః, యస్య, గిరిరాజశబ్దమ్, అర్థయుక్తమ్, కుర్వన్తి।

**ప్రతిపదార్థము :-** చమర్యః = చమరీమృగములు, ఇతస్తతః = ఇటునటు, లా....శోభైః= తోకలయొక్క విసురులచే వ్యాపించిన ప్రకాశము కలవియు, చంద్రమరీచిగౌరైః = చంద్ర కిరణములవలె తెల్లనివియు అయిన, వాలవ్యజనైః = తోకలనెడు వింజామరములచే, యస్య = ఆ హిమవంతుని యొక్క, గిరిరాజశబ్దము = పర్వతముల ఱేడనెడి పేరును, అర్థయుక్తమ్ = అర్థముతో కూడుకున్న దానినిగా, కుర్వన్తి = చేయుచున్నవి.

**తాత్పర్యము :-** చమరీమృగములు ఇటునటు తోకలయొక్క విసురుటచే వ్యాపించిన ప్రకాశముకలవియు, చంద్రకిరణములవలె తెల్లనివియు అయిన తోకలనెడు వింజామరములచే ఆ హిమవంతునియొక్క పర్వతముల ఱేడనెడి పేరును అర్థముతో కూడుకొన్నదానినిగా చేయుచున్నవి.

**విభక్తులు / క్రియలు :-** 1) లఙ్గూలా....శోభైః - శోభేణ, శోభాభ్యామ్, **శోభైః;** అకారాన్త పుంలింగ 'శోభ' శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 2) ఇతస్తతః - అవ్యయము. 3) చంద్రమరీచిగౌరైః - గౌరేణ, గౌరీభ్యామ్, **గౌరైః;** అకారాన్త పుంలింగ 'గౌర' శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 4) యస్య - యస్య, యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 5)అర్థయుక్తమ్ - **యుక్తమ్,** యుక్తౌ, యుక్తాన్; అకారాన్త పుంలింగ యుక్త శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) గిరిరాజశబ్దమ్ - **శబ్దమ్,** శబ్దౌ, శబ్దాన్; అకారాన్త పుంలింగ శబ్దశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) కుర్వన్తి - క్రియ. 8) వాలవ్యజనైః - వ్యజేన, వ్యజాభ్యామ్, **వ్యజనైః;** అకారాన్త పుంలింగ వ్యజన శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 9) చమర్యః - చమరీ, చమర్యౌ, చమర్యః; ఈకారాన్త స్త్రీలింగ చమరీ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

**సమాసాలు :-**

1) లాంగూలవిక్షేపవిసర్పిశోభైః - లాంగూలానాం విక్షేపాః (ష.త.) లాంగూలవిక్షేపాః, లాంగూలవిక్షేపైః విసర్పిణ్యః (తృ.త.) శోభాః యేషామ్ (బహుర్వీహి) తైః.

2) చన్ద్రమరీచిగౌరైః - చంద్రస్య మరీచయః (ష.త.) చంద్రమరీచిభిః ఇవ గౌరాణి (ఉపమిత కర్మధా.) తైః।

3) వాలవ్యజనైః - వాలా ఏవ వ్యజనాని (కర్మధా.) తైః.

4) గిరిరాజశబ్దమ్- గిరిరాజశ్చ అసౌ శబ్దః (కర్మ.) తమ్.



**సంధులు :-**

1) ఇతస్తతః + చంద్ర...రైః = ఇతస్తతశ్చంద్ర...రైః, శ్చుత్వసన్ధిః (8-4-39) సకారత వర్గము సతథదధన లకు శకారచవర్గము శచఛజఝఞ లతో కలయిక ఏర్పడినపుడు శకారచవర్గములు వచ్చును.

2) వాలవ్యజనైః+చమర్యః= వాలవ్యజనైశ్చమర్యః, శ్చుత్వసన్ధిః. 3) యస్య + అర్థయుక్తమ్ = యస్యార్థయుక్తమ్, సవర్ణదీర్ఘసన్ధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.**

1. **వాలవ్యజనైః** - "వ్యజనం తాలవృన్తకమ్" అని అమరము.

*శ్లో॥ చమరాన్ పరితః ప్రవర్తితాశ్వః*
*క్వచిదాకర్ణవికృష్టభల్లవర్షీ ।*
*నృపతీనివ తాన్ వియోజ్య సద్యః*
*సిత**వాలవ్యజనై**ర్జగామ శాన్తిమ్ ॥ రఘువంశమ్ 9-66*

ఈ పై శ్లోకమునందు దిగువ శ్లోకమునందు గల 'వాలవ్యజన' శబ్ద ప్రయోగములను గమనించగలరు.

*శ్లో॥ సౌమిత్రిణా సావరజేన మన్ద-*
*మాధూత**వాలవ్యజనో** రథస్థః ।*
*ధృతాతపత్రో భరతేన సాక్షా-*
*దుపాయసంఘాత ఇవ ప్రవృద్ధః ॥ రఘువంశమ్ 14-11.*

"తమ్ముడగు శత్రుఘ్నునితో కూడిన లక్ష్మణుడు నెమ్మదిగా వింజామరములతో వీచుచుండగా...."

2.**గిరిరాజశబ్దమ్** - ఎ) గిరీణాం రాజా గిరిరాజః, "రాజాహః సఖిభ్యష్టచ్" (5-4-92) ఇతి సమాసాంతష్టచ్। 'అద్రిగోత్రగిరిగ్రావాచలశైలశిలోచ్చయాః॥ అని అమరము. గిరిరాజః చ అసౌ శబ్దః గిరిరాజశబ్దః, తమ్। 'విశేషణం విశేష్యేణ బహుళమ్' ఇతి కర్మధారయ సమాసః। -పుంసవనీవ్యాఖ్యా

బి) 'రాజాహః సఖిభ్యష్టచ్' - ఏతదాన్తాత్తత్పురుషట్టచ్ స్యాత్। పరమరాజః। అతిరాజీ। కృష్ణసఖః। -పాణినిసూత్రవ్యాఖ్యా.

**క్రియాదర్శము :- కుర్వన్తి** - 1) డుకృఞ్ (కృ) కరణే (చేయుట) తనాది ప్రకరణమ్ (8), సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ. లట్ ప్రథమపురుషరూపాలు.

పరస్మైపదీ - కరోతి - కురుతః - కుర్వన్తి
ఆత్మనేపదీ - కురుతే - కుర్వాతే - కుర్వతే.

2) *శ్లో॥ కృతౌ కరోత్యావహతి విదధాత్యాదధాతి చ।*
*వితనోత్యాత్మనే పఞ్చ..... ఆఖ్యాతచన్ద్రికా 2-1-2.*

***అలంకారములు :–*** ఇచట 'గిరిరాజ పద సార్థకతకు హేతువు చెప్పబడుటచే 'కావ్యలింగాలంకార' మున్నదని చెప్పదగును.



**శ్లో॥ యత్రాంశుకాక్షేపవిలజ్జితానాం**
**యదృచ్ఛయా కిమ్పురుషాఙ్గనానామ్ ।**
**దరీగృహద్వారవిలమ్బిబిమ్బా–**
**స్తిరస్కరిణ్యో జలదా భవన్తి ॥ 14**

***పదవిభాగము :–*** యత్ర, అంశుకాక్షేపవిలజ్జితానామ్, యదృచ్ఛయా, కిమ్పు....నామ్, దరీ....బిమ్బాః, తిరస్కరిణ్యః, జలదాః, భవన్తి।

***అన్వయక్రమము :–*** యత్ర, అంశు....నామ్, కిమ్పు....నామ్, యదృచ్ఛయా, దరీ....బిమ్బాః, జలదాః, తిరస్కరిణ్యః, భవన్తి।

***ప్రతిపదార్థము :–*** యత్ర = ఆ హిమవన్నగమునందు, అంశు...నామ్ = వస్త్రములను లాగివైచుటచే మిక్కిలి లజ్జను బొందిన, కిమ్పు...నామ్ = కిన్నరస్త్రీలకు, యదృచ్ఛయా = దైవవశమున, దరీ...బిమ్బాః = గుహలనెడు ఇండ్లు వాకిండ్లు యందు, జలదాః = మేఘములు, తిరస్కరిణ్యః = పరదాలు, భవన్తి = అగుచున్నవి.

***తాత్పర్యము :–*** ఆ హిమవన్నగమునందు వస్త్రములను లాగివైచుటచే మిక్కిలి లజ్జను పొందిన కిన్నర స్త్రీలకు దైవవశమున గుహలనెడు ఇండ్ల వాకిండ్ల యందు మేఘములు పరదాలు అగుచున్నవి.

***విభక్తులు / క్రియలు :–*** 1) యత్ర – అవ్యయము. 2) అంశుకాక్షేపవిలజ్జితానామ్ – లజ్జితాయాః, లజ్జితయోః, **లజ్జితానామ్;** ఆకారాన్త స్త్రీలింగ లజ్జితా శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 3) యదృచ్ఛయా – **యదృచ్ఛయా,** యదృచ్ఛాభ్యామ్, యదృచ్ఛాభిః; ఆకారాన్త స్త్రీలింగ 'యదృచ్ఛా' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 4) కిమ్పు...నానామ్ – అంగనాయాః, అంగనయోః, **అంగనానామ్;** ఆకారాన్త స్త్రీలింగ అంగనా శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 5) దరీ...బిమ్బాః – బిమ్బః, బిమ్బౌ, **బిమ్బాః;** అకారాన్త పుంలింగ బింబ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 6) జలదాః – జలదః, జలదౌ, **జలదాః;** అకారాన్త పుంలింగ 'జలద' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 7) తిరస్కరిణ్యః – తిరస్కరిణీ, తిరస్కరిణ్యౌ, **తిరస్కరిణ్యః;** ఈకారాన్త స్త్రీలింగ తిరస్కరిణీ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 8) భవన్తి – క్రియ.

***సమాసాలు :–***

1) అంశుకాక్షేపవిలజ్జితానామ్ – అంశుకానామ్ ఆక్షేపః (ష.త.), విశేషణ లజ్జితాః, విలజ్జితాః (ప్రాదితత్పు.), అంశుకాక్షేపేణ విలజ్జితాః (తృ.త.) తేషామ్.
2) కిమ్పురుషాఙ్గనానామ్ – కిమ్పురుషాణామ్ అంగనాః (ష.త.), తాసామ్.
3) దరీగృహద్వార విలమ్బిబిమ్బాః–దరీ ఏవ గృహమ్ (కర్మధా.), దరీగృహమ్, దరీగృహస్య ద్వారమ్ (ష.త.), దరీగృహద్వారే బిమ్బానో (స.త.) బిమ్బా యేషామ్ (బహువ్రీహి) తే.



***సంధులు :–***

1) దరీ...బిమ్బాః + తిరస్కరిణ్యః = దరీ...బిమ్బాస్తిరస్కరిణ్యః, విసర్గసన్ధిః, 'విసర్జనీయస్య సః' (సూ. 8–3–34). కఠిన హల్లులు పరముగా నున్నప్పుడు విసర్గమునకు సకారాదేశము వచ్చును.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **తిరస్కరిణ్యః** – ఎ) తిరస్కరిణీ – తిరోఽన్తర్ధానం కరోతీతి. తిరస్+కృ+'నందిగ్రహీతి' ణిని, సంజ్ఞా పూర్వకవిధేరనిత్యత్వాత్ వృద్ధ్యభావః తతో ఙీప్.
బి) ప్రతిసీరాజవనికా తిరస్కరణీ। హలాయుధకోషః –309

2. **యత్ర** – తద్ధితాన్తావ్యయము – అవ్యయకోశః (659) సప్తమ్యర్థకోఽయమ్। యచ్ఛబ్దాత్। సప్తమ్యాస్త్రల్ (5–3–10) ఇతి త్రల్ ప్రత్యయే, త్యదాద్యత్వే పరరూపే చ రూపమేవమ్। 'యత్రకుత్ర కులే వాసః' –

అనవకప్తిగర్హామర్షాశ్చర్యేష్వపి వర్తతే। యథా 'నావకల్పయామి గర్హే , న మర్షయే, ఆశ్చర్యం వాఽయత్ర భవాన్ బాలం ఘాతమేత్' ఇతి। ఏష్వర్థేషు చాదిరయమ్।

***క్రియాదర్శము :–*** భవన్తి – 10వ శ్లోక వ్యాఖ్యాన భాగము చూడగలరు.

***అలంకారములు :–*** ఇందు 'పరిణామాలంకారము' గలదని సంజీవినీ వ్యాఖ్యా పేర్కొనగా 'పుంసవనీవ్యాఖ్యా' 'సమాధ్యలంకార'మని పేర్కొన్నది. 'మేఘము' నందు 'పరదా' ఆరోపము చేయబడుటచే ఇచట 'పరిణామాలంకార'మున్నదని చెప్పదగును. పర్వతగృహ ద్వారమునకు 'పరదా'గా మేఘమడ్డుపడుటచే కింపురుషుల సంభోగక్రియకు దోహదమప్రయత్నముగ జరిగినదని చెప్పబడుటచే 'సమాధ్యలంకార'మున్నదని చెప్పదగును. సమాధిరలంకార లక్షణము దిగువనీయబడినది.

***"సమాధిః సుకరం కార్యం కారణానన్తరయోగతః"*** ఇతి।
పరిణామాలంకార లక్షణము పూర్వము చెప్పబడినది.



**శ్లో॥ భాగీరథీనిర్ఝరసీకరాణాం**
**వోఢా ముహుః కమ్పితదేవదారుః ।**
**యద్వాయురన్విష్టమృగైః కిరాతై–**
**రాసేవ్యతే భిన్నశిఖణ్డిబర్హః ॥ 15**

***పదవిభాగము :–*** భాగీరథీ....ణామ్, వోఢా, ముహుః కమ్పితదేవదారుః, యద్వాయుః, అన్విష్టమృగైః, కిరాతైః, ఆసేవ్యతే, భిన్నశిఖణ్డిబర్హః।

***అన్వయక్రమము :–*** భాగీరథీ....ణామ్, వోఢా, ముహుః, కమ్పితదేవదారుః, భిన్నశిఖణ్డిబర్హః, యద్వాయుః, అన్విష్టమృగైః, కిరాతైః, ఆసేవ్యతే॥

**ప్రతిపదార్థము :–** భాగీరథీ....ణామ్ = గంగ ప్రవాహము యొక్క తుంపురులను (కర్మణి షష్ఠీ), వోఢా = వహించునట్టిదియు, ముహుః = మాటిమాటికి, కమ్పితదేవదారుః = కదల్పబడిన దేవదారు వృక్షములు కలదియు, భిన్నశిఖణ్డిబర్హః = విప్పబడిన నెమళ్ళ పింఛములు కలదియు అగు, యద్వాయుః = ఆ హిమవద్గిరి వాయువు, అన్విష్టమృగైః = వెదకబడిన జంతువులు కలవారగు, కిరాతైః = కిరాతులచే, ఆసేవ్యతే = అత్యంతము అనుభవింపబడుచున్నది.

**తాత్పర్యము :–** గంగా ప్రవాహపు తుంపురులను వహించునట్టిదియు, మాటిమాటికి కదల్పబడిన దేవదారువృక్షములు కలదియు, విప్పబడిన నెమళ్ళ పింఛములు కలదియు అగు హిమవద్గిరి వాయువు, వెదకబడిన జంతువులు కలవారగు కిరాతులచే అత్యంతము అనుభవింపబడుచున్నది.

**విభక్తులు / క్రియలు :–** 1) భాగీరథీ నిర్ఝరసీకరాణామ్ – సీకరస్య, సీకరయోః, **సీకరాణామ్;** అకారాన్త పుంలింగ శీకర శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 2) వోఢా – **వోఢా,** వోఢారౌ, వోఢారః; ఋకారాన్త పుంలింగ 'వోఢృ' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) ముహుః – అవ్యయము. 4) యద్వాయుః – **వాయుః,** వాయూ, వాయవః; ఉకారాన్త పుంలింగ 'వాయు' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) అన్విష్టమృగైః – మృగేణ, మృగాభ్యామ్, మృగైః; అకారాన్త పుంలింగ మృగ శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 6) కిరాతైః – కిరాతేణ, కిరాతాభ్యామ్, కిరాతైః; అకారాన్త పుంలింగ కిరాత శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 7) ఆసేవ్యతే – క్రియ (కర్మణిరూపమ్). 8) భిన్నశిఖణ్డిబర్హః – భిన్న శిఖణ్డీ **బర్హః,** బర్హౌ, బర్హాః; అకారాన్త పుంలింగ 'భిన్నశిఖణ్డిబర్హ' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) భాగీరథీనిర్ఝరసీకరాణామ్ – భాగీరథ్యాః నిర్ఝరః (ష.త.), భాగీరథీ నిర్ఝరః, భాగీరథీ నిర్ఝరస్య సీకరాః (ష.త.) తేషామ్.
2) కమ్పితదేవదారుః – కమ్పితా దేవదారవో యేన (బహుర్వ్రీహి) సః.
3) భిన్నశిఖణ్డిబర్హః – భిన్నాని శిఖణ్డినామ్ బర్హాణి యేన (బహుర్వ్రీహి) సః.
4) యద్వాయుః – యస్య వాయుః, (ష.త.).
5) అన్విష్టమృగైః – అన్విష్టాః మృగాః యైః (బహుర్వ్రీహి) తైః.

**సంధులు :–**

1) యద్వాయుః + అన్విష్టమృగైః = యద్వాయురన్విష్టమృగైః – విసర్గసన్ధిః.
2) కిరాతైః + ఆసేవ్యతే = కిరాతైరాసేవ్యతే – విసర్గసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. భాగీరథీనిర్ఝరసీకరాణామ్ – ఎ) భాగీరథీ

శ్లో॥ *భాగీరథీ సురసరిద్విష్ణుపదీ జాహ్నవీ తథా గంగా ।*
*మందాకినీ త్రిపథగా సరిద్వరా త్రిదశదీర్ఘికా ప్రోక్తా ॥ 673.*



అని హలాయుధకోశము తొమ్మిది నామములను పేర్కొన్నది.

బి) శ్లో॥ *భాగీరథోఽ నయా స్తుత్యాస్తుత్వా గంగాం చ నారద ।*
*జగామ తాం గృహీత్వా చ యత్ర నష్టాశ్చ సాగరాః ॥*

శ్లో॥ *వైకుణ్ఠం తే యయుస్తూర్ణం గంగాయాః స్పర్శవాయునా ।*
*భాగీరథేన సానీతా తేన భాగీరథీ స్మృతా ॥*

శ్లో॥ *ఇత్యేవం కథితం సర్వం గంగోపాఖ్యానముత్తమమ్ ।*
*పుణ్యదం మోక్షదం సారం కింభూయః శ్రోతుమిచ్ఛసి ॥*

– ఇతి బ్రహ్మవైవర్తే, ప్రకృతిఖణ్డే *10–140, 141, 142*

సి) భాగీరథస్య ఇయం భాగీరథీ **'తస్యేదమ్'** (సూ 4–3–120) ఇత్యణ్; 'యస్యేతి చ' 'ఇతీకారలోపః' **"టిడ్ఢాణఞ్ద్వయసచ్దఘ్నఞ్ మాత్రచ్ తయప్ ఠక్ ఠఞ్ కఞ్ క్వరప్"** (4–1–15) ఇతి జీష్.

డి) శ్లో॥ *గంగా త్రిపథగా భాగీరథీ త్రిదశదీర్ఘికా ।*
*త్రిస్రోతా జాహ్నవీ మందాకినీ భీష్మకుమారసూః ॥ 147*

శ్లో॥ *సరిద్వరా విష్ణుపదీ సిద్ధస్వః స్వగిఖాపగా ।*
*ఋషికుల్యా హైమవతీ స్వర్వాపీ హరశేఖరా ॥ 148*

అని అభిధాన చిన్తామణి '16' నామములను పేర్కొన్నది. గంగా, త్రిపథగా, భాగీరథీ, త్రిదశదీర్ఘికా, త్రిస్రోతాః (స్త్రీ), జాహ్నవీ, మందాకినీ, భీష్మసూః, కుమారసూః (స్త్రీ), సరిద్వరా, విష్ణుపదీ, సిద్ధాపగా, స్వరాపగా, స్వర్వ్యాపగా, ఖాపగా, ఋషికుల్యా, హైమవతీ, స్వర్వాపీ, హరశేఖరా.

ఇ) గంగాదేవిని దేవలోకంలో మందాకిని అని, భూలోకంలో భాగీరథి అని నాగలోకంలో భోగవతి అని పిలుస్తారు. గంగాదేవి భాగీరథి కనుక ఈ సందర్భముగా భగీరథుడ్ని, సగర చక్రవర్తి కుమారుల కథను ఇట అనుసంధానించుకోగలరు.

2) **భిన్నశిఖణ్డిబర్హః –**

The peacocks are particularly mentioned because they have a long plumage which can be easily acted upon by wind. It also indicates the abundance of peacocks on the mountain and explains why the breeze was gentle. The wind , having met with obstructions from the peacock's feathers in its passage, lost some of its force and became gentle. We have thus three different epithets to indicate respectively that the breeze was cool, fragrant and gentle. - Ka.

శ్లో॥ కవిసమయే వాయుస్త్రివిధో వర్ణ్యతే, శీతో మన్దః సురభిశ్చ,
భాగీరథీస్పర్శాచ్ఛీతః। దేవదారుస్పర్శాత్సురభిః। భిన్నశిఖణ్డిపిచ్ఛత్వాన్మన్దః।
–అని 'కాలే'

***క్రియాదర్శము :–*** ఆసేవ్యతే – ఎ) షేవృ (సేవనే) భ్వాది ప్రకరణమ్, ఆత్మనేపదీ, సకర్మకమ్, సేట్ – ఇతి ధాతోః కర్మణి 'సార్వధాతుకే యక్' ఇతి యక్ ప్రత్యయః, 'ధాత్వాదేః షః స' ఇతి షస్య సః. ఆ – ఉపసర్గ.

బి) ఆసేవ్యతే – ఆ+సేవ్+య, లట్ ప్రథమపురుష ఏకవచనము.

సి) కర్మార్థకము :– (Passive voice) – క్రియాపదము నందలి 'తిఙ్' ప్రత్యయము కర్మార్థమున చేయబడినచో అది కర్మార్థకమగును. అట్టి వాక్యమున కర్తృవాచకపదము తృతీయాంతముగను, కర్మవాచకపదము ప్రథమాంతముగను ఉండును. ఇది సకర్మక ధాతువులకే ఉండును.

ఉదా : కిరాతైః యద్వాయుః ఆసేవ్యతే. కర్మణి తు పురుషత్రయం వచనత్రయమపి। ఆసేవ్యతే – ఆసేవ్యేతే – ఆసేవ్యన్తే; ఆసేవ్యసే – ఆసేవ్యేథే – ఆసేవ్యధ్వే; ఆసేవ్యే – ఆసేవ్యావహే, ఆసేవ్యామహే; లట్ రూపాలు.

***అలంకారములు :–*** ఇచట 'స్వభావోక్త్యలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :–*** శ్లో॥ స్వభావోక్త్యలంకార ఇతి కేచిత్ ప్రచక్షతే ।
అర్థస్య తదవస్థత్వం స్వభావోఽభిహితో యథా ॥ కావ్యాలంకారః

" ఒక వస్తువు యొక్క యథార్థస్వరూపము దాని స్వభావము దానిని ఉన్నదున్నట్లు వర్ణించుట స్వభావోక్తి. వేటాడుటవలన అలసిన కిరాతులచే వాయువు మిక్కిలి అనుభవింపబడుచున్నదని వర్ణించుటచే నిది స్వభావోక్తిగ చెప్పదగును. ❁

**శ్లో॥ సప్తర్షిహస్తావచితావశేషా–**
**ణ్యధో వివస్వాన్ పరివర్తమానః ।**
**పద్మాని యస్యాగ్రసరోరుహాణి**
**ప్రబోధయత్యూర్ధ్వముఖైర్మయూఖైః ॥ 16**

***పదవిభాగము :–*** సప్తర్షిహస్తావచితావశేషాణి, అధః, వివస్వాన్, పరివర్తమానః, పద్మాని, యస్య, అగ్రసరోరుహాణి, ప్రబోధయతి, ఊర్ధ్వముఖైః, మయూఖైః।

***అన్వయక్రమము :–*** యస్య, సప్తర్షి...శేషాణి, అగ్రసరోరుహాణి, పద్మాని, అధః, పరివర్తమానః, వివస్వాన్, ఊర్ధ్వముఖైః, మయూఖైః, ప్రబోధయతి.

***ప్రతిపదార్థము :–*** సప్తర్షి...శేషాణి = సప్తర్షుల చేతులచే త్రుంప మిగిలినవానిని,యస్య =



ఆ హిమవన్నగముయొక్క, అగ్రసరోరుహాణి=అగ్రముయందలి కొలనలలో ప్రాదుర్భవించినవియు, అగు, పద్మాని = తామరపువ్వులను, అధః = దిగువను, పరివర్తమానః = భ్రమించుచున్న, వివస్వాన్ = సూర్యుడు, ఊర్ధ్వముఖైః = ఊర్ధ్వముగా వ్యాపించెడి, మయూఖైః = కిరణములచేత, ప్రబోధయతి = వికసింపజేయుచున్నాడు.

**తాత్పర్యము :–** ఆ హిమవన్నగము యొక్క అగ్రము యందలి కొలనలలో ప్రాదుర్భవించినవియు, సప్తర్షులచేతులచే త్రుంప మిగిలినవి యగు తామరపువ్వులను దిగువ భ్రమించుచున్న సూర్యుడు ఊర్ధ్వముగా వ్యాపించెడి కిరణముల చేత వికసింపజేయు చున్నాడు.

***విభక్తులు / క్రియలు :–*** 1) సప్తర్షి...శేషాణి – శేషమ్, శేషే, **శేషాణి;** అకారాన్త నపుంసకలింగ 'శేష' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 2) అధః – అవ్యయము. 3) వివస్వాన్ – వివస్వాన్, వివస్వాంతౌ, వివస్వన్తః; తకారాన్త పుంలింగ 'వివస్వత్' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) పరివర్తమానః – **పరివర్తమానః,**పరివర్తమానౌ, పరివర్తమానాః; అకారాన్త పుంలింగ 'పరివర్తమాన' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) పద్మాని – పద్మమ్, పద్మే, **పద్మాని;** అకారాన్త నపుంసక లింగ 'పద్మ' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 6) యస్య–**యస్య,** యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) అగ్రసరోరుహాణి – అగ్రసరోరుహమ్, అగ్రసరోరుహే, **అగ్రసరోరుహాణి;** అకారాన్త నపుంసకలింగ 'అగ్రసరోరుహ' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 8) ప్రబోధయతి – క్రియ. 9) ఊర్ధ్వముఖైః – ఊర్ధ్వముఖేణ, ఊర్ధ్వముఖాభ్యామ్, **ఊర్ధ్వముఖైః;** అకారాన్త పుంలింగ ముఖ శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 10) మయూఖైః – మయూఖేన, మయూఖాభ్యామ్,**మయూఖైః;** అకారాన్త పుంలింగ మయూఖ శబ్దము, తృతీయావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) సప్తర్షిహస్తావచితావశేషాణి – సప్త చ తే ఋషయః (ద్విగు), సప్తర్షయః, సప్తర్షీణాం హస్తాః (ష.త.) సప్తర్షిహస్తాః, సప్తర్షిహస్తైః అవచితాని (తృ.త.), సప్తర్షిహస్తావచితేభ్యః అవశేషాః (పం.త.) తాని.

2) అగ్రసరోరుహాణి –అగ్రే సరాంసి (స.త.) అగ్రసరాంసి అగ్రసరఃసు రుహాణి (స.త.) అగ్రసరోరుహాణి. 3) ఊర్ధ్వముఖైః – ఊర్ధ్వం ముఖం యేషామ్ (బహువ్రీహి), తైః

***సంధులు :–***

1) సప్తర్షి...శేషాణి + అధః = సప్తర్షి...శేషాణ్యధః, యణాదేశసన్ధిః, ఇకోయణచి.

2) యస్య + అగ్ర... = యస్యాగ్ర.... సవర్ణదీర్ఘసంధిః, అకః సవర్ణే దీర్ఘః.

3) ప్రబోధయతి + ఊర్ధ్వముఖైః = ప్రబోధయత్యూర్ధ్వముఖైః, యణాదేశసన్ధిః.

4) ....ముఖైః + మయూఖైః = ....ముఖైర్మయూఖై, విసర్గసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

**1. సప్తర్షులు –**

*శ్లో॥ మరీచిరఙ్గిరా అత్రిః పులస్త్యః పులహః క్రతుః ।*
*వసిష్ఠశ్చేతి సప్తైతే జ్ఞేయాశ్చిత్రశిఖణ్డినః ॥*

ఈ సప్తర్షులు కల్పకల్పానికి మారుతుంటారు. వేటే మన్వన్తరం లో

**శ్లో॥ కశ్యపోऽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోऽథ గౌతమః ।**

**జమదగ్నిర్వసిష్ఠశ్చ సప్తైతే ఋషయః స్మృతాః ॥** చెప్పబడినారు.

దక్షసావర్ణిక, రుద్రసావర్ణిక, స్వాయంభువ, తామస, రైవత, చాక్షుస వైవస్వత మనువు కాలములలో ఉన్న ఋషుల నామములలో వైవిధ్యమున్నది.

వైవస్వతమనువు కాలము నాటి సప్తర్షులు వీరు.

1) వశిష్ఠుడు, 2) అత్రి, 3) గౌతముడు, 4) కశ్యపుడు, 5) భారద్వాజుడు, 6) జమదగ్ని, 7) విశ్వామిత్రుడు.

సప్తర్షులు పూజకై పద్మాలను తీసికొని వెళ్ళినారని చెప్పటం చేత ఆ పద్మాలకు సాఫల్యత చేకూరినదని చెప్పదగును.

***క్రియాదర్శము :–*** 1) **ప్రబోధయతి** – ప్ర – ఉపసర్గ, బుధ (బుధ్) అవగమనే (తెలిసికొనుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాది ప్రకరణమ్ (1). ప్రయోజక వ్యాపారమును గాని, ప్రేరణార్థమును గాని చెప్పుటకు ధాతువుపై ణిచ్ (ఇ) ప్రత్యయము చేరును. (హేతుమతి చ 3–1–26). ఈ ణిజన్తము 'సనాద్యన్తా ధాతవః (సూ 3–1–32) అను సూత్రముచే ధాతు సంజ్ఞ కల్గియుండుటచే దీనిపై లడాదులు వచ్చును. ఇవి ఉభయపదులు. ప్రేరణార్థమున – లట్ ప్రథమ పురుషరూపములు దిగువ నీయబడినవి. **ప్రబోధయతి** – ప్రబోధయతః – ప్రబోధయన్తి.

2) ప్ర – ఉపసర్గ, బుధ (బుధ్) అవగమనే (తెలియుట), దివాదిప్రకరణమ్ (4) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. లట్ ప్రథమపురుషరూపాలు – బుధ్యతే – బుధ్యేతే – బుధ్యన్తే. "బుధయుధనశ" (1–3–76) ఇతి పరస్మైపదమ్। ణిచశ్చాపవాదః। ప్రేరణార్థమున ఇచట కూడ **ప్రబోధయతి** – ప్రబోధయతః – ప్రబోధయన్తి.

***అలంకారములు :–*** ఇందు 'ఉదాత్తాలంకారము' గలదని చెప్పదగును.

"సూర్యుడు ఊర్ధ్వంగా ప్రసరింపజేసే కిరణాల ద్వారా హిమాలయము యొక్క అగ్రభాగాన నున్న కొలనలలోని తామరపువ్వులను వికసింపజేయుచున్నాడని వర్ణించుటచేత 'హిమాలయ ఔన్నత్యము' చెప్పబడుటచే ఇట 'ఉదాత్తాలంకార' మని చెప్పదగును.

***లక్షణము :– శ్లో॥ లోకాతిశయసంపత్తి వర్ణనోదాత్తముచ్యతే ।***

***యద్వాపి ప్రస్తుతస్యాఙ్గం మహతాం చరితం భవేత్ ॥***

*– సాహిత్యదర్పణే, దశమః పరిచ్ఛేదః –94.*





**శ్లో॥ యజ్ఞాఙ్గయోనిత్వమవేక్ష్య యస్య**
**సారం ధరిత్రీధరణక్షమం చ ।**
**ప్రజాపతిః కల్పితయజ్ఞభాగం**
**శైలాధిపత్యం స్వయమన్వతిష్ఠత్ ॥ 17**

***పదవిభాగము :–*** యజ్ఞాఙ్గయోనిత్వమ్, అవేక్ష్య, యస్య, సారమ్, ధరిత్రీధరణక్షమమ్, చ, ప్రజాపతిః, కల్పిత యజ్ఞభాగమ్, శైలాధిపత్యమ్, స్వయమ్, అన్వతిష్ఠత్.

***అన్వయక్రమము :–*** యస్య, యజ్ఞాఙ్గయోనిత్వమ్, ధరిత్రీధరణక్షమమ్, సారమ్, చ, అవేక్ష్య, ప్రజాపతిః, స్వయమ్, కల్పిత యజ్ఞభాగమ్, శైలాధిపత్యమ్, అన్వతిష్ఠత్.

***ప్రతిపదార్థము :–*** యస్య = ఆ హిమవంతుని యొక్క, యజ్ఞాఙ్గయోనిత్వమ్ = యజ్ఞసాధనములకు కారణమగుటను, ధరిత్రీధరణక్షమమ్ = భూభారమును ధరించుటకు తగిన, సారమ్ చ = బలమును, అవేక్ష్య = తెలిసికొని, ప్రజాపతిః = బ్రహ్మ, స్వయమ్ = స్వయంగ, కల్పితయజ్ఞభాగమ్ = యజ్ఞభాగభోక్తృత్వమును, శైలాధిపత్యమ్ = పర్వతరాజ్యాధిపత్యమును, అన్వతిష్ఠత్ = చేసెను. (అనుగ్రహించెను.)

***తాత్పర్యము :–*** ఆ హిమవంతుని యొక్క యజ్ఞసాధనములకు కారణమగుటను, భూభారమును ధరించుటకు తగిన బలమును తెలిసికొని, బ్రహ్మ స్వయంగ యజ్ఞభాగభోక్తృత్వమును పర్వత రాజ్యాధిపత్యమును అనుగ్రహించెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) యజ్ఞాంగయోనిత్వమ్ – (తిద్ధితాన్తము) – **యజ్ఞాంగయోనిత్వమ్,** యజ్ఞాంగయోనిత్వే, యజ్ఞాంగయోనిత్వాని; అకారాన్త నపుంసకలింగ 'యజ్ఞాంగ యోనిత్వ' శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) అవేక్ష్య – (ల్యబన్త) అవ్యయము. 3) యస్య – **యస్య,** యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) సారమ్ – **సారమ్**, సారౌ, సారాన్; అకారాన్త పుంలింగ సార శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) ధరిత్రీధరణక్షమమ్ – **క్షమమ్,** క్షమౌ, క్షమాన్; అకారాన్త నపుంసకలింగ క్షమ శబ్దము; ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) చ – అవ్యయము. 7) ప్రజాపతిః – ప్రజాపతిః, ప్రజాపతీ, ప్రజాపతయః; ఇకారాన్త పుంలింగ ప్రజాపతి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) కల్పితయజ్ఞభాగమ్ – భాగమ్, భాగే, భాగాని; అకారాన్త నపుంసకలింగ 'భాగ' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) శైలాధిపత్యమ్ – శైలాధిపత్యమ్, శైలాధిపత్యే, శైలాధిపత్యాని; అకారాన్త నపుంసకలింగ శైలాధిపత్య శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) స్వయమ్ – అవ్యయము. 11) అన్వతిష్ఠత్ – క్రియ.

***సమాసాలు :–***

1) యజ్ఞాంగయోనిత్వమ్ – యజ్ఞస్య అంగాని (ష.త.) యజ్ఞాంగాని, యజ్ఞాఙ్గానాం యోనిః (ష.త.); యజ్ఞాంగయోనిః, తస్య భావః తత్।

2) ధరిత్రీధరణక్షమమ్ – ధరిత్ర్యా ధరణమ్ (ష.త.), ధరిత్రీధరణమ్, ధరిత్రీధరణే క్షమః (స.త.) తమ్.

3) కల్పితయజ్ఞభాగమ్ – యజ్ఞస్య భాగః (ష.త.) కల్పితః యజ్ఞభాగః యస్మిన్ (బహువ్రీహి) తత్.

4) శైలాధిపత్యమ్ – శైలానాం ఆధిపత్యమ్ (ష.త.).

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

**1. శైలాధిపత్యమ్ –**

ఎ) బ్రహ్మదేవుడు శైలాధిపత్యమును హిమవంతునికి ఇచ్చిన సంగతిని బ్రహ్మాండ పురాణమిట్లు తెలిపినది.

శ్లో॥ *శైలానాం హిమవన్తం చ, నదీనాం చైవ సాగరమ్ ।*
*గన్ధర్వానామధిపతిం చక్రే చిత్రరథం విధిః ॥*

విష్ణుపురాణము హిమవంతుని గూర్చి ఇలా పేర్కొన్నది.

శ్లో॥ *'యజ్ఞాఙ్గార్థం మయా సృష్టో హిమవానచలేశ్వరః।'*

బి) శ్లో॥ *శైలోఽద్రిః శిఖరీ శిలోచ్చయగిరీ గోత్రోఽచలః సానుమాన్ ।*
*గ్రావా పర్వతభూధ్రభూధరధరాహార్యా నగో.....*

'పర్వతము'నకు 15 నామములను,

సి) శ్లో॥ *.....ఉదగద్రి స్త్వద్రిరాడ్ మేనకా –*
*ప్రాణేశో హిమవాన్ హిమాలయ హిమప్రస్థా భవానీగురుః ॥ 93.*

హిమవత్పర్వతమునకు '3' నామములను ఇచ్చినది అభిధానచిన్తామణి.

***క్రియాదర్శము :–*** **అన్వతిష్ఠత్** – ఎ) అనూపర్గపూర్వకాత్ 'షా–గతినివృత్తౌ' ఇతి ధాతోః 'అనద్యతనే లఙ్' ష్టా ఇత్యత్ర 'ధాత్వాదేః షః సః' ఇతి సూత్రేణ షకారస్య సకారాదేశః, తతః నిమత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయ' ఇతి న్యాయేన ఠకార నివృత్తౌ స్థా ఇత్యాకారకం రూపం జాతం తతః తస్య పాఘ్రాధ్మాస్థామ్నాదాణ్ దృశ్యర్తిసర్తిశ దసదాం *విభజిఘ్రధమతిష్ఠమనయచ్ఛపశ్యర్ఛధౌశీయసీదాః। (7–3–79)* ఇతి సూత్రేణ ***తిష్ఠాదేశః ।***

బి) ష్ఠా (స్థా) గతి నివృత్తౌ (నిలుచుట) భ్వాదిప్రకరణమ్, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లఙ్ ప్రథమపురుషరూపాలు. **అన్వతిష్ఠత్ –** అన్వతిష్ఠతామ్ – అన్వతిష్ఠన్.

***అలంకారములు :–*** ఈ శ్లోకమున 'కావ్యలింగాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– "హేతోర్వాక్యపదార్థేత్వే కావ్యలింగం నిగద్యతే"।*** *వాక్యపదార్థత్వే వాక్యపదాన్యతరప్రతిపాద్యే వాక్యార్థస్య పదార్థస్య వా హేతుత్వే వ్యఙ్గ్యో ఇతి పర్యవసితోఽర్థః। క్రియాన్వసమాప్తౌ వాక్యార్థత్వమ్। అన్యథా పదార్థత్వమ్। అయమేవ హేత్వలంకార ఉచ్యతే।* ***–సాహిత్యదర్పణే.***

హిమవన్నగము యజ్ఞసాధనభూత సోమలతలకు ఉత్పత్తిస్థానమగుటచే తను, భూభారమును ధరించుటకు తగిన బలము గలవాడగుటచేతను, బ్రహ్మదేవుడు యజ్ఞభాగమునకు అధికారిగాను, శైలాధిపత్యమును అనుగ్రహించినట్లు హేతువు చెప్పబడుటచే నిట 'కావ్యలింగాలంకార' మున్నదని చెప్పదగును. 



***అవతారికా :–*** హిమవతో వివాహః – హిమవంతుని వివాహము.

**శ్లో॥ స మానసీం మేరుసఖః పితౄణాం**
**కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః ।**
**మేనాం మునీనామపి మాననీయా –**
**మాత్మానురూపాం విధినోపయేమే ॥ 18**

***పదవిభాగము :–*** సః, మానసీమ్, మేరుసఖః, పితౄణామ్, కన్యామ్, కులస్య, స్థితయే, స్థితిజ్ఞః, మేనామ్, మునీనామ్, అపి, మాననీయామ్, ఆత్మానురూపామ్, విధినా, ఉపయేమే.

***అన్వయక్రమము :–*** మేరుసఖః, స్థితిజ్ఞః, సః, పితౄణామ్, మానసీమ్, మునీనామ్, అపి, మాననీయామ్, ఆత్మానురూపామ్, మేనామ్, కన్యామ్, కులస్య, స్థితయే, విధినా, ఉపయేమే।

***ప్రతిపదార్థము :–*** మేరుసఖః = మేరువు యొక్క మిత్రుడును, స్థితిజ్ఞః = మర్యాద నెఱింగిన వాడును అగు, సః = ఆ హిమవంతుడు, పితౄణామ్ = పితృదేవతల యొక్క, మానసీమ్ =మనసున పుట్టినదియును, మునీనామ్ అపి = మునులకును, మాననీయామ్ = గౌరవింప దగినదియును, ఆత్మానురూపామ్ = తనకు తగినదియు నగు, మేనామ్ కన్యామ్ ='మేన' యనెడు కన్యకను, కులస్య = వంశము యొక్క, స్థితయే = ప్రతిష్ఠకొఱకు (తన వంశము అవిచ్ఛిన్నముగా సాగుట కొఱకు), విధినా = శాస్త్రవిధి చేత, ఉపయేమే = పెండ్లి చేసికొనెను.

***తాత్పర్యము :–*** మేరువుయొక్క మిత్రుడును, మర్యాద తెలిసినవాడును అగు ఆ హిమవంతుడు పితృదేవతల మానస పుత్త్రికయు, మునులకు సయితము పూజ్యురాలును, తనకు తగినదియునగు 'మేన'యనెడు కన్యకను వంశ ప్రతిష్ఠకై శాస్త్రవిధిచేత పెండ్లి చేసికొనెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) సః – **సః,** తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) మానసీమ్ – **మానసీమ్,** మానస్యౌ, మానసీః; ఈకారాన్త స్త్రీలింగ 'మానసీ' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 3) మేరుసఖః – **మేరుసఖః,** మేరుసఖౌ, మేరుసఖాః; అకారాన్త పుంలింగ 'మేరుసఖ' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) పితౄణామ్ – పితుః, పిత్రోః, **పితౄణామ్;** ఋకారాన్త పుంలింగ పితృ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 5) కన్యామ్ – **కన్యామ్,** కన్యే, కన్యాః; ఆకారాన్త స్త్రీలింగ 'కన్యా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) కులస్య – **కులస్య,** కులయోః, కులానామ్; అకారాన్త నపుంసకలింగ 'కుల' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) స్థితయే – స్థితయే (స్థిత్యై), స్థితిభ్యామ్, స్థితిభ్యః; ఇకారాన్త స్త్రీలింగ 'స్థితి' శబ్దము, చతుర్థీవిభక్తి ఏకవచనము. 8) స్థితజ్ఞః – స్థితజ్ఞః, స్థితజ్ఞౌ, స్థితజ్ఞాః; అకారాన్త పుంలింగ 'స్థితజ్ఞ' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) మేనామ్ – **మేనామ్,** మేనే, మేనాః; ఆకారాన్త స్త్రీలింగ మేనా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) మునీనామ్ – మునేః, మున్యోః, **మునీనామ్;** ఇకారాన్త పుంలింగ ముని శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 11) అపి – అవ్యయము. 12) మాననీయామ్ – **మాననీయామ్,** మాననీయే, మాననీయాః, ఆకారాన్త స్త్రీలింగ 'మాననీయా' శబ్దము. ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) ఆత్మానురూపామ్ – **ఆత్మానురూపామ్,** ఆత్మానురూపే, ఆత్మానురూపాః, ఆకారాన్త స్త్రీలింగ 'ఆత్మానురూపా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 14) విధినా – **విధినా,** విధిభ్యామ్, విధిభిః; ఇకారాన్త పుంలింగ 'విధి' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 15) ఉపయేమే – క్రియ.

**సమాసాలు :-**

1) మేరుసఖః - మేరోః సఖా (ష.త.);

2) స్థితిజ్ఞ - స్థితిం జానాతీతి (ఉపపదతత్పురుష);

3) ఆత్మానురూపామ్ - ఆత్మనః అనురూపామ్ (ష.త.).

**సంధులు :-**

1) విధినా + ఉపయేమే = విధినోపయేమే, గుణసన్ధిః, **ఆద్గుణః** (సూ 6-1-84) అవర్ణమునకు (అ, ఆ లకు) హ్రస్వదీర్ఘములైన ఇ, ఉ, ఋ వర్ణములు పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానములో గుణము ఏకాదేశమగును. ఇచట గుణములు క్రమముగా ఏ, ఓ, అర్, అల్ అనునవి ఆదేశమగునని తెలియనగును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.**

1. **మేరుసఖః** - ఎ) మేరుః - మి + 'మిపీభ్యాం రుః' ఇతి రు. మినోతి క్షిపతి జ్యోతీంషి ఉచ్చత్వాత్.

శ్లో॥ *పంచైతే సురతరవో మేరుః సురపర్వతో జ్ఞేయః ॥ 135*

శ్లో॥ *శక్రక్రీడాచలో మేరుః సుమేరుర్హేమపర్వతః ।*
*రత్నసానురితి ఖ్యాతో హేమాద్రి స్త్రిదశాలయః ॥ 136* - హలాయుధకోశః.

శ్లో॥ *దేవర్షిగన్ధర్వయుతః ప్రథమో మేరురుచ్యతే ।*
*ప్రాగాయతః ససౌవర్ణ ఉదయో నామ పర్వతః ॥* -ఇతి మాత్స్యే.

శ్లో॥ *.....ఉ థ మేరుః కర్ణికాచలః ॥ 97*

శ్లో॥ *రత్నసానుః సుమేరుః స్వఃస్వర్గికాంచనతో గిరిః । ...*

అని మేరుపర్వతమునకు అభిదానచిన్తామణి '7' నామముల పేర్కొన్నది. 1. మేరుః, 2. కర్ణికాచలః, 3. రత్నసానుః, 4. సుమేరుః, 5. స్వర్గిరిః, 6. స్వర్గిగిరిః, 7. కాంచనగిరిః అనునవి యవి.

బి) The sacred mountain Meru, in the centre of the seven continents, compared to the cup or seed-vessal of lotus, the leaves of which are formed by the different Dwipas; its height is said by the Hindus to be 84000 yojanas, sixteen thousand of which are below the surface of the earth; the shape is variously described, as square, conical, columnar, spherical, or spiral; and the four faces of it are of various colors, or White towards the East, Yellow to the South, Black to the West and ..... towards the North; the river Ganges falls from heaven on its summit, and flows thence to the



surrounding worlds in four streams; the southern branch is the Ganges of India, the northern running into Tartary is the Bhadrasoma; the eastern in the Sita, and the western the Chacshu or Oxus: on the summit of Meru 'Brahma' resides attended and worshipped by the Rishis, Gandharvas, & C., the regents of the points of the compass occupy the corresponding faces of the mountain, the whole of which consists of gold and gems: Considered in any but a fabulous light, mount Meru appears to mean the high land of Tartary, immediately to the north of Himalaya mountains.

- Sabdasagar. Page 578.

2) **మేనా** - ఎ) మేనా దేవి పితృదేవతల యొక్క మనఃసంకల్పము వల్ల పుట్టిందని, హిమవంతుడు పెండ్లాడాడని బ్రహ్మాండపురాణమూ చెబుతుందని 'సంజీవనీవ్యాఖ్యా' పేర్కొన్నది.

శ్లో॥ *తేషాం తు మానసీ కన్యా మేనా నామ మహాగిరేః*
*పత్నీ హిమవతో, యస్యాః పుత్రో మైనాక ఉచ్యతే ॥*

బి) పితృదేవతలకు పుట్టిన యీ మేనా మఱియు హరిణి అనే మహాసాధ్వి యోగులకు, బ్రహ్మవాదులకు పూజ్యురాండ్రని విష్ణుపురాణవచనము.

శ్లో॥ *తేభ్యః శుభాస్పదం జజ్ఞే మేనకా హరిణీ తథా ।*
*తే ఉభే బ్రహ్మవాదిన్యౌ యోగిన్యౌ చాప్యుభే ద్విజ॥*

**క్రియాదర్శము :- ఉపయేమే** - ఉప + యేమే, యమ - ఉపరమే, అకర్మకమ్, అనిట్ భ్వాదిప్రకరణమ్, పరస్మైపదీ. ఉపసర్గ ఉప చేరికతో 'వివాహము చేసుకొను' అర్థము ఏర్పడుటయే గాక 'ఆత్మనేపదీ' యగును. ఉపాద్యమస్స్వకరణే ఇత్యాత్మనేపదమ్ । లిట్ ప్రథమపురుషరూపాలు. - **ఉపయేమే,** ఉపయేమాతే, ఉపయేమిరే. - రఘువంశము (14-87) లోని ఈ పదప్రయోగమును చూడండి.

శ్లో॥ *సీతాం హిత్వా దశముఖరిపు**ర్నోపయేమే** యదన్యాం*
*తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూనాజహార ।*
*వృత్తాన్తేన శ్రవణవిషయ ప్రాపిణా తేన భర్తుః*
*సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే ॥*

"తనను విడిచిన పిమ్మట, రాముడు మఱియొక స్త్రీని వివాహమాడలేదనియు, ఆమె యొక్క ఆకారముతోనే ఒక బంగారు బొమ్మను నిర్మించి, దానితో భార్యావంతుడై యజ్ఞములు చేయుచున్నాడనియు, వినుటచేత భర్తయందు భక్తి కలిగిన సీత, దుర్వారమైన పరిత్యాగ దుఃఖమును అతికష్టముమీద భరించెను.

***అలంకారములు :–*** ఇందు 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– "ఉక్తిర్విశేషణైః సాభిప్రాయైః పరికరో మతః"*** –సాహిత్యదర్పణే

అభిప్రాయముతో కూడిన విశేషణాలచేత విశేష్యము యొక్క పరిపుష్టిచేయబడేదే 'పరికరాలంకారము' అగును.

హిమవంతుడు, మేనాదేవులిరువురును విశేషణాల చేత పరిపుష్టి చేయబడుటచే నిట 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును. ❀

శ్లో॥ **కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే**
**స్వరూపయోగ్యే సురతప్రసఙ్గే ।**
**మనోహరం యౌవనముద్వహన్త్యా**
**గర్భోఽభవద్భూధరరాజపత్న్యాః ॥ 19**

***పదవిభాగము :–*** కాలక్రమేణ, అథ, తయోః, ప్రవృత్తే, స్వరూపయోగ్యే, సురతప్రసఙ్గే, మనోహరమ్, యౌవనమ్, ఉద్వహన్త్యాః, గర్భః, అభవత్, భూధరరాజపత్న్యాః।

***అన్వయక్రమము :–*** అథ, కాలక్రమేణ, తయోః, స్వరూపయోగ్యే, సురతప్రసఙ్గే, ప్రవృత్తే, మనోహరమ్, యౌవనమ్, ఉద్వహన్త్యాః, భూధరరాజపత్న్యాః, గర్భః, అభవత్।

***ప్రతిపదార్థము :–*** అథ = పిమ్మట, కాలక్రమేణ = కాలముగడుచుచుండగా, తయోః = ఆ (మేనకా హిమవంతులకు) దంపతులకు, స్వరూపయోగ్యే = సౌందర్యమునకు తగిన, సురతప్రసఙ్గే = సురతవ్యాపారము, ప్రవృత్తే –(సతి) = జరిగినది కాగా, మనోహరమ్ = అందమైన, యౌవనమ్ = జవ్వనమును, ఉద్వహన్త్యాః = తాల్చియున్న, భూధరరాజపత్న్యాః = హిమవత్పత్నికి, గర్భః = (గర్భము) కడుపు, అభవత్ = ఆయెను.

***తాత్పర్యము :–*** పిమ్మట కాలము గడుచుచుండగా, ఆ మేనా హిమవంతులకు సౌందర్యయోగ్యమయిన సురతవ్యాపారము జరిగినది కాగా, మనోహరమయిన యౌవనము నందున్న యా హిమవత్పత్నికి గర్భమాయెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) అథ – అవ్యయము. 2) కాలక్రమేణ – **కాలక్రమేణ,** కాలక్రమాభ్యామ్, కాలక్రమైః; అకారాన్త పుంలింగ 'కాలక్రమ' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) తయోః – తస్యాః, **తయోః,** తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ద్వివచనము. 4) ప్రవృత్తే – **ప్రవృత్తే,** ప్రవృత్తయోః, ప్రవృత్తేషు; అకారాన్త పుంలింగ ప్రవృత్త శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) స్వరూపయోగ్యే – **స్వరూపయోగ్యే,** స్వరూపయోగ్యయోః, స్వరూపయోగ్యేషు; అకారాన్త పుంలింగ 'స్వరూపయోగ్య' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 6) సురతప్రసఙ్గే – **సురతప్రసఙ్గే,** సురతప్రసఙ్గయోః, సురతప్రసఙ్గేషు; అకారాన్త పుంలింగ సురతప్రసఙ్గ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 7) మనోహరమ్ – **మనోహరమ్,** మనోహరే, మనోహరాణి; అకారాన్త నపుంసకలింగ మనోహర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) యౌవనమ్ – **యౌవనమ్**, యౌవనే, యౌవనాని; అకారాన్త నపుంసకలింగ యౌవన శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) ఉద్వహన్త్యాః – **ఉద్వహన్త్యాః**, ఉద్వహన్త్యోః, ఉద్వహన్తీనామ్; ఈకారాన్త స్త్రీలింగ 'ఉద్వహన్తీ' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) భూధరరాజపత్న్యాః – **పత్న్యాః,** పత్న్యోః, పత్నీనామ్; ఈకారాన్త స్త్రీలింగ భూధరరాజపత్నీ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) గర్భః – **గర్భః,** గర్భౌ, గర్భాః; అకారాన్త పుంలింగ గర్భ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 12) అభవత్ – క్రియ.



***సమాసాలు :–***

1) కాలక్రమేణ – కాలస్య క్రమః (ష.త.) తేన;
2) స్వరూపయోగ్యే – స్వరూపస్య యోగ్యః (ష.త.) తస్మిన్;
3) సురతప్రసఙ్గే – సురతస్య ప్రసఙ్గః (ష.త.) తస్మిన్;
4) భూధరరాజపత్న్యాః – భువః ధరాః భూధరాః (ష.త.) భూధరాణాం రాజా (ష.త.) భూధరరాజః, భూధరరాజస్య పత్నీ (ష.త.) తస్యాః।

***సంధులు :–***

1) కాలక్రమేణ + అథ = కాలక్రమేణాథ, సవర్ణదీర్ఘసన్ధిః.
2) గర్భః + అభవత్ = గర్భోఽభవత్, ఉత్వాదేశసన్ధిః,

**అతోరోరప్లుతాదప్లుతే** (సూ 6–1–109), అప్లుతమగు హ్రస్వ – అకారములకు పరముగానున్న రుత్వమునకు అప్లుతమైన హ్రస్వ అకారము పరముగానున్నప్పుడు ఉకారము వచ్చును. పిదప పూర్వరూపము.

**ఏఙః పదాన్తాదతి** (సూ 6–1–105). గర్భః + అభవత్ = గర్భస్ + అభవత్ – రుత్వాదేశము; గర్భర్ + అభవత్ – ఉత్వాదేశము; గర్భ + ఉ + అభవత్ – గుణము; గర్భో + అభవత్ – పూర్వరూపము –గర్భోఽభవత్.

3) అభవత్ + భూధర... = అభవద్భూధర, జశ్త్వసన్ధిః,

**ఝలాం జశోఽన్తే** (సూ 8–2–39) "అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) సవర్ణమైన వర్గతృతీయ వర్ణము (జశ్త్వము) ఆదేశముగ వచ్చును.

**ప్రత్యాహారసూత్రములు** ఇచట అనుసంధానము చేసుకొనదగును. **1.అఇఉణ్, 2.ఋ ఌక్, 3.ఏఓఙ్, 4.ఐఔచ్, 5.హయవరట్, 6.లణ్, 7.ఞమఙణనమ్, 8.ఝభఞ్, 9.ఘఢధష్, 10.జబగడదశ్, 11.ఖఫఛఠథచటతవ్, 12.కపయ్, 13.శషసర్, 14.హల్.** వీనిని **మాహేశ్వరసూత్రము**లని కూడా అందురు.

ఎ) **ఝల్ –** ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ – 24 అక్షరములు బి) **జశ్ –** జ బ గ డ ద – 5 అక్షరములు.

***పాఠాంతరాలు :–*** మనోహరమ్ – మనోరమమ్ – 'పుంసవనీ'వ్యాఖ్యా.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **మనోహరమ్ : మనోరమమ్ –**

ఎ) రమతే ఇతి రమమ్, 'నన్దిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః' ఇతి రముధాతోః అచ్, మనసః రమమ్, తత్।

బి) "సుందరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్ ।

కాంతం మనోరమం రుచ్యం మనోజ్ఞం మంజు మంజులమ్" అని అమరము

సి) శ్లో॥ చారు హారి రుచిరం మనోహరం వల్గు కాన్తమభిరామబన్ధురే।

వానరుచ్యసుషమాణి శోభనం మంజుమంజుల మనోరమాణి చ॥ 80

శ్లో॥ సాధురమ్యమనోజ్ఞాని పేశలం హృద్యసుందరే ।

కామ్యం కమ్రం కామనీయం సౌమ్యఇ్చమధురం ప్రియమ్ ॥ 81

అని '28' నామములను 'అభిధానచిన్తామణి' పేర్కొన్నది.

డి) మనోహరమ్ (త్రి). హరతీతి, హృ + అచ్। మనసోహరమితి.

1) *'స్త్రీణాం సుఖోద్యమక్రూరం విస్పష్టార్థం మనోహరమ్' ఇతి మనుః 2-33*

2) *'స దదర్శ తదా తత్ర హెూమధేనుం మనోహరామ్' ఇతి మార్కణ్డేయ-112/33*)

*.....మధురం మంజుప్రియం మంజులమ్ ॥*

*హృద్యం హారి మనోహరం చ రుచిరం కాంతం పరం సుందరమ్ ।*

*సౌమ్యం సాధు చ వల్గు చారు సుషమం వామం శుభం పేశలమ్ ॥ 689*

అని 'హలాయుధకోశము' 18 నామములను పేర్కొన్నది.

ఇ) రఘువంశము 3-32 లోని ఈ పదప్రయోగము తోబాటు భావసాదృశ్యమునూ గమనించండి.

శ్లో॥ *మహెూక్షతాం వత్సతరః స్పృశన్నివ*

*ద్విపేన్ద్రభావం కలభః శ్రయన్నివ ।*

*రఘుః క్రమాత్ యౌవభిన్నశైశవః*

*పుపోష గమ్భీర్యమనోహరం వపుః ॥*

కాలక్రమమున యౌవనముచేత పోగొట్టబడిన బాల్యదశకలవాడై రఘువు మహావృషభత్వ దశకు చేరు కోడెదూడవలెను, గజేంద్రత్వము నందుచున్న గున్న ఏనుగు వలెను, నిండుదనముచే అందమైన గంభీరమైన శరీరమును పోషించెను.

**'సృజన'** కు తగిన 'శరీర' స్థితిని, పుంలింగ, స్త్రీలింగధారులలోని స్థితిని, వర్ణించుట అసామాన్యము.

***క్రియాదర్శము :-* అభవత్** – భూసత్తాయామ్ (ఉండుట) భ్వాదిప్రకరణమ్ (1), అకర్మకమ్, సేట్, పరస్మైపదీ. 'అనద్యతన భూతే లఙ్'.

లఙ్ ప్రథమపురుషరూపాలు : అభవత్ – అభవతామ్ – అభవన్.



**శ్లో॥ *పంచానామపి భూతానాముత్కర్షం పుపుషుర్గుణాః ।***

***నవే తస్మిన్ మహీపాలే సర్వం నవమివాభవత్ ॥ 4-11 రఘువంశమ్***

"ఆ రఘుమహారాజు సింహాసనమధిష్ఠింపగనే, .... అన్నియు నూతనము లయినట్లుండెను".

***అలంకారములు :-*** ఇందు 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును. 'స్వరూపయోగ్యే మనోహరమ్' వంటి విశేషణములతో విశేష్యమైన 'మేనాదేవి' పరిపుష్టినొందుటచే ఇట 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :-* కా. *'విశేషణైర్యత్సాకూతైరుక్తిః పరికరస్తు సః"***

అభిప్రాయగర్భితాలైన విశేషణాలను ఉపయోగించి విశేష్యంలో ఒక విధమైన వైశిష్ట్యాన్ని సూచించడం 'పరికరాలంకారము'. –బాలానందిని.



***అవతారికా :-*** పుత్రసంతానప్రాప్తిః. పుత్రోదయము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అసూత సా నాగవధూపభోగ్యం**

**<u>మైనాకమమ్భోనిధిబద్ధసఖ్యమ్</u> ।**

**క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రా**

**వవేదనాజ్ఞం కులిశక్షతానామ్ ॥ 20**

***పదవిభాగము :-*** అసూత, సా, నాగవధూపభోగ్యమ్, మైనాకమ్, అమ్భోనిధిబద్ధసఖ్యమ్, క్రుద్ధే, అపి, పక్షచ్ఛిది, వృత్రశత్రౌ, అవేదనాజ్ఞమ్, కులిశక్షతానామ్.

***అన్వయక్రమము :-*** సా, నాగవధూపభోగ్యమ్, అమ్భోనిధిబద్ధసఖ్యమ్, పక్షచ్ఛిది, వృత్రశత్రౌ, క్రుద్ధే, అపి, కులిశక్షతానామ్, అవేదనాజ్ఞమ్, మైనాకమ్, అసూత.

***ప్రతిపదార్థము :-*** సా = ఆ మేనాదేవి, నాగవధూపభోగ్యమ్ = నాగాంగనలకు అనుభవ యోగ్యుడును, అమ్భోనిధిబద్ధసఖ్యమ్ = సముద్రునితో కట్టబడిన చెలిమి గలవాడును, పక్షచ్ఛిది = ఱెక్కలను ఛేదించునట్టి, వృత్రశత్రౌ = ఇంద్రుడు, క్రుద్ధే + అపి = కోపగించినను, కులిశక్షతానామ్ = వజ్రాయుధము దెబ్బలయొక్క, అవేదనాజ్ఞమ్ = బాధనెఱుగనివాడును అగు, మైనాకమ్ = మైనాకుని, అసూత = కనెను.

***తాత్పర్యము :-*** ఆ మేనాదేవి, నాగాంగనలకు అనుభవయోగ్యుడును, సముద్రునితో కట్టబడిన చెలిమి గలవాడును, పర్వతపు ఱెక్కలను ఛేదించునట్టి ఇంద్రుడు కోపించినను వజ్రాయుధము దెబ్బలయొక్క బాధనెఱుగనివాడును అగు మైనాకుని కనెను.

***విభక్తులు / క్రియలు :-*** 1) అసూత – క్రియ. 2) సా – సా, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) నాగవధూపభోగ్యమ్ – **భోగ్యమ్,** భోగ్యౌ, భోగ్యాన్; అకారాన్త పుంలింగ 'భోగ్య' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 4) అమ్భోనిధిబద్ధసఖ్యమ్ – ...**సఖ్యమ్,** ...సఖ్యౌ, ...సఖ్యాన్; అకారాన్త

పుంలింగ 'సఖ్య' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) మైనాకమ్ – **మైనాకమ్,** మైనాకౌ, మైనాకాన్; అకారాన్త పుంలింగ 'మైనాక' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) క్రుద్ధే – **క్రుద్ధే,** క్రుద్ధయోః, క్రుద్ధేషు; అకారాన్త పుంలింగ 'క్రుద్ధ' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 7) అపి – అవ్యయము. 8) పక్షచ్ఛిది – **పక్షచ్ఛిది,** పక్షచ్ఛిదోః, పక్షచ్ఛిత్సు; దకారాన్త పుంలింగ పక్షచ్ఛిద్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) వృత్రశత్రౌ – **వృత్రశత్రౌ,** వృత్రశత్ర్వోః, వృత్రశత్రుషు; ఉకారాన్త పుంలింగ 'వృత్రశత్రు' శబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. 10) అవేదనాజ్ఞమ్ – **అవేదనాజ్ఞమ్,** అవేదనాజ్ఞౌ, అవేదనాజ్ఞాన్; అకారాన్త పుంలింగ 'అవేదనాజ్ఞ' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) కులిశక్షతనామ్ – కులిశక్షతస్య, కులిశక్షతయోః, **కులిశక్షతానామ్;** అకారాన్త నపుంసకలింగ 'క్షత' శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) నాగవధూపభోగ్యమ్ – నాగస్య వధూః (ష.త.) నాగవధూః; నాగవధ్వా ఉపభోగ్యః (ష.త.) తమ్.

2) అమ్భోనిధిబద్ధసఖ్యమ్ – అమ్భోనిధినా బద్ధం సఖ్యమ్ (బహువ్రీహి) యేన, తమ్.

3) పక్షచ్ఛిది – పక్షాత్ ఛిన్నత్తీతి (ఉపపదతత్పు.) పక్షచ్ఛిద్, తస్మిన్.

4) వృత్రశత్రౌ – వృత్రస్య శత్రుః (ష.త.) తస్మిన్.

5) కులిశక్షతానామ్ – కులిశస్య క్షతాని (ష.త.) కులిశక్షతాని, తేషామ్.

6) అవేదనాజ్ఞమ్ – వేదనాం జానాతీతి (ఉపపద తత్పు), వేదనాజ్ఞః, న వేదనాజ్ఞః, (నఞ్ తత్పురుష) తమ్।

***సంధులు:–***

1) క్రుద్ధే + అపి = క్రుద్ధేఽపి, పూర్వరూపసన్ధిః.

2) వృత్రశత్రౌ + అవేదనాజ్ఞమ్ = వృత్రశత్రావవేదనాజ్ఞమ్ – అవాన్తాదేశసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **మైనాకమ్ –** మేనకాయాం భవః, అణ్.

ఎ) *హిరణ్యనాభో మైనాకః సునాభశ్చ తదాత్మజః ।*

'మైనాకునకు అభిధానచిన్తామణి '3' నామములను పేర్కొన్నది.

బి) సర్వపర్వత పక్షచ్ఛేఽదేపి అయమచ్ఛిన్నపక్ష ఏవేతి మైనాకస్యోత్కర్షః ।

1) తా దృక్ పుత్త్రవత్వం హిమద్రేరితి సార్థకం మైనాకస్య వర్ణనమ్. (సంజీవనీవ్యాఖ్య)

శ్లో॥ పితా న జ్ఞాయతే యస్యా భ్రాతా యది న విద్యతే ।
నోపయచ్ఛేత తాం కన్యాం ధర్మలోపభయాత్సుధీః ॥

2) తాదృక్ పుత్త్రీ హిమవాన్ ఇతి సార్థకం మైనాకస్య వర్ణనమ్

శ్లో॥ యస్యాస్తు న భవేద్ భ్రాతా న విజ్ఞాయేత వా పితా
నోమయచ్ఛేత తాం ప్రాజ్ఞః పుత్త్రికా ధర్మశంకయా ॥ మనుస్మృతి 3–11

తాను వివాహం చేసికొనబోవు కన్యయొక్క తండ్రి/ లేక/ సోదరుల విషయం



తెలియనిచో ఆ స్త్రీ జ్ఞాతివంశానికి కూడ చెందియుంటుంది కావున సోదరి యను భావనతో ఆమెను వివాహం చేసికొనరాదు.

c) The son of Menaka (మేనకాయాం భవః అణ్) said in the Mahabharata to be situated north of Kailasa. According to some it stood in central India, and according to others between the southern extremity of the Indian Peninsula and Ceylon. When Mainaka saw India lopping off the wings of mountains, he fled to the sea for Protection which the lather readily granted, and so the two become friends. Indra's thunderbolt had no power over the waters of the sea. -Kale.

డి) శ్లో॥ ***సర్వేఽపి పర్వతాః పూర్వం పక్షవన్తః కిలాభవన్ ।
తతస్తేషామవస్థానైర్వేగైః పక్షసమీరణైః ॥***

శ్లో॥ ***చూర్ణీభూతాన్ జనపదానవలోక్యాథ వృత్రహా ।
క్రుద్ధః కులిశమాదాయ పక్షచ్ఛేదేన పర్వతాన్ ॥***

శ్లో॥ ***క్షణేన స్థావరీచక్రే మైనాకస్తరసా తతః ।
అమ్భోధిమతిగమ్భీరం మహాసత్త్వముపాశ్రితః ॥***

శ్లో॥ ***సముద్రసఖ్యాదద్యాపి తత్పత్రౌ నాహృతౌ ।***
ఇతి కథానేన శ్లోకేన దర్శితా । –'వివరణమ్' వాఖ్యా.

***క్రియాదర్శము :–* అసూత –** 1) షూఙ్ (సూ) ప్రాణిగర్భవిమోచనే (ప్రసవించుట) అదాదిప్రకరణమ్ (2). సకర్మకమ్, వేట్, ఆత్మనేపదీ. 'అనద్యతనభూతే లఙ్'

ప్రథమ పురుషరూపాలు :– **అసూత** – అసువాతామ్ – అసువత.

2) సూఙ్ (సూ) ప్రాణి ప్రసవే (ప్రసవించుట) దివాదిప్రకరణమ్ (4). సకర్మకమ్, వేట్, ఆత్మనేపదీ, అనద్యతనభూతే లఙ్.

ప్రథమపురుషరూపాలు :– అసూయత – అసూయేతామ్ – అసూయన్త.

3) ***గ్రహైస్తతఃపంచభిరుచ్చసంస్థితై–
రసూర్యగైస్సూచితభాగ్యసంపదమ్ ।
అసూత పుత్రం సమయే శచీసమా
త్రిసాధనాశక్తిరివార్థమక్షయమ్ ॥*** *– రఘువంశమ్, 3–13.*

1. ఉత్సాహ, 2.ప్రభు, 3.మంత్రశక్తులనెడు మూడు సాధనములు గల శక్తి, అక్షయమైన అర్థమును కలిగించునట్లు, ఆ తరువాత శచీదేవితో సమానురాలైన ఆ సుదక్షిణ ప్రసవసమయమున అయిదు గ్రహములు ఉచ్చస్థానమున నుండగ వాని చేత సూచింపబడిన

భాగ్యసంపదగల కుమారుని ప్రసవించెను. (పంచగ్రహముల ఉన్నతస్థితిని గూర్చి 'శిశు హితైషిణీ' వ్యాఖ్యను చూడగలరు.)

**అలంకారములు :–** 1) ఇందు 'పరికరాలంకారము' గలదు. 'నాగవధూపభోగ్యమ్, అమ్భోనిధిబద్ధసఖ్యమ్' విశేషణాలతో విశేష్యమైన 'మైనాకుని' పరిపుష్టిచేయబడుటచే నిట పరికరాలంకారము గలదు.

2) 'పక్షచ్ఛిది వృత్రశత్రౌ క్రుద్ధేఽపి' – ఇచట 'విశేషోక్తి' అలంకారమున్నదని చెప్పదగును.

**లక్షణము :–** *శ్లో॥ ఏకదేశస్య విగమే యా గుణాన్తరసంస్థితిః ।*
*విశేషప్రథనాయాసౌ విశేషోక్తిర్మతా యథా ॥*

కారణములోని ఒక భాగము లోపించినను, దాని యందు విశేషమును కూర్చుటకై మరియొక గుణము యొక్క స్థితి కల్గినట్లు వర్ణించుట **విశేషోక్తి.** (బాలానందిని)

'అన్వయము సరళము' 

**అవతారికా :–** పార్వత్యాః జన్మ – పార్వతీదేవి జన్మ.

**శ్లో॥ అథావమానేన పితుః ప్రయుక్తా**
**దక్షస్య కన్యా భవపూర్వపత్నీ ।**
**సతీ సతీ యోగవిసృష్టదేహా**
**తాం జన్మనే శైలవధూం ప్రపేదే ॥ 21**

**పదవిభాగము :–** అథ, అవమానేన, పితుః, ప్రయుక్తా, దక్షస్య, కన్యా, భవపూర్వపత్నీ, సతీ, సతీ, యోగవిసృష్టదేహా, తామ్, జన్మనే, శైలవధూమ్, ప్రపేదే.

**అన్వయక్రమము :–** అథ, దక్షస్య, కన్యా, భవపూర్వపత్నీ, సతీ, పితుః, అవమానేన, ప్రయుక్తా, యోగవిసృష్టదేహా, సతీ, జన్మనే, తామ్, శైలవధూమ్, ప్రపేదే.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, (మైనాక జననానన్తరం), దక్షస్య = దక్షప్రజాపతికి, కన్యా = కూతురైనట్టియు, భవపూర్వపత్నీ = శివునికి క్రిందటి జన్మలో భార్యయైనట్టియు, సతీ = పతివ్రతయగు ('సతీ సాధ్వీ పతివ్రతా' ఇత్యమరః), సతీ = సతీదేవి, పితుః = తండ్రియొక్క, అవమానేన = తిరస్కారముచేత, ప్రయుక్తా = ప్రేరితురాలై, యోగవిసృష్టదేహా = యోగమార్గముచే విడువబడిన శరీరము గలదై, జన్మనే = పుట్టుటకొఱకై, తామ్ = ఆ, శైలవధూమ్ = హిమవత్పత్నియగు మేనాదేవిని, ప్రపేదే = పొందెను.

**తాత్పర్యము :–** పిమ్మట, దక్షప్రజాపతికి కూతురైనట్టియు, గత జన్మలో శివునికి భార్యయైనట్టియు పతివ్రత యగు సతీదేవి, తన తండ్రి తన భర్తకు చేసిన తిరస్కారముచే



ప్రేరితురాలై, యోగమార్గముచే ఆ దేహమును విడచినదై, మఱల జన్మించుటకై ఆ మేనాదేవిని పొందెను.

**విభక్తులు / క్రియలు :–** 1) అథ – అవ్యయము. 2) అవమానేన – **అవమానేన,** అవమానాభ్యామ్, అవమానైః; అకారాన్త పుంలింగ (నపుంసక) 'అవమాన' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) పితుః – **పితుః**, పిత్రోః, పితౄణామ్; ఋకారాన్త పుంలింగ పితృ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) ప్రయుక్తా – **ప్రయుక్తా,** ప్రయుక్తే, ప్రయుక్తాః; ఆకారాన్త స్త్రీలింగ 'ప్రయుక్తా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) దక్షస్య – **దక్షస్య,** దక్షయోః, దక్షాణామ్; అకారాన్త పుంలింగ దక్ష శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 6) కన్యా – **కన్యా,** కన్యే, కన్యాః, ఆకారాన్త స్త్రీలింగ కన్యా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) భవపూర్వపత్నీ – **పత్నీ,** పత్న్యౌ, పత్న్యః; ఈకారాన్త స్త్రీలింగ పత్నీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) సతీ – **సతీ**, సత్యౌ, సత్యః; ఈకారాన్త స్త్రీలింగ సతీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) యోగవిసృష్టదేహా – **...దేహా,** ...దేహే, ...దేహాః; ఆకారాన్త స్త్రీలింగ 'యోగవిసృష్టదేహా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 10) తామ్ – **తామ్**, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) శైలవధూమ్ – **శైలవధూమ్**, శైలవధ్వౌ, శైలవధూః; ఊకారాన్త స్త్రీలింగ వధూ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) జన్మనే – **జన్మనే,** జన్మభ్యామ్, జన్మభ్యః; నకారాన్త నపుంసకలింగ జన్మన్ శబ్దము, చతుర్థీవిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) భవపూర్వపత్నీ – పూర్వా చాసౌ పత్నీ (కర్మధా.) పూర్వపత్నీ, భవస్య పూర్వపత్నీ (ష.త.).

2) యోగవిసృష్టదేహా – యోగేన విసృష్టః దేహః యయా (బహువ్రీహి) సా.

3) శైలవధూమ్ – శైలస్య వధూః (ష.త.) తామ్।

**సంధులు :–** 1) అథ + అవమానేన = అథావమానేన, సవర్ణదీర్ఘసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **అథ** – ఎ) అథ మఙ్గలానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యాధికారప్రతిజ్ఞాసముచ్చయ – వితర్కవికల్పేషు.

ఎ) మఙ్గలే – "అథ శబ్దానుశాసనమ్" (మహాభాష్యే ప్రారమ్భే),

బి) ఆనన్తర్యే – "అథ ప్రజానామధిపః ప్రభాతే ....ముమోచ। రఘువంశే 2–1,

సి) ఆరమ్భే – "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః" ఆప. ధర్మసూత్రే, 1–1–1,

డి) ప్రశ్నే – "అథ శక్నోషి భోక్తుమ్", "అథ దావసి పర్వతే".

ఇ) కార్త్స్న్యే – "అథ పరస్మైపదమ్" (పరస్మైపదాని కార్త్స్న్యేన ప్రతిపాద్యన్తే ఇత్యర్థః),

ఎఫ్) అధికారే – "అథ యోగానుశాసనమ్" (యో.సూ. 1–1),

జి) ప్రతిజ్ఞాయామ్ – గౌడో భవాన్ అథేతి బ్రూమః। (భవాన్ గౌడ ఇతి సప్రతిజ్ఞం బ్రూమ ఇత్యర్థః),

హెచ్) సముచ్చయే – 'దుర్యోధనోఽథ రాధేయః' మహాభారతే.

ఐ) వితర్కే – శబ్దోనిత్యః, అథానిత్యః।...

జె) **వికల్పే –** 'ఋతావుపేయాత్, 'అథానృతౌ పర్వవర్జమ్' –అవ్యయకోశః (17).

2. ఎ) ఇచట 'దక్షయజ్ఞగాథ' ను అనుసంధానము చేసుకొనదగును. (విష్ణుపురాణము 1–7, మత్స్యపురాణం 3–9, 6–12, 8 అధ్యాయములు)

*శ్లో॥ పురా కిల పురారాతావవమానం ప్రకాశయన్ ।*
*అనాహూయైవ తం దేవం దేవానన్యానుపానయత్ ॥*

*శ్లో॥ మోహాన్ధో యజ్ఞమారేభే దక్షో దాక్షాయణీ తదా ।*
*అనాహూతా స్వపిత్రాపి ప్రతిషిద్ధాపి శమ్భునా ॥*

*శ్లో॥ జగామ స్వపితుర్గేహం యజ్ఞదర్శనలాలసా ।*
*అనాదృతాపి పిత్రా సా దృష్ట్వా చ సకలాః క్రియాః ॥*

*శ్లో॥ రుద్రభాగవినిర్ముక్తా కోపేనాపాటలేక్షణా ।*
*తత్యాజ యోగమాస్థాయ దక్షేణోత్పాదితం వపుః ॥*

*ఇతి శ్రీ భాగవతాది ప్రసిద్ధాయాః కథాయాః సంక్షేపః ॥*

**–'వివరణమ్' వ్యాఖ్యా.**

**క్రియాదర్శము :–** ప్రపేదే – ఎ) పద (పద్) గతౌ (నడుచుట, వెళ్ళుట) దివాదిప్రకరణమ్ (4), సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, భూతానద్యతనపరోక్షే లిట్. ప్ర–ఉపసర్గ. ప్రథమపురుష లిట్ రూపాలు – **ప్రపేదే** – ప్రపేదాతే – ప్రపేదిరే.

బి) పద (పద్) గతౌ (వెళ్ళుట), చురాది ప్రకరణమ్ (10). సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లిట్ ప్రథమపురుషరూపాలు –

పదయాఞ్చక్రే – పదయాఞ్చక్రాతే – పదయాఞ్చక్రిరే.

సి) *శ్లో॥ తమధ్వరే విశ్వజితి క్షితీశం*
*నిశ్శేషవిశ్రాణితకోశజాతమ్ ।*
*ఉపాత్తవిద్యో గురుదక్షిణార్థీ*
*కౌత్సః ప్రపేదే వరతన్తుశిష్యః ॥* –రఘువంశమ్ 5–1.

"....రఘుమహారాజు వద్దకు కౌత్సుడు ధనమును కోరి వచ్చెను. 

**శ్లో॥ సా భూధరాణామధిపేన తస్యాం**
**సమాధిమత్యాముదపాది భవ్యా ।**
**సమ్యక్ప్రయోగాదపరిక్షతాయాం**
**నీతావివోత్సాహగుణేన సమ్పత్(ద్) ॥ 22**



**పదవిభాగము :–** సా, భూధరాణామ్, అధిపేన, తస్యామ్, సమాధిమత్యామ్, ఉదపాది, భవ్యా, సమ్యక్, ప్రయోగాత్, అపరిక్షతాయామ్, నీతౌ, ఇవ, ఉత్సాహగుణేన, సమ్పత్।

**అన్వయక్రమము :–** భవ్యా, సా, భూధరాణామ్, అధిపేన, సమాధిమత్యామ్, తస్యామ్, సమ్యక్, ప్రయోగాత్, అపరిక్షతాయామ్, నీతౌ, ఉత్సాహగుణేన, సమ్పద్, ఇవ, ఉదపాది.

**ప్రతిపదార్థము :–** భవ్యా = కళ్యాణియగు, సా = ఆ సతీదేవి, భూధరాణామధిపేన = పర్వతములకు ప్రభువైన హిమవంతునిచే, సమాధిమత్యామ్ = నియమముగలదైన, తస్యామ్ = ఆ మేనాదేవి యందు, సమ్యక్ ప్రయోగాత్ = లెస్సగా ఆచరించుట వలన, అపరిక్షతాయామ్ = చెడిపోని, నీతౌ = నీతియందు, ఉత్సాహగుణేన = ఉత్సాహశక్తి చేత, సమ్పద్(త్)ఇవ = సంపదవలె, ఉదపాది = జననమొందింపబడెను.

**తాత్పర్యము :–** శుభప్రదమగు ఆ సతీదేవి పర్వతములకు ప్రభువైన హిమవంతునిచే నియమముగలదైన ఆ మేనాదేవి యందు లెస్సగా ఆచరించుట వలన చెడిపోని నీతి యందు ఉత్సాహశక్తిచేత సంపదవలె జననమొందింపబడెను.

**విభక్తులు / క్రియలు :–** 1) భవ్యా – **భవ్యా,** భవ్యే, భవ్యాః; ఆకారాన్త స్త్రీలింగ భవ్యా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) భూదరాణామ్ – భూధరస్య, భూధరయోః, **భూధరాణామ్;** అకారన్త పుంలింగ భూధర శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) అధిపేన – **అధిపేన,** అధిపాభ్యామ్, అధిపైః; అకారాన్త పుంలింగ అధిప శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 5) తస్యామ్ – **తస్యామ్,** తయోః, తాసు; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. 6) సమాధిమత్యామ్ – **సమాధిమత్యామ్,** సమాధిమత్యోః, సమాధిమతిషు; ఇకారాన్త స్త్రీలింగ మతి శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 7) ఉదపాది – క్రియ. 8) సమ్యక్ప్రయోగాత్ – **సమ్యక్ప్రయోగాత్,** సమ్యక్ప్రయోగాభ్యామ్ సమ్యక్ప్రయోగేభ్యః; ఆకారాన్త పుంలింగ సమ్యక్ప్రయోగ శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 9) అపరిక్షతాయామ్ – **అపరిక్షతాయామ్,** అపరిక్షతాయోః, అపరిక్షతాసు; ఆకారాన్త స్త్రీలింగ అపరిక్షతా శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 10) నీతౌ – **నీతౌ** (నీత్యామ్), నీత్యోః, నీతిషు; ఇకారాన్త స్త్రీలింగ నీతి శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) ఇవ – అవ్యయము. 12) ఉత్సాహగుణేన – **ఉత్సాహగుణేన,** ఉత్సాహగుణాభ్యామ్, ఉత్సాహగుణైః, అకారాన్త పుంలింగ ఉత్సాహగుణ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 13) సంపత్(ద్) – సంపత్(ద్), సంపదౌ, సంపతః(దః), త/దకారాన్త స్త్రీలింగ సంపత్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) భూధరాణామ్ – భువః ధరాః (ష.త.) భూధరాః, తేషామ్.
2) సమ్యక్ప్రయోగాత్ – సమ్యక్ చాసౌ ప్రయోగశ్చ (కర్మధా.) తస్మాత్.
3) అపరిక్షతాయామ్ – న పరిక్షతా (నఞ్తత్పు.) అపరిక్షతా, తస్యామ్.
4) ఉత్సాహగుణేన – ఉత్సాహః ఏవ గుణః (కర్మధా.) తేన.

**సంధులు :–**

1) నీతౌ + ఇవ = నీతావివ, అవాన్తాదేశసన్ధిః
2) ఇవ + ఉత్సాహగుణేన = ఇవోత్సాహగుణేన, గుణసన్ధిః.

3) సమ్యక్ప్రయోగాత్ + అపరిక్షతాయామ్ = సమ్యక్ప్రయోగాదపరిక్షతాయామ్, జశ్త్వసన్ధిః. **ఝలాం జశోఽన్తే** (సూ. 8-2-39).

***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.***

1. **ఉత్సాహగుణేన** - ఉత్సాహః ఏవ గుణః తేన.

ఎ) ***....శక్తయస్తిస్రః ప్రభుత్వాత్సాహమంత్రజాః ॥ 399. అభిధానచిన్తామణి.***

1.ప్రభుశక్తి, 2.ఉత్సాహశక్తి, 3.మంత్రశక్తి, అనునవి మూడు శక్తులు.

ప్రభుశక్తి - బొక్కసము, న్యాయము, దండనము లలో చక్కని నిర్వహణ.

ఉత్సాహశక్తి - శక్తిసామర్థ్యాన్ని కల్గి ఉండటం. శౌర్యము, ప్రయత్నశీలుడై ఉండుట. కామందకీయ నీతిశాస్త్రం (14వ అధ్యాయము) ఈ విషయాన్ని కూలంకషంగా చర్చించింది గనుక వానిని ఇచట అనుసంధానము చేసుకొనదగును.

మంత్రశక్తి - పంచ అంగాలపైన చక్కని అజమాయిషీ / అదుపు కల్గియుండుట.

ఎ) సహాయము, బి) సాధన, సి) ఉపాయము, డి) దేశ కాలాలకు తగినట్లు విభాజన మరియు ఇ) సహజవిపత్తులు - అరాచకాలపై తగిన చర్యలు చేపట్టుట జాగరూకత.

బి) రఘువంశమ్ 17-59, శ్లోకభాగమును, మనువు చెప్పనదీ ఈ సందర్భమున అనుసంధానము చేసికొనదగును.

*శ్లో॥ పరాత్మనో పరిచ్ఛిద్య శక్త్యాదీనాం బలాబలమ్ ।*
*యయా వేభిర్బలిష్ఠశ్చేత్పరస్మాదాస్త సోఽన్యథా ॥*

తన యొక్కయు, శత్రువు యొక్కయు శక్తి, దేశము, కాలము, మొదలగువాని యొక్క బలాబలములను, సంతోషమును బాగుగా నిర్ణయించుకొనిన, ఆ బలశక్త్యాది విషయము నందు, శత్రువు తనకంటె బలహీనుడైనపుడే అతని మీదికి అతిధి మహారాజు దండెత్తి పోయెడివాడు. ఆ శత్రువు తనకంటె బలిష్ఠుడైనచో యుద్ధమునకు పోక నిలిచిపోయెడివాడు.

*శ్లో॥ యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్ ।*
*పరస్య విపరీతంచేత్తదా యయాదరీన్ ప్రతి ॥*
*యుదా తు స్యాత్ పరిక్షీణో వాహనేన బలేన చ ।*
*తదాసీత ప్రయత్నేన శనకైః సాంత్వయన్నరీన్ ॥ (మనుః)*

మనువు చెప్పిన ఈ విషయాన్ని అతిధిమహారాజు ఆచరించి చూపినాడు.

***క్రియాదర్శము :-*** **ఉదపాతి -** 1) ఉత్ - ఉపసర్గ, పద (గతౌ), ఉపసర్గ చేరికతో 'జననమొందుట' అను అర్థమేర్పడును. దివాదిప్రకరణమ్ (4). సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. భూతేలుఙ్. 2) ఉదపాద్యుత్పాదితా ఉత్పద్యన్తేర్ణ్యన్తామ్ కర్మణి లుఙ్ 'చిణ్ భావకర్మణోః' ఇతి చిణ్ప్రత్యయః 'చిణో లుక్' ఇతి తస్య లుక్. 3) ప్రథమపురుషరూపాలు-



ఉత్ + అపాది, ఉత్ + అపత్యాతామ్, ఉత్ + అపత్స్యత. ఉదపాది - ఉదపత్యాతామ్ - ఉదపత్యత.

*'ఉత్పత్తిశ్చాత్ర నిత్యాయా దేవ్యా దేవకార్యార్థమ్ । తదుక్తం దేవీమాహాత్మ్యే" - "దేవానాం కార్యసిద్ధ్యర్థమావిర్భవతి సా యదా । ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాప్యభిధీయతే।"*

-ఇతి 'వివరణమ్' వ్యాఖ్యా

***అలంకారములు :-*** ఇట 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

'నీతావివోత్సాహగుణేన సమ్పత్' - మేనాదేవి, హిమవంతుడు, పార్వతీదేవి. ఇందు ఉపమానంతో ఉపమేయమునకు ఒక చిన్న గుణమును బట్టి ఏర్పడిన సామ్యము ఉండుటచే ఉపమాలంకారము. ఇచట వాచక శబ్దము 'ఇవ'

***లక్షణము :-*** ***'విరుద్ధేనోపమానేన దేశకాలక్రియాదిభిః ।***
***ఉపమేయస్య యత్సామ్యం గుణలేశేన సోపమా ॥***
***యథేవ శబ్దౌ సాదృశ్యమాహతుర్వ్యతిరేకిణోః*** - *కావ్యాలంకారః 2-30,31*



**శ్లో॥ ప్రసన్నదిక్పాంసువివిక్తవాతం**
**శంఖస్వనానన్తరపుష్పవృష్టి ।**
**శరీరిణాం స్థావరజఙ్గమానాం**
**సుఖాయ తజ్జన్మదినం బభూవ ॥ 23**

***పదవిభాగము :-*** ప్రసన్నదిక్ పాంసువివిక్తవాతమ్, శంఖస్వనానన్తరపుష్పవృష్టి, శరీరిణామ్, స్థావరజఙ్గమానామ్, సుఖాయ, తత్‌జన్మదినమ్, బభూవ.

***అన్వయక్రమము :-*** ప్రసన్నదిక్, పాంసువివిక్తవాతమ్, శంఖ.....వృష్టి, తజ్జన్మదినమ్, స్థావరజఙ్గమానామ్, శరీరిణామ్, సుఖాయ, బభూవ.

***ప్రతిపదార్థము :-*** ప్రసన్నదిక్ = నిర్మలములగు దిక్కులు గలదియు, పాంసువివిక్తవాతమ్ = పరాగముచే (ధూళిచే) రిక్తమైన గాలి కలదియు, శంఖస్వనానన్తరపుష్పవృష్టి = శంఖము యొక్క ధ్వనికంటే తర్వాతిదైన పుష్పవర్షము గలదియునగు, తజ్జన్మదినమ్ = ఆ పార్వతీదేవి యొక్క జననదినము, స్థావరజఙ్గమానామ్ = చరాచరములను అగు, శరీరిణామ్ = ప్రాణులకు, సుఖాయ = ఆనందం కొఱకు, బభూవ = ఆయెను.

***తాత్పర్యము :-*** నిర్మలములగు దిక్కులు గలదియు. ధూళిచే శూన్యమగు గాలి కలదియు, శంఖధ్వనికి తర్వాతిదైన పుష్పవర్షము గలదియునగు ఆ పార్వతీదేవి యొక్క జననదినము చరాచరప్రాణులకు ఆనందకరమాయెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) ప్రసన్నదిక్ – **ప్రసన్నదిక్,** ప్రసన్నదిశీ, ప్రసన్నదింశి; శకారాన్త నపుంసక ప్రసన్నదిక్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) పాంసువివిక్తవాతమ్ – **...వాతమ్,** ...వాతే, ...వాతాని; అకారాన్త నపుంసకలింగ పాంసువివిక్తవాత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) శంఖ....వృష్టి – **శంఖ**...వృష్టి, శంఖ...వృష్టిణీ, శంఖ...వృష్టీణి; ఇకారాన్త నపుంసకలింగ శంఖ...వృష్టి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) శరీరిణామ్ – శరీరిణః, శరీరిణోః, **శరీరిణామ్;** నకారాన్త పుంలింగ శరీరిన్ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 5) స్థావరజంగమానామ్ – స్థావరజంగమస్య, స్థావరజంగమయోః, **స్థావరజంగమానామ్**, అకారాన్త పుంలింగ స్థావరజంగమ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 6) సుఖాయ – **సుఖాయ,** సుఖాభ్యామ్, సుఖేభ్యః; అకారాన్త నపుంసకలింగ సుఖశబ్దము, చతుర్థీవిభక్తి ఏకవచనము. 7) తజ్జన్మదినమ్ – **తజ్జన్మదినమ్,** తజ్జన్మదినే, తజ్జన్మదినాని; అకారాన్త నపుంసకలింగ తజ్జన్మదిన శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) బభూవ – క్రియ.

***సమాసాలు :–***

1) ప్రసన్నదిక్ – ప్రసన్నాః దిశః యస్మిన్ (బహువ్రీహి) తత్।
2) పాంసువివిక్తవాతమ్ – పాంసుభిః వివిక్తః వాతః యస్మిన్ (బహువ్రీహి) తత్.
3) శంఖస్వనానన్తరపుష్పవృష్టి – శంఖస్య స్వనః (ష.త.) శంఖస్వనః, శంఖస్వనాద్ అనన్తరమ్ (ష.త.) శంఖస్వనానన్తరమ్ పుష్పవృష్టిః యస్మిన్ (బహువ్రీహి) తత్.
4) తజ్జన్మదినమ్ – జన్మనః దినమ్ (ష.త.) జన్మదినమ్; తస్యాః జన్మదినమ్ (ష.త.) తత్, తజ్జన్మదినమ్.
5) స్థావరజంగమానామ్ – స్థావరాశ్చ జంగమాశ్చ (ద్వంద్వ) తేషామ్.

***సంధులు :–***

1) తత్ + జన్మదినమ్ = తజ్జన్మదినమ్ – శ్చుత్వసన్ధిః. **స్తోః శ్చునా శ్చుః** (సూ. 8–4–39). సకారతవర్గములకు శకారచవర్గములతో కలయిక ఏర్పడినప్పుడు శకారచవర్గములు వచ్చును.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. శంఖస్వనానన్తరపుష్పవృష్టి – ఎ) హర్షుని 'నాగానందము' 4వ అంకాంతమున గరుడుడు జీమూతవాహనుణ్ణి తీసుకువెళ్ళు సందర్భాన్ని ఇచట అనుసంధానము చేసుకొనదగును.

గరుడః – ...అయే పుష్పవృష్టిర్దున్దుభిధ్వనిశ్చ। ఆమోదానన్దితాలిర్నిపతతి కిమియం పుష్పవృష్టిర్నభస్తః స్వర్గే కిం చైష చక్రం ముఖరయతి దిశాం దుందుభీనాం నినాదః।...

Oh a shower of flowers and drum sound! why does this shower of flowers that delights the bees with its fragrance fall from sky? And why this sound of drums in the sky make the wheel of the quarters resound?

- Ban-Kun-Bae.

ఈ వైవిధ్యాన్ని గమనించండి. 1) శంఖస్వనాన్తరపుష్పవృష్టి।
2) పుష్పవృష్టిర్దున్దుభిధ్వనిశ్చ।



2. **రఘుమహారాజు జననము** – రఘువంశమ్ 3–19.

***శ్లో॥ సుఖశ్రవా మంగళతూర్యనిస్స్వనాః***
***ప్రమోదనృత్తైస్సహ వారయోషితామ్ ।***
***న కేవలం సద్మని మాగధీపతేః***
***పథి వ్యజృంభంత దివౌకసామపి ॥***

వీనుల విందైన, మంగళసూచనములైన మంగళవాద్యధ్వనులు...దిలీపమహారాజు యింటినందు మాత్రమే కాక, దేవతల మార్గమైన ఆకాశమునందు కూడ చెలరేగినది. (దివ్యాంశసంభూతుడు కనుకను ఆనందసూచకంగా దేవదుందుభులు కూడ మ్రోగినవని భావము)

3. **శ్రీరామజననము** – రఘువంశమ్ 10–76, 77.

***శ్లో॥ పుత్రజన్మ ప్రవేశ్యానాం తూర్యాణాం తస్య పుత్రిణః***
***ఆరమ్భం ప్రథమం చక్రుః దేవదున్దుభయో దివి ॥ 76***

.....పుత్రోత్సవమునందు మంగళవాద్యములనుపయోగించు ఏర్పాటు నందు, ముందుగా స్వర్గము నుండి దేవతలు దేవదుందుభులు మ్రోగించిరి. తరువాత అయోధ్యా నగరము నందలి మంగళవాద్యములు మ్రోగినవి. (శ్రీరామాదుల అవతారము వలన భూలోకము, స్వర్గలోకము ఆనందపరవశములైనవని భావం)

***శ్లో॥ సన్తానకమయీ వృష్టిర్భవనే తస్య పేతుషీ ।***
***సన్మఙ్గళోపచారాణాం సై వాదిరచనాభవత్ ॥ 77.***

.....పుత్రజన్మోత్సవమునందు మంగళోపచారములను సేవకులారంభించుటకంటె ముందుగ పూలవాన కురిసి, అదే మొట్టమొదటి ఉపచారమైనది. (శ్రీరామావతారము – మానవులకంటె ముందే దేవతల నానందపఱచినదని భావము.)

***క్రియాదర్శము :–*** **బభూవ** – 1) భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1). భూతానద్యతనపరోక్షే లిట్.

ప్రథమపురుషరూపాలు – **బభూవ** – బభూవతుః – బభూవుః.

***అలంకారములు :–*** ఇందు 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును.

'ప్రసన్నదిక్, పాంసువివిక్తవాతమ్, శంఖస్వనానన్తరపుష్పవృష్టి' వంటి అభిప్రాయ గర్భవిశేషణాలతో, విశేష్యమగు పార్వతీదేవి జనన దినము పరిపుష్టి చేయబడుటచే ఇది 'పరికరాలంకార'మగును.



**శ్లో॥ తయా దుహిత్రా సుతరాం చకాసే**
**స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ ।**
**విదూరభూమిర్నవమేఘశబ్దా**
**దుద్భిన్నయా రత్నశలాకయేవ ॥ 24**

**పదవిభాగము :–** తయా, దుహిత్రా, సుతరామ్, చకాసే, స్ఫురత్ప్రభామణ్డలయా, సవిత్రీ, విదూరభూమిః, నవమేఘశబ్దాత్, ఉద్భిన్నయా, రత్నశలాకయా, ఇవ.

**అన్వయక్రమము :–** స్ఫురత్ప్రభామణ్డలయా, తయా, దుహిత్రా, సవిత్రీ, విదూరభూమిః, నవమేఘశబ్దాత్, ఉద్భిన్నతయా, రత్నశలాకయా, ఇవ, సుతరామ్, చకాసే.

**ప్రతిపదార్థము :–** స్ఫురత్–ప్రభామణ్డలయా = ప్రకాశించుచున్న కాంతమండలముగల, తయాదుహిత్రా = ఆ కూతురి చేత, సవిత్రీ = తల్లి, విదూరభూమిః = విదూర పర్వత ప్రాంత భూమి, నవమేఘశబ్దాత్ = తొలకరి మేఘముల ఉఱుమువలన, ఉద్భిన్నతయా = మెలచిన, రత్నశలాకయా ఇవ = రత్నమొలక చేతను వలె, సుతరామ్ = మిక్కిలి, చకాసే = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** ప్రకాశించుచున్న కాంతిమండలము గల ఆ కూతురిచేత, తల్లియగు మేనాదేవి, విదూర పర్వతప్రాంత భూమి తొలకరి మేఘముల ఉఱుము వలన మొలచిన రత్నపు మొలకచేతను వలె, మిక్కిలి ప్రకాశించెను.

**విభక్తులు / క్రియలు :–** 1) స్ఫురత్ప్రభామణ్డలయా – **స్ఫురత్ప్రభామణ్డలయా,** ...మణ్డలాభ్యామ్, ...మణ్డలాభిః; ఆకారాన్త స్త్రీలింగ స్ఫురత్ప్రభామణ్డలయా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 2) తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) దుహిత్రా – **దుహిత్రా,** దుహితృభ్యామ్, దుహితృభిః; ఋకారాన్త స్త్రీలింగ దుహితృ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 4) సుతరామ్ – అవ్యయము. 5) చకాసే – క్రియ. 6) సవిత్రీ – **సవిత్రీ,** సవిత్ర్యౌ, సవిత్ర్యః; ఈకారాన్త స్త్రీలింగ సవిత్రీ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 7) విదూరభూమిః – **విదూరభూమిః,** విదూరభూమీ, విదూరభూమయః; ఇకారాన్త స్త్రీలింగ విదూరభూమి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) నవమేఘశబ్దాత్ – **శబ్దాత్,** శబ్దాభ్యామ్, శబ్దేభ్యః; అకారాన్త పుంలింగ నవమేఘశబ్ద శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 9) ఉద్భిన్నయా – **ఉద్భిన్నయా,** ఉద్భిన్నాభ్యామ్, ఉద్భిన్నాభిః; ఆకారాన్త స్త్రీలింగ ఉద్భిన్నా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 10) రత్నశలాకయా – **రత్నశలాకయా,** రత్నశలాకాభ్యామ్, రత్నశలాకాభిః; ఆకారాన్త స్త్రీలింగ రత్నశలాకా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) స్ఫురత్ప్రభామణ్డలయా – ప్రభాణాం మణ్డలమ్ (ష.త.) ప్రభామణ్డలమ్, స్ఫురత్ ప్రభామణ్డలమ్ యస్యాః (బహువ్రీహి) తయా.
2) విదూరభూమిః – విదూరస్య భూమిః (ష.త.).
3) నవమేఘశబ్దాత్ – మేఘస్య శబ్దః (ష.త.) మేఘశబ్దః, నవశ్చాసౌ మేఘ శబ్దః (కర్మధా.) నవమేఘశబ్దః, తస్మాత్.
4) రత్నశలాకయా – రత్నస్య శలాకా (ష.త.) రత్నశలాకా తయా.



***సంధులు :–***

1) విదూరభూమిః + నవమేఘశబ్దాత్ = విదూరభూమిర్నవమేఘశబ్దాత్, విసర్గసంధిః.
2) శబ్దాత్ + ఉద్భిన్నయా = శబ్దాదుద్భిన్నయా, జశ్త్వసన్ధిః

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **స్ఫురత్ప్రభామణ్డలయా –**

మహాకవి శ్రీకాలిదాసవిరచిత రఘువంశమహాకావ్యములో 5–51 మరియు 14–14, 3–60, 3–14, శ్లోక భాగాల్ని పరిశీలించండి.

*శ్లో॥ ....స్ఫురత్ప్రభామణ్డలమధ్యవర్తి*
*కాంతం వపుర్వ్యోమచరం ప్రపేదే ॥ 5–51*

మదగజ శాపవిమోచన సందర్భమున ....ఆ గజము తేజోరాశిమధ్య నుండి ఆకాశగమనసామర్థ్యముకల దివ్యసుందరరూపమును ధరించెను.

*శ్లో॥ స్ఫురత్ప్రభామణ్డలమనుసూయం*
*సా బిభ్రతీ శాశ్వతమఙ్గరాగమ్ ।*
*రరాజ శుద్ధేతి పునః స్వవపుర్యై*
*సన్దర్శితా వహ్నిగతేన భర్త్రా ॥ 14–14.*

*శ్లో॥ స చాపముత్సృజ్య వివృద్ధమత్సరః*
*ప్రణశనాయ ప్రబలస్య విద్విషః ।*
*మహీధ్రపక్ష వ్యపరోపణోచితం*
*స్ఫురత్ప్రభామణ్డలమస్త్రమాదదే ॥ 3–60.*

.....మిఱుమిట్లు గొలుపు కాంతి పుంజము కలదియగు వజ్రాయుధమును చేపట్టెను.

2) ఈ శ్లోకానికి సాదృశ్యమున్న దిగువ శ్లోకమును పరిశీలించగలరు.

*శ్లో॥ దిశః ప్రసేదుః మరుతో వవుః సుఖాః*
*ప్రదక్షిణార్చిః హవిరగ్నిరాదదే ।*
*బభూవ సర్వం శుభశంసి తత్క్షణం*
*భవో హి లోకాభ్యుదయాయ తాదృశామ్ ॥ రఘువంశమ్ 3–14.*

రఘుమహారాజు జన్మించిన సమయమునందు దిక్కులు నిర్మలములైనవి. స్పర్శసుఖము కలిగించునట్లుగా గాలులు నెమ్మదిగా వీచినవి. అగ్నిహోత్రుడు తన కుండమునందు ప్రదక్షిణముగ తిరుగుచున్న జ్వాలలు కలవాడై ఆహుతులను స్వీకరించెను. ప్రకృతియంతయు మంగళమునే సూచించినది. అట్టివారి ఉద్భవము లోకములకు అభ్యుదయమును కలిగించుటకే కదా!

3. **విదూరభూమిః** – విదూరస్య అద్రేః భూమిః

ఎ) Vidhura is a mountain from which the jewel "వైదూర్య" is obtained. It is believed that these jewels spring out of that mountain region at the thunder of the clouds. -R.D.Karmarkar.

బి) విదూరో నామ పర్వతః। మేఘశబ్దాత్ వైదూర్యముత్పద్యత ఇతి ప్రసిద్ధమ్। యథాహ మాఘకవిః – 'ప్రకాశికా'వ్యాఖ్యా.

***శ్లో॥ ఉరగేన్ద్రమూర్ధరుహరత్నసన్నిధేర్ముహురున్నతస్య రసితైః పయోముచః।***
***అభవన్ యదఙ్గణభువః సముల్లసన్నవబాలవాయజమణి స్థలాఙ్కురాః॥***

*మాఘమ్ 13-58.*

సి) విదూరభూమిః విదూరో నామ రత్నోద్భవస్థానభూతః పర్వతవిశేషః యదుద్భూతం రత్నం వైదూర్యమిత్యుచ్యతే। ఘనగర్జితాద్ ఉద్భిన్నయా స్థలీం బిత్త్వోద్గతయా రత్నశలాకయా శలాకారూపేణ రత్నాంకురేణేత్యర్థః। విదూరభూమేర్మేఘశబ్దాద్ వైదూర్యోత్పత్తిః। యదాహ బోజః –

*శ్లో॥ అస్తి శైలో విదూరాఖ్యః పర్యన్తే తత్ర కాచన।*
*మహీ రత్నకారీభూతా వైదూర్యం తత్రజాయతే॥*
*శ్లో॥ మేఘశబ్దేన జాయన్తే తత్ర రత్ననవాంకురాః।*
*క్రమాత్ పరిణతాస్తే స్యుర్మణయో రాజపూజితాః॥* అని 'వివరణమ్'వ్యాఖ్య.

***క్రియాదర్శము :–*** **చకాసే** – ఎ) కాశృ (దీప్తౌ) ప్రకాశించుట, దివాదిప్రకరణమ్ (4), భ్వాదిప్రకరణమ్ (1) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ. లిట్ ప్రథమపురుషరూపాలు – **చకాసే** – చకాసాతే – చకాసిరే.

***అలంకారములు :–*** ఇట 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :–*** ***"యథాకథంచిత్సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే।***
***'ఉపమా'నామ సా తస్యాః ప్రపంచేయం నిదర్శ్యతే॥***

***–కావ్యదర్శః 2-14.***

విదూరభూమి నుండి ఉద్భవించిన రత్నశలాకము సుశోభితమైనట్లు మేనాదేవి గర్భము నుండి జనించిన పార్వతీదేవి సుశోభితమైనదని వర్ణించుటనే ఇట 'ఉపమాలంకార' మున్నదని చెప్పదగును. 

***అవతారికా :–*** పార్వత్యాః బాల్యమ్ – పార్వతీదేవి బాల్యము.

**శ్లో॥ దినే దినే సా పరివర్ధమానా**
**లబ్ధోదయా చాన్ద్రమసీవ లేఖా।**



**పుపోష లావణ్యమయాన్విశేషాన్**
**జ్యోత్స్నాన్తరాణీవ కలాన్తరాణి॥ 25**

***పదవిభాగము :–*** దినే దినే, సా, పరివర్ధమానా, లబ్ధోదయా, చాన్ద్రమసీ, ఇవ, లేఖా, పుపోష, లావణ్యమయాన్, విశేషాన్, జ్యోత్స్నాన్తరాణి, ఇవ, కలాన్తరాణి.

***అన్వయక్రమము :–*** లబ్ధోదయా, దినే దినే, పరివర్ధమానా, సా, చాన్ద్రమసీ, లేఖా+ఇవ, లావణ్యమయాన్, విశేషాన్, జ్యోత్స్నాన్తరాణి, కలాన్తరాణీవ, పుపోష.

***ప్రతిపదార్థము :–*** లబ్ధోదయా = పొందబడిన పుట్టుక కలదై, దినే దినే = ప్రతి దినము, పరివర్ధమానా = ఎదుగుచున్నదై, సా = ఆ బాలిక, చాన్ద్రమసీ = చంద్రునిదైన, లేఖా ఇవ = రేఖవలె, లావణ్యమయాన్ = కాంతివిశేషమయములగు, విశేషాన్ = అవయవములను, జ్యోత్స్నాన్తరాణి = జ్యోత్స్నామయములైన, కలాన్తరాణీవ = వేఱు కళలను బోలె, పుపోష = పెంచెను.

***తాత్పర్యము :–*** పొందబడిన పుట్టుక కలదై, దినదిన ప్రవర్ధమానమైన ఆ బాలిక, చంద్రరేఖవలె కాంతివిశేషమయములగు అవయవములను జ్యోత్స్నామయములైన వేఱు కలలను బోలి పెంచెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) దినేదినే – **దినేదినే**, దినేదినయోః, దినేషుదినేషు; ద్విరుక్తదిన శబ్దము, అకారాన్త నపుంసకలింగము, సప్తమీవిభక్తి ఏకవచనము. 'నిత్యవీప్సయోః' ఇతి వీప్సాయాం ద్విరుక్తిః. 2) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) పరివర్ధమానా – **పరివర్ధమానా,** పరివర్ధమానే, పరివర్ధమానాః; ఆకారాన్త స్త్రీలింగ పరివర్ధమానా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) లబ్ధోదయా – **లబ్ధోదయా,** లబ్ధోదయే, లబ్ధోదయాః; ఆకారాన్త స్త్రీలింగ లబ్ధోదయా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) చాన్ద్రమసీ – **చాన్ద్రమసీ,** చాన్ద్రమస్యౌ, చాన్ద్రమస్యః; ఈకారాన్త స్త్రీలింగ చాన్ద్రమసీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6) ఇవ – అవ్యయము. 7) లేఖా – **లేఖా,** లేఖే, లేఖాః; ఆకారాన్త స్త్రీలింగ లేఖా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) పుపోష – క్రియ. 9) లావణ్యమయాన్ – లావణ్యమయమ్, లావణ్యమయౌ, **లావణ్యమయాన్;** అకారాన్త పుంలింగ 'లావణ్యమయ' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 10) విశేషాన్ – విశేషమ్, విశేషౌ, **విశేషాన్;** అకారాన్త పుంలింగ విశేష శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 11) జ్యోత్స్నాన్తరాణి – జ్యోత్స్నాన్తరామ్, జ్యోత్స్నాన్తరే, **జ్యోత్స్నాన్తరాణి;** అకారాన్త నపుంసకలింగ 'జ్యోత్స్నాన్తర' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 12) కలాన్తరాణి – కలాన్తరమ్, కలాన్తరే, **కలాన్తరాణి;** అకారాన్త నపుంసకలింగ 'కలాన్తర' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) లబ్ధోదయా – లబ్ధః ఉదయః యయా (బహువ్రీహి) సా।
2) జ్యోత్స్నాన్తరాణి – జ్యోత్స్నాయాం అన్తరమ్, యేషామ్ (బహువ్రీహి) తాని.
3) కాలంతరాణి – అన్యాః కలాః (మయూరవ్యంసకాది లేదా సుప్సుపా సమాసము) కలాన్తరమ్, తాని.

**సంధులు :–**

1) లబ్ద + ఉదయా = లబ్ధోదయా, గుణసన్ధిః. 2) చాన్ద్రమసీ + ఇవ = చాన్ద్రమసీవ, సవర్ణదీర్ఘసన్ధిః. 3) జ్యోత్స్నాన్తరాణి + ఇవ = జ్యోత్స్నాన్తరాణీవ, సవర్ణదీర్ఘసన్ధిః.

**పాఠాంతరాలు :–** పుపోష – పుషోష

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. ఎ) ఈ శ్లోకభావానికి తుల్యమైన భావాన్ని రఘువంశమునందు 3–22 న కాంచగలరు.

*శ్లో॥ పితుః ప్రయత్నాత్ స సమగ్రసంపదః*
*శుభైః శరీరావయవైర్దినేదినే ।*
*పుపోష వృద్ధిః హరిదశ్వదీధితే –*
*రనుప్రవేశాదివ బాలచన్ద్రమాః ॥ 22*

"…..రఘుమహారాజు మనోజ్ఞములైన శరీరావయవములతో శుక్లపక్షమందు చంద్రుడు సూర్యకిరణములచేత దినదినప్రవర్ధమానమయ్యెడు రీతి వృద్ధి బొందెను."

బి) *శ్లో॥ సలిలమయే శశిని రవేర్దీధితయః మూర్ఛితాస్తయో నైశమ్ ।*
*క్షపయన్తి దర్పణోదరనిహితా ఇవ మందిరస్యాంతః ॥* –వరాహసంహిత.

సూర్యకాంతిచే చంద్రుడు దినదినాభివృద్ధిచెందుననుటకు ప్రమాణవాక్యమిది.

సి) "శ్రీసూర్యస్య అమా (సుషుమ్నా) నామకలా, తస్యాః ప్రవేశాభివృద్ధిం పుష్ణాతి చంద్రమాః కిల సూర్యస్య సుషుమ్నా నామ నాడికామనుప్రవిశ్య వర్ధతే।" అని వల్లభుడు.

డి) అమావాస్యాయాం చంద్రోరవౌ గచ్ఛతి ప్రతిపది నిఃసరతి. తత ఉదయం ప్రాప్య యథా దినే దినే వర్ధతే తథాయమపి వవృధే ఇత్యర్థః – అని శిశుహితైషిణీ.

2. **విశేషాన్ –** ఎ) విశేషాన్ అవయవాన్, 'విశేషోఽవయవే వ్యక్తౌ పుణ్యే శేషవివర్జితే' ఇత్యుత్పలమాలాయమ్ । –అని 'ప్రకాశికా' వ్యాఖ్య పేర్కొంటే

బి) **విశేషాన్ =** అవయవాన్, this is an unsusual sense of the word. The limbs are compared to the additional digits of the moon whcih are secured day after day. అని 'కర్మార్కర్' పేర్కొంటే

సి) **విశేషాన్ –** అవయవాన్; The 'శబ్దార్ణవ' also comfirms this meaning. 'విశేషోఽవయవే ద్రవ్యే ద్రష్టవ్యోత్తమవస్తుని।" అని 'కాలే' మహాశయుడు ఉదహరిస్తే,

డి) విశేషానవయవాన్। 'విశేషోఽవయవే వ్యక్తౌ' ఇత్యుత్పలమాలాయామ్ అని 'మల్లినాథసూరి' వివరించారు.

**క్రియాదర్శము :– పుపో(షో)ప**



ఎ) **పుపోష** – పుష (పుష్) పుష్టౌ (పుష్టినొందుట = 1.బలపడుట 2.కాపాడుట) క్ర్యాదిప్రకరణమ్ 1.అకర్మకమ్, 2.సకర్మకమ్, సేట్. పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషరూపాలు **పుపోష – పుపుషతుః – పుపుషుః.**

బి) **పుషోప** – పుష (పుష్) పుష్టౌ (బలియుట, కాపాడుట) దివాదిప్రకారణమ్ (4) 1.అకర్మకమ్, 2.సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషరూపాలు. పుషోప– పుపుషతుః –పుపుషుః.

**అలంకారములు :–** ఎ) ఇయం శ్లోకే వాక్యోపమేత్యాహ దణ్డీ, తల్లక్షణం తు.

*శ్లో॥ వాక్యార్థేనైవ వాక్యార్థః కోఽపి యద్యుపమీయతే ।*
*ఏకానేకేవ శబ్దాత్వాత్ సా 'వాక్యారోథపయా' ద్విధా ॥ 2–43.*

ఒకానొక వాక్యార్థము మరియొక వాక్యార్థముతో పోల్చబడినచో ఆ వాక్యార్థోపమ ఒకే ఇవ శబ్దము కల్గియుండుట, అనేక ఇవ శబ్దములు కల్గియుండుట అను బేధముచే రెండు విధములు. ఇచట వాక్యమనగా పదసముదాయమని అర్థము. –బాలానందిని.

చంద్రకలలు దినదినప్రవర్ధమానమవుతుండుటను పార్వతీదేవి అవయవశోభ దినదిన ప్రవర్ధమానమవుతుండుటతో పోల్చబడుటచే ఇది 'వాక్యార్థోపమాలంకారము'గా చెప్పదగును.

బి) 'వ్యక్తివివేకము, సరస్వతీకంఠాభరణము, కావ్యాలంకారటిప్పణి' ఈ మూడున్నూ 'అనేకేవశబ్దా ఉపమా' అను ఈ రెండవ విధ వాక్యార్థోపమాలకారానికి ఈ శ్లోకాన్ని ఉదాహరణగా పేర్కొన్నవి.



**అవతారికా :–** నామకరణమ్ (నామకరణము)

**శ్లో॥ తాం పార్వతీత్యాభిజనేన నామ్నా**
**బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ ।**
**ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చా–**
**దుమాఖ్యాం సుముఖీ జగాయ ॥ 26**

**పదవిభాగము :–** తామ్, పార్వతీ, ఇతి, ఆభిజనేన, నామ్నా, బన్ధుప్రియామ్, బన్ధుజనః, జుహావ, ఉమా, ఇతి, మాత్రా, తపసః, నిషిద్ధా, పశ్చాత్, ఉమాఖ్యామ్, సుముఖీ, జగాయ.

**అన్వయక్రమము :–** బన్ధుప్రియామ్, తామ్, బన్ధుజనః, ఆభిజనేన, నామ్నా, పార్వతీ, ఇతి, జుహావ, పశ్చాత్, మాత్రా, ఉమా, ఇతి, తపసః, నిషిద్ధా(సతీ), సుముఖీ, ఉమాఖ్యామ్, జగామ.

**ప్రతిపదార్థము :–** బన్ధుప్రియామ్ = బంధువులకు ప్రియమైన, తామ్ = ఆ కన్యను, బన్ధుజనః = తండ్రి మున్నగు బంధుజనము, ఆభిజనేన = గోత్రము నుండి వచ్చిన,

నామ్నా = పేరుతో, పార్వతీ + ఇవ = పార్వతి అని, జుహావ = పిలిచెను, పశ్చాత్ = తరువాత, మాత్రా = తల్లిచేత, ఉ = ఓసి, మా = వలదు, ఇతి = అని, తపసః = తపస్సు నుండి, నిషిద్ధా = నివారింపబడినదై, సుముఖీ = సుందరమైన ముఖము గల యా బాల, ఉమాఖ్యామ్ = 'ఉమ' యనెడు నామధేయమును, జగాయ = పొందెను.

**తాత్పర్యము :-** బంధువులకు ఇష్టురాలైన ఆ కన్యను తండ్రి మున్నగు బంధుజనము గోత్రము నుండి వచ్చిన పేరుతో 'పార్వతి' అని పిలిచెను. తరువాత తల్లిచేత 'ఓసి వలదు' అని తపస్సు నుండి నివారింపబడినదై, సుందరమయిన ముఖము గల యా బాల 'ఉమ' యనెడు నామధేయమును పొందెను.

**విభక్తులు / క్రియలు :-** 1) తామ్ - **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) పార్వతీ - **పార్వతీ,** పార్వత్యౌ, పార్వత్యః; ఈకారాన్త స్త్రీలింగ పార్వతీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) ఇతి - అవ్యయము. 4) ఆభిజనేన - **ఆభిజనేన,** ఆభిజనాభ్యామ్, ఆభిజనైః; అకారాన్త పుంలింగ ఆభిజన శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 5) నామ్నా - **నామ్నా,** నామభ్యామ్, నామభిః; నకారాన్త నపుంసకలింగ నామ్నన్ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 6) బన్ధుప్రియామ్ - **బన్ధుప్రియామ్,** బన్ధుప్రియే, బన్ధుప్రియాః; ఆకారాన్త స్త్రీలింగ 'బన్ధుప్రయా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) బన్ధుజనః - **బన్ధుజనః,** బన్ధుజనౌ, బన్ధుజనాః; అకారాన్త పుంలింగ 'బన్ధుజన' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) జుహావ - క్రియ. 9) ఉమా - **ఉమా,** ఉమే, ఉమాః; ఆకారాన్త స్త్రీలింగ 'ఉమా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 10) ఇతి - అవ్యయము. 11) మాత్రా - **మాత్రా,** మాతృభ్యామ్, మాతృభిః; ఋకారాన్త స్త్రీలింగ 'మాతృ' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 12) తపసః - **తపసః,** తపోభ్యామ్, తపోభ్యః; సకారాన్త నపుంసకలింగ తపస్ శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 13) నిషిద్ధా - **నిషిద్ధా,** నిషిద్ధే, నిషిద్ధాః; ఆకారాన్త స్త్రీలింగ 'నిషిద్ధా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 14) పశ్చాత్ - అవ్యయము. 15) ఉమా+ఆఖ్యామ్ - **ఉమాఖ్యామ్,** ఉమాఖ్యే, ఉమాఖ్యాః; ఆకారాన్త స్త్రీలింగ 'ఉమాఖ్యా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 16) సుముఖీ - **సుముఖీ,** సుముఖ్యౌ, సుముఖ్యః; ఈకారాన్త స్త్రీలింగ 'సుముఖీ' శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనము. 17) జగామ - క్రియ.

**సమాసాలు :-**

1) బన్ధుప్రియామ్ - బంధూనా ప్రియా (ష.త.) తామ్।
2) బన్ధుజనః - బన్ధుశ్చ అసౌ జనః (కర్మధా.)
3) ఉమాఖ్యామ్ - ఉమా చాసౌ ఆఖ్యా (కర్మ.) తామ్.

**సంధులు :-**

1) పార్వతీ + ఇతి = పార్వతీతి, సవర్ణదీర్ఘసన్ధిః. అకః సవర్ణే దీర్ఘః.
2) ఇతి + ఆభిజనేన = ఇత్యాభిజనేన, యణాదేశసన్ధిః, ఇకో యణచి.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.**

1. **ఇతి** - "ఇతి హేతు ప్రకార స్వరూప సమాప్తి వివక్షానియమ శబ్దప్రాదుర్భావ + ఏవమర్థేషు" - **అవ్యయకోశః (195)**

ఎ) హేతౌ - హన్తీతి పలాయతే । వత్సోత్సుకాపి స్తిమితా సపర్యాం ప్రత్యగ్రహీత్ సేతి ననన్దతుస్తౌ । రఘువంశమ్ 2-22। "విప్ర ఇత్యభిభవత్యపి త్వయి।" రఘువంశమ్ 11-84.



బి) ప్రకారే - 'ఇతి మదమదనాభ్యాం రాగిణః స్పష్టరాగాన్' -మాఘే 10-91.

ఇతివృత్తమ్, ఇతిహాసః । 'గౌరశ్వౌ హస్తీతి జాతిః'

సి) స్వరూపే - 'వృద్ధిరిత్యేవ యా వృద్ధిః' - మహాభాష్యే 1-1-1. ....ఝుటితి, పటితి.

ఇ) సమాప్తౌ - 'అ అ ఇతి' అష్టాధ్యాయీః 8-4-68.

ఎఫ్) వివిక్షానియమే - 'తదస్యాస్త్యస్మిన్ ఇతి మతుప్' (5-2-94).

జి) శబ్దప్రాదుర్భావే - 'ఇతి పాణిని' । పాణిని శబ్దః ప్రసిద్ధ ఇత్యర్థః.

హెచ్) ఏవమర్థే - 'క్రమాదముం నారద ఇత్యబోధి సః।" మాఘే 2-3.

2. పార్వతీ - ఎ) పర్వతస్య అపత్యం స్త్రీ పార్వతీ.

'All the relatives called the child 'పార్వతీ' after her father who was a 'పర్వత'. She however, came to have another name afterwards. She came to be called '**Uma**', as, when her mother wanted to dissuade her from doing rigorous penance, to secure '**Siva**' for her husband who had first rejected her, she addressed her 'ఉ మా'; 'ఉ' is సంబోధనార్థే, O you; మా వారణార్థే, do not, I forbid you. According to our poet, 'Mena' did not use the actual words 'ఉమా', but said "మనీషితాః సన్తి గృహేషు దేవతాస్తపః క్వ వత్సే। క్వచ తావకం వపుః।" (5-4). - అని 'కర్మార్కర్'.

బి) శ్లో॥ *"తపసో వారయామాస ఉమేత్యేవాబ్రవీచ్చ సా ।*
*తదేవ మాతా నామాస్యాశ్చక్రే పితృసుతా శుభా ॥"* వామనపురాణము)

**క్రియాదర్శము :-** 1) జుహావ 2) జగామ.

1) **జుహావ** - హు దానాదనయోః (ఇచ్చుట, తినుట, వేయుట) జుహోత్యాది ప్రకరణమ్ (3); సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లిట్ ప్రథమపురుష రూపాలు.

ఎ) జుహువాఞ్చకార - జుహువాఞ్చక్రతుః - జుహువాఞ్చక్రుః

బి) **జుహావ** - జుహువతుః - జుహువుః

2) **జగామ** - గమ్లు (గమ్) గతౌ (వెళ్ళుట) భ్వాదిప్రకరణమ్ (1); సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. (ఇషు గమి యమాం ఛః, సూ 7-3-77) అను సూత్రముచే 'మ'కారమునకు 'ఛ'కారాదేశము. గమ్+అ+తి - గఛ్+అ+తి. తుగాగమము, శ్చుత్వములచే 'గచ్ఛతి' అను రూపము లట్ ప్రథమ పురుష ఏకవచన రూపం.

'లిట్' ప్రథమపురుషరూపాలు - **జగామ** - జగ్మతుః - జగ్ముః.

**అలంకారములు :-** ఇట 'కావ్యాలింగాలంకార'మున్నదని చెప్పదగును.

కా: **'కావ్యలిఙ్గం హేతోర్వాక్యపదార్థతా'** - కావ్యప్రకాశే 10-114.

ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువు చెప్పడం కావ్యలింగాలంకారము. ఈ శ్లోకమున 'పార్వతీ', 'ఉమా' అను వాటికి 'ఆభిజనేన', 'తపసోనిషిద్ధా' అని చెప్పబడుటచే నిట 'కావ్యలింగాలంకార'మున్నదని చెప్పదగును. 

**శ్లో॥ మహీభృతః పుత్రవతోఽపి దృష్టి-**
**స్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్ ।**
**అనన్తపుష్పస్య మధోర్హి చూతే**
**ద్విరేఫమాలా సవిశేషసఙ్గా ॥ 27**

***పదవిభాగము :-*** మహీభృతః, పుత్రవతః, అపి, దృష్టిః, తస్మిన్, అపత్యేన, జగామ, తృప్తిమ్, అనన్తపుష్పస్య, మధోః, హి, చూతే, ద్విరేఫమాలా, సవిశేషసఙ్గా.

***అన్వయక్రమము :-*** పుత్రవతః అపి, మహీభృతః, దృష్టిః, తస్మిన్, అపత్యే, తృప్తిమ్, న, జగామ। హి, అనన్తపుష్పస్య, మధోః, ద్విరేఫమాలా, చూతే, సవిశేషసఙ్గా.

***ప్రతిపదార్థము :-*** పుత్రవతః అపి = పలువురు సంతానము గలవాడగు, మహీభృతః = ఆ హిమవంతుని యొక్క, దృష్టిః = చూపు, (తస్మిన్ అపత్యే) – తస్యామ్ = ఆ పార్వతియందు, తృప్తిమ్ = తనివిని, న జగామ = పొందదాయెను, హి = అది సరియే గదా!, అనన్తపుష్పస్య= లెక్కలేనన్ని పూవులు గలవాడైన, మధోః = వసంతుని యొక్క, ద్విరేఫమాలా = తుమ్మెదల బారు, చూతే = పూచిన మామిడి చెట్టు యందు, సవిశేషసఙ్గా = విశేషప్రేమతో కూడినది గదా!

**తాత్పర్యము:** –పలువురు సంతానము గలవాడగు ఆ హిమవంతునియొక్క చూపు ఆ పార్వతి యందు తృప్తిని పొందదాయెను. అది సరియేగదా! లెక్కలేనన్ని పూవులు గలవాడైన వసంతుని యొక్క తుమ్మెదలబారు, పూచిన మామిడి చెట్టుయందు విశేషప్రేమతో కూడినది గదా!

***విభక్తులు / క్రియలు :-*** 1) పుత్రవతః – **పుత్రవతః,** పుత్రవతోః, పుత్రవతామ్; తకారాన్త పుంలింగ పుత్రవత్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) మహీభృతః – **మహీభృతః,** మహీభృతోః, మహీభృతామ్; తకారాన్త పుంలింగ మహీభృత్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 3) అపి – అవ్యయము. 4) దృష్టిః – **దృష్టిః,** దృష్టీ, దృష్టయః; ఇకారాన్త పుంలింగ 'దృష్టి' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) తస్మిన్నపత్యే – **అపత్యే,** అపత్యయోః, అపత్యేషు; అకారాన్త నపుంసకలింగ 'అపత్య' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 6) తృప్తిమ్ – **తృప్తిమ్,** తృప్తీ, తృప్తీః; ఇకారాన్త స్త్రీలింగ 'తృప్తి' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) న – అవ్యయము. 8) జగామ – క్రియ, 9) అనన్తపుష్పస్య – **పుష్పస్య,** పుష్పయోః, పుష్పాణామ్; అకారాన్త పుంలింగ పుష్పశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) మధోః – **మధోః,** మధ్వోః, మధూనామ్; ఉకారాన్త పుంలింగ 'మధు' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) హి – అవ్యయము. 12) చూతే – **చూతే,** చూతయోః, చూతేషు; అకారాన్త పుంలింగ 'చూత' శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 13) ద్విరేఫమాలా – **ద్విరేఫమాలా,** ద్విరేఫమాలే, ద్విరేఫమాలాః; ఆకారాన్త స్త్రీలింగ 'ద్విరేఫమాలా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 14) సవిశేషసఙ్గా – **సవిశేషసఙ్గా,** సవిశేషసఙ్గే, సవిశేషసఙ్గాః; ఆకారాన్త స్త్రీలింగ 'సవిశేషసఙ్గా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.



***సమాసాలు :-***

1) పుత్రవతః – పుత్రాశ్చ దుహితరశ్చేతి పుత్రాః (ఏకశేష సమాసము) తద్వతః।
2) మహీభృతః – మహీం బిభర్తీతి (ఉపపదతత్పురుష) మహీభృత్, తస్య.
3) అనన్తపుష్పస్య – అనన్తాని పుష్పాణి యస్య (బహువ్రీహి) సః, తస్య.
4) ద్విరేఫమాలా – ద్వేరేఫౌ యేషామ్ (బహువ్రీహి) తే ద్విరేఫాః, ద్విరేఫాణాం మాలా (ష.త.) ద్విరేఫమాలా.
5) సవిశేషసఙ్గా – విశేషణ సహ (బహువ్రీహి) సవిశేషః సఙ్గో యస్యాః (బహువ్రీహి) సా.

***సంధులు :-***

1) పుత్రవతః + అపి = పుత్రవతోఽపి, పూర్వరూపసన్ధిః.
2) మధోః + హి = మధోర్హి, విసర్గసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. ఈ శ్లోకభావానికి తుల్యమైన భావమున్న రఘువంశమునందలి (3-17) ను పరిశీలించండి.

*శ్లో॥ నివాతపద్మస్తిమితేన చక్షుసా*
*నృపస్య కాన్తం పిబతః సుతాననమ్ ।*
*మహోదధేః పూర ఇవేన్దుదర్శనా*
*ద్గురుః ప్రహర్షః ప్రబభూవ నాత్మని ॥*

సముద్రుడు పూర్ణిమా చంద్రుని చూచినపుడు ఉప్పొంగెడు రీతి దిలీపమహారాజు కుమారుని (రఘువుని) మనోహరమగు మోము ఱెప్పపాటు వేయక చూచుచు ఆనంద సాగరమున నోలలాడెనని భావము.

2. ద్విరేఫమాలా – ద్వౌ రేఫౌ యేషాం తే, ద్విరేఫాః, ద్విరేఫాణాం మాలా ద్విరేఫమాలా,

**ద్విరేఫః –**

*శ్లో॥ మధువ్రతో మధుకరో మధులిణ్మధుపాళినః ।*
*ద్విరేఫపుష్పలిడ్భృఙ్గ షట్పద భ్రమరాళయః ॥ 2-19 అమరకోశము.*
*(ఇన్దిన్దిర శఞ్చరీకో రోలమ్బో బమ్భరశ్చ సః)*

*శ్లో॥ మధుకర–మధుపమ–మధువ్రత–శిలీముఖ–భ్రమర–భృఙ్గ–పుష్పలిహః ।*
*ఇన్దిన్దిరాలి–షట్చరణ–చంచరీకాలినో ద్విరేఫాః స్యుః ॥ 255*

అని హలాయుధకోశము 13 నామములను తెలిపినది. ఇచట కుమారసంభవ మహాకావ్యమునందలి 3-27 శ్లోకాన్నీ చూడండి.

శ్లో॥ "నివేశయామాస మధుర్ద్విరేఫాన్ నామాక్షరాణీవ మనోభవస్య..."

ద్విరేఫః-ద్వౌ రేఫౌ రకారవర్ణౌ యస్మిన్, భ్రమర ఇతి నామ్ని.

3. **చూతే –** ఎ) చూష్యతే పీయతే ఇతి । చూష్ + కర్మణి క్త, 'పృషోదరాదిత్వాత్ షలోపః' రపాలత్వాదేవాస్య తథాత్వమ్ ।

బి **శ్లో॥ ....స్యాదామ్రశ్చూతశ్చ సహకారః 11(2-192).** అని హలాయుధకోశము.

సి) 'ఆమ్రశ్చూతో రసాలః' – ఇత్యమరః

డి) చూతస్య వికారః కుసుమమ్ ఇతి విగ్రహేన **'అవయవే చ ప్రాణ్యౌషధివృక్షేభ్యః'** ఇతి సూత్రేణ ఉత్పన్నస్య అణ్ప్రత్యయస్య 'పుష్పమూలేషు బహుళమ్' ఇతి లుక్. –పుంసవనీ వ్యాఖ్యా.

ఇ) చూతే – మమిడిపూవు యందు అనే కంటె పూచిన మామిడి చెట్టుయందు అనుట మనోహరంగా ఉంటుందని తలంతును.

***క్రియాదర్శము :–*** జగామ – 26వ శ్లోకవ్యాఖ్య భాగము చూడగలరు.

***అలంకారములు :–*** 1) ఇచట 'ప్రతివస్తూపమాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– శ్లో॥ సమానవస్తున్యాసేన ప్రతివస్తూపమోచ్యతే ।***

***యథేవానభిధానేऽపి గుణసామ్యప్రతీతితః ॥ – కావ్యాలంకారః 2-34***

యథా, ఇవ శబ్దములను ప్రయోగింపకున్నను, సమానములగు వాక్యార్థముల కూర్చుచే గుణసామ్యము తెలియుటవలన 'ప్రతివస్తూపమాలంకారము' చెప్పబడుచున్నది.

ఈ శ్లోకమున యథా, ఇవ శబ్దముల ప్రయోగము లేకున్నను. "పలువురు సంతానమున్నను ఆ హిమవంతుని చూపు ఆ పార్వతి యందు తనివిని పొందదయ్యెను." అని పూర్వార్థభావము. "లెక్కలేనన్ని పూలు యున్నను ఆ వసంతుని యొక్క తుమ్మెదలబారు ఆ పూచిన మామిడి చెట్టు యందు విశేషప్రేమతో కూడినదాయెను. అని ఉత్తరార్థభావము.

ఈ రెంటిలో 'అత్యన్తానురాగ'మను గుణసామ్యమున్నదని తెలియుట వలన 'ప్రతివస్తూపమాలంకార'మున్నదని చెప్పదగును.

2) The 'సరస్వతీకంఠాభరణ' quotes this verse with the remark సందిగ్ధస్య గుణతా, and the 'అలంకారతిలక' as an illustration of the figure of speech దృష్టాంత. - R.D.Karmarkar.

**శ్లో॥ ప్రభామహత్యా శిఖయేవ దీప –**
**స్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః ।**
**సంస్కారవత్యేవ గిరా మనీషీ**
**తయా స పూతశ్చ విభూషితశ్చ ॥ 28**



***పదవిభాగము :–*** ప్రభామహత్యా, శిఖయా, ఇవ, దీపః, త్రిమార్గయా, ఇవ, త్రిదివస్య, మార్గః, సంస్కారవత్యా, ఇవ, గిరా, మనీషీ, తయా, సః, పూతః, చ, విభూషితః, చ.

***అన్వయక్రమము :–*** ప్రభామహత్యా, శిఖయా, దీపః, ఇవ, త్రిమార్గయా, త్రిదివస్య, మార్గః, ఇవ, సంస్కారవత్యా, గిరా, మనీషీ, ఇవ, తయా, సః, పూతః, చ, విభూషితః, చ.

***ప్రతిపదార్థము :–*** ప్రభామహత్యా = వెలుతురుచేత అధికమైన, శిఖయా = జ్వాలచేత, దీపః + ఇవ = దివియ ఎట్లో అట్లును, త్రిమార్గయా = స్వర్గమర్త్యపాతాళములలో మార్గములు గల మందాకిని చేత, త్రిదివస్య = స్వర్గము యొక్క, మార్గః + ఇవ = త్రోవ ఎట్లో అట్లును, సంస్కారవత్యా = వ్యాకరణాది సంస్కారముగల, గిరా = వాక్కుచేత, మనీషీ + ఇవ = పండితుడు ఎట్లో అట్లును, తయా = ఆ పార్వతిచేత, సః = ఆ హిమవంతుడు, పూతఃచ = పవిత్రుడైనవాడును, విభూషితః చ = అలంకరింపబడిన వాడును, అసీత్ = ఆయెను.

***తాత్పర్యము :–*** వెలుతురుచేత అధికమయిన జ్వాలచేత దివయ ఎట్లో అట్లును, త్రిమార్గముల గల మందాకినిచేత స్వర్గముయొక్క త్రోవ ఎట్లో అట్లును, వ్యాకరణాది సంస్కారము గల వాక్కు చేత పండితుడు ఎట్లో అట్లును, ఆ పార్వతిచేత ఆ హిమవంతుడు పునీతుడును, భూషితుడును ఆయెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) ప్రభామహత్యా – **ప్రభామహత్యా,** ప్రభామహతీభ్యామ్, ప్రభామహతీభిః; ఈకారాన్త స్త్రీలింగ ప్రభామహతీ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 2) శిఖయా – **శిఖయా,** శిఖాభ్యామ్, శిఖాభిః; ఆకారాన్త స్త్రీలింగ శిఖా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) ఇవ – అవ్యయము. 4) దీపః – **దీపః,** దీపౌ, దీపాః; అకారాన్త పుంలింగ దీప శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) త్రిమార్గయా – **త్రిమార్గయా,** త్రిమార్గాభ్యామ్, త్రిమార్గాభిః; ఆకారాన్త స్త్రీలింగ 'త్రిమార్గా' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 6) త్రిదివస్య – **త్రిదివస్య,** త్రిదివయోః, త్రిదివానామ్; అకారాన్త పుంలింగ త్రిదివ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) మార్గః – **మార్గః,** మార్గౌ, మార్గాః; అకారాన్త పుంలింగ మార్గ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) సంస్కారవత్యా – **సంస్కారవత్యా,** సంస్కారవతీభ్యామ్, సంస్కారవతీభిః; ఈకారాన్త స్త్రీలింగ సంస్కారవతీ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) గిరా – **గిరా,** గిర్భ్యామ్, గీర్భిః; రేఫాన్త స్త్రీలింగ గిర్ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 10) మనీషీ – **మనీషీ,** మనీషిణౌ, మనీషిణః; నకారాన్త పుంలింగ 'మనీషిన్' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. (మనీషిన్ రూపము ఉన్నది.) 11) తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 12) సః – **సః,** తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 13) పూతః – **పూతః,** పూతౌ, పూతాః; అకారాన్త పుంలింగ పూత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 14) చ – అవ్యయము. 15) విభూషితః – **విభూషితః,** విభూషితౌ, విభూషితాః; అకారాన్త పుంలింగ విభూషిత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) ప్రభామహత్యా – ప్రభాభిః మహతీ (తృ.త.) తయా.

2) త్రిమార్గయా – త్రయః మార్గాః యస్యాః (బహువ్రీహి) సా త్రిమార్గా, తయా.

3) త్రిదివస్య – తృతీయా ద్యౌః (ద్విగు) తస్య.

4) విభూషితః– విశేషేణ భూషితః (సుప్సుపాసమాసః).

***సంధులు :–***

1) శిఖయా + ఇవ = శిఖయేవ,

2) త్రిమార్గయా + ఇవ = త్రిమార్గయేవ,

3) సంస్కారవత్యా + ఇవ = సంస్కావత్యేవ, గుణసన్ధిః, **ఆద్గుణః** (6–1–84).

4) పూతః +చ = పూతశ్చ. 5) విభూషితః + చ = విభూషితశ్చ, శ్చుత్వసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **మనీషీ** – (న్) పుం. ( మనీషా అస్త్యస్యేతి. మనీషా + వ్రీహ్యాదిత్వాత్ ఇని) పండితః.

ఎ) *శ్లో॥* ***యన్మూర్త్యవయవాస్సూక్ష్మాస్తస్యేమాన్యాశ్రయన్తి షట్ ।***
***తస్మాచ్ఛరీరమిత్యాహుస్తస్యమూర్తిం మనీషిణః ॥*** *మనుధర్మశాస్త్రం 1–17*

ఏకారణముచేత శరీరసంపాదకములైన మహంకార తన్మాత్రారూపములగు సూక్ష్మావయువము లాఱును ప్రకృతి సహితుడైన బ్రహ్మయొక్క మూర్తినిక చెప్ప బడుననియు, మున్ను చెప్పినవియు నైన భూతేంద్రియములు కార్యరూపమున ప్రవేశించుచున్నవి గాన, ఆ బ్రహ్మమూర్తిని శరీరమని పండితులు చెప్పుదురు.

బి) *శ్లో॥* *ధీరో ధీమాన్ లబ్దవర్ణో విపశ్చిద్*
*వృద్ధో విద్వాన్ ప్రాప్తరూపోఽ భిరూపః।*
*సూరిః ప్రాజ్ఞః పణ్డితః సన్మనీషీ*
*జ్ఞో దోషజ్ఞః కోవిదః స్యాత్ప్రబుద్ధః॥* *332*

*శ్లో॥* *బుధః సుధీః కృతీ కృష్టిః కవిర్వ్యక్తో విశారదః।*
*విచక్షణశ్చ మేధావీ సంఖ్యావాన్మతిమాన్మతః॥* *333.*

అని హలాయుధకోశము ‘28’ నామములను తెలిపినది.

సి) *శ్లో॥* *విద్వాన్ సుధీః కవివిచక్షణలబ్దవర్ణా జ్ఞః ప్రాప్తరూపకృతికృష్ట్యభిరూప ధీరః।*
*మేధావికోవిదవిశారదసూరిదోషజ్ఞాఃప్రాజ్ఞపణ్డితమనీషిబుధప్రబుద్ధాః॥ 5*

*శ్లో॥* *వ్యక్తో విపశ్చిత్సంఖ్యావాన్.......*

అని అభిధానచిన్తామణి ‘25’ నామములను తెలిపినది.

***అలంకారములు :–*** ఇందు ‘మాలోపమాలంకార’మున్నదని చెప్పదగును

***లక్షణము :–*** ***పూష్ణ్యాతప ఇవాహ్నీవ పూషా వ్యోమ్నీవ వాసరః।***
***విక్రమస్త్వయ్యధాల్లక్ష్మీమితి మాలోపమా మతా॥ 2–42(కావ్యాదర్శః)***

మాలలో ఒక్కొక్క పుష్పము వెనుకనున్న పుష్పముతోడను, తరువాతి పుష్పముతోడను సంబంధించి ఉన్నట్లు ఒక ఉపమేయమునకు కొన్ని ఉపమానములు చెప్పబడుటచేనిది ‘మాలోపమాలంకార’ మని చెప్పదగును.





**శ్లో॥ మన్దాకినీసైకతవేదికాభిస్సా –**
**కన్దుకైః కృత్రిమపుత్త్రకైశ్చ ।**
**రేమే ముహుర్మధ్యగతా సఖీనాం**
**క్రీడారసం నిర్వశతీవ బాల్యే ॥** **29**

***పదవిభాగము :–*** మన్దాకినీసైకతవేదికాభిః, సా, కన్దుకైః, కృత్రిమపుత్త్రకైః, చ, రేమే, ముహుః, మధ్యగతా, సఖీనామ్, క్రీడారసమ్, నిర్వశతీ, ఇవ, బాల్యే.

***అన్వయక్రమము :–*** సా, బాల్యే, క్రీడారసమ్, నిర్వశతీ, ఇవ, సఖీనామ్, మధ్యగతా (సతీ), మన్దాకినీసైకతవేదికాభిః, కున్దుకైః, కృత్రిమ పుత్త్రకైః, చ, ముహుః, రేమే.

***ప్రతిపదార్థము :–*** సా = ఆ పార్వతీదేవి, బాల్యే = బాల్యమునందు, క్రీడారసమ్ = ఆటలయొక్క రుచిని, నిర్వశతీ + ఇవ = అనుభవించునదియు వలె, సఖీనామ్ = చెలికత్తెల యొక్క, మధ్యగతా = నడుమనున్నదై, మన్దాకినీసైకతవేదికాభిః = గంగయొక్క ఇసుకతిన్నె యందలి అరగులతోను, కన్దుకైః = బంతులతోను, కృత్రిమపుత్త్రకైఃచ = చేసినటువంటి బొమ్మలతోను, ముహుః = తఱుచుగా, రేమే = ఆడుకొనుచుండెను.

***తాత్పర్యము :–*** ఆ పార్వతీదేవి బాల్యమునందు ఆటలయొక్క రుచిని అనుభవించునదియు వలె, చెలికత్తెల యొక్క నడుమనున్నదై, గంగానదీ ఇసుకతిన్నెల యందలి అరగులతోను, బంతులతోను, చేసినటువంటి బొమ్మలతోను తఱుచుగా ఆడుకొనుచుండెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) బాల్యే – **బాల్యే,** బాల్యయోః, బాల్యేషు; అకారాన్త నపుంసకలింగ బాల్య శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 3) క్రీడారసమ్ – **క్రీడారసమ్,** క్రీడారసౌ, క్రీడారసాన్; అకారాన్త పుంలింగ క్రీడారస శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 4) నిర్వశతీ – **నిర్వశతీ,** నిర్వశత్యౌ, నిర్వశత్యః; ఈకారాన్త స్త్రీలింగ నిర్వశతీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) ఇవ – అవ్యయము. 6) సఖీనామ్ – సఖ్యాః, సఖ్యోః, **సఖీనామ్;** ఈకారాన్త స్త్రీలింగ సఖీ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 7) మధ్యగతా – **మధ్యగతా,** మధ్యగతే, మధ్యగతాః; ఆకారాన్త స్త్రీలింగ మధ్యగత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) మన్దాకినీసైకవేదికాభిః – ...వేదికయా, వేదికాభ్యామ్, **వేదికాభిః;** ఆకారాన్త స్త్రీలింగ వేదికా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) కన్దుకైః – కన్దుకేణ, కన్దుకాభ్యామ్, **కన్దుకైః;** అకారాన్త పుంలింగ కన్దుక శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 10) కృత్రిమపుత్త్రకైః – పుత్త్రకేణ, పుత్త్రకాభ్యామ్, **పుత్త్రకైః;** అకారాన్త పుంలింగ పుత్త్రక శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 11)ముహుః – అవ్యయము. 12) రేమే – క్రియ.

***సమాసాలు :–***

1) క్రీడారసమ్ – క్రీడాయా రసః (ష.త.) తమ్.

2) మధ్యగతా – మధ్యం గతా (ద్వి.త.).

3) మన్దాకినీసైకతవేదికాభిః – మన్దాకిన్యాః సైకతమ్ (ష.త.) మందాకినీసైకతమ్, మన్దాకినీసైకతేషు వేదికాః (స.త.) మన్దాకినీసైకతవేదికాః, తాభిః.

4) కృత్రిమపుత్త్రకైః – కృత్రిమాశ్చ తే పుత్త్రకాః (కర్మధా.) తైః.

**సంధులు :–**

1) ...వేదికాభిః + సా = వేదికాభిస్సా, విసర్గసన్ధిః.

2) పుత్త్రకైః + చ = పుత్త్రకైశ్చ, శ్చుత్వసన్ధిః.

3) ముహుః + మధ్యగతా = ముహుర్మధ్యగతా, విసర్గసన్ధిః.

4) నిర్విశతీ + ఇవ = నిర్విశతీవ, సవర్ణదీర్ఘసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **మన్దాకినీసైకతవేదికాభిః –**

ఎ) సైకతమ్ – నపుంసకము (సికతాః సన్త్యత్రేతి. సికతా + అణ్)
(వాలుకామయతటమ్, పులినమ్, ద్వీపమ్)

హలాయుధకోశ వ్యాఖ్య ఈ శ్లోకాన్నే ఉదహరించింది.

బి) శ్లో॥ *యాం సైకతోత్సఙ్గసుఖోచితానాం*
*ప్రాజ్యైః పయోభిః పరివర్ధితానామ్ ।*
*సామాన్యధాత్రీమివ మానసం యే*
*సమ్భావయత్యుత్తరకోసలానామ్ ॥ రఘువంశమ్ 13-62.*

"(సరయూనది) దీని ఇసుకతిన్నెలపై, తల్లిఒడిలో వలె సుఖపడుచు క్షీర సదృశములైన నీటిని త్రాగి, పుష్టిని పొందిన...."

సి) ***తత్ర ఖలు మన్దాకిన్యాః పులినేషు సికతాపర్వతకేళిభిః క్రీడన్తీ...*** –విక్రమోర్వశీయము–4.

2. Childhood, it is well-known, is given to play and sport. Mallinatha reads క్రీడారసం నిర్విశతీవ బాల్యే which ultimately means the same thing. But బాల్యం నిర్విశతీవ is more poetic than బాల్యే క్రీడారసం నిర్విశతీ.

Three pastimes indulged in by Parvati are refered to here. One is that of raising dams or altars of the sand on the banks of the Ganges, demolishing them and re-raising them. Even now children are seen taking great pleasure in this pastime on the banks of local rivulet, especially in villages. The 'Megadutam' refers to another kind of pastime on the sand.

-R.D.Karmarkar.

శ్లో॥ *మన్దాకిన్యాః .....అన్వేష్టవ్యైః కనకసికతాముష్టినిక్షేపగూఢైః*
*సఙ్క్రీడన్తే మణిభిరమరప్రార్థితా యత్ర కన్యాః ॥*

*–మేఘదూతమ్ (67-68) అనుబంధం*



***క్రియాదర్శము :–* రేమే–** రము (రమ్) క్రీడాయామ్ (ఆడుట) భ్వాదిప్రకరణమ్ (1), అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ. భూతానద్యతనపరోక్షే లిట్.

ప్రథమపురుషరూపాలు :– **రేమే** – రేమాతే – రేమిరే.

***అలంకారములు :–*** ఎ) ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును. 'నిర్విశతీవ' అను చోట సంభావనయుండటచే నిది ఉత్ప్రేక్షాలంకారము.

బి) 'కావ్యానుశాసనము' మఱియు 'సరస్వతీకంఠాభరణము' రెండున్నూ 'క్రీడితా' అనుదాన్ని వివరించటానికి ఈ శ్లోకాన్నే ఉదాహరణగా పేర్కొన్నాయి. ❀

***అవతారికా :–*** పార్వత్యాః విద్యాభ్యాసః

**శ్లో॥ తాం హంసమాలాశ్శరదీవ గఙ్గాం**
**మహౌషధిం నక్తమివాత్మభాసః।**
**స్థిరోపదేశాముపదేశకాలే**
**ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః॥ 30**

***పదవిభాగము :–*** తామ్, హంసమాలాః, శరది, ఇవ, గఙ్గామ్, మహౌషధీమ్, ఇవ, ఆత్మభాసః, స్థిరోపదేశామ్, ఉపదేశకాలే, ప్రపేదిరే, ప్రాక్తనజన్మవిద్యాః.

***అన్వయక్రమము :–*** స్థిరోపదేశామ్, తామ్, ఉపదేశకాలే, ప్రాక్తనజన్మవిద్యాః, శరది, గఙ్గామ్, హంసమాలాః, ఇవ, నక్తమ్, మహౌషధిమ్, ఆత్మభాసః, ఇవ, ప్రపేదిరే.

***ప్రతిపదార్థము :–*** స్థిరోపదేశామ్ = స్థిరమగు ఉపదేశముగల, తామ్ = ఆ పార్వతీదేవిని, ఉపదేశకాలే = శిక్షాసమయము నందు, ప్రాక్తనజన్మవిద్యాః = క్రిందిటి జన్మము నందలి విద్యలు, శరది = శరత్కాలము నందు, గఙ్గామ్ = గంగానదిని, హంసమాలాః + ఇవ = హంసల పంక్తులువలెను, నక్తమ్ = రాత్రియందు, మహౌషధిమ్ = ఒక గొప్ప యోషధిని, ఆత్మభాసః + ఇవ = తన కాంతులు వలెను, ప్రపేదిరే = పొందినవి.

***తాత్పర్యము :–*** స్థిరమగు ఉపదేశముగల ఆ పార్వతీదేవిని శిక్షాసమయమందు క్రిందటి జన్మమునందలి విద్యలు, శరత్కాకాలము నందు గంగానదిని హంసలపంక్తివలెను, రాత్రియందు ఒక గొప్పయోషధిని తన కాంతులు వలెను పొందినవి.

***విభక్తులు / క్రియలు :–*** 1) తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) హంసమాలాః – హంసమాలా, హంసమాలే, **హంసమాలాః;** ఆకారాన్త స్త్రీలింగ హంసమాలా శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 3) శరది – **శరది,** శరదోరి, శరత్సు; తకారాన్త స్త్రీలింగ శరత్ శబ్దము సప్తమీవిభక్తి ఏకవచనము. 4) ఇవ – అవ్యయము. 5) గంగామ్ – **గంగామ్,** గంగే, గంగాః; ఆకారాన్త స్త్రీలింగ గంగా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) మహౌషధిమ్ – **మహౌషధిమ్,** మహౌషధీ, మహౌషధీః; ఇకారాన్త స్త్రీలింగ మహౌషధి శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) నక్తమ్ – అవ్యయము, 'రాత్రావిత్యర్థః' అకారాన్త నపుంసకలింగమ్, రాత్రిః. 8) ఆత్మభాసః – ఆత్మభాసాః, ఆత్మభాసౌ, **ఆత్మభాసః;** సకారాన్త స్త్రీలింగ ఆత్మభాశ్శబ్దము,

ప్రథమావిభక్తి బహువచనము. 9) స్థిరోపదేశామ్ – **స్థిరోపదేశామ్,** స్థిరోపదేశే, స్థిరోపదేశాః; ఆకారాన్త స్త్రీలింగ స్థిరోపదేశా శబ్దము, ద్వితీయవిభక్తి ఏకవచనము. 10) ఉపదేశకాలే – ఉపదేశకాలే, ఉపదేశకాలయోః, ఉపదేశకాలేషు; అకారాన్త పుంలింగ ఉపదేశకాల శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) ప్రపేదిరే – క్రియ. 12) ప్రాక్తనజన్మవిద్యాః – ప్రాక్తజన్మవిద్యా, ప్రాక్తనజన్మవిద్యే, **ప్రాక్తనజన్మవిద్యాః;** ఆకారాన్త స్త్రీలింగ విద్యా శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) స్థిరోపదేశామ్ – స్థిరః ఉపదేశః యస్యాః (బహుప్రీహి), సా, తామ్.
2) ఉపదేశకాలే – ఉపదేశస్య కాలః (ష.త), తస్మిన్.
3) ప్రాక్తనజన్మవిద్యాః – ప్రాక్తనం చ తజ్జన్య (కర్మధా.) ప్రాక్తనజన్మ, ప్రాక్తనజన్మనః విద్యాః (ష.త).
4) హంసమాలాః – హంసస్య మాలాః హంసమాలాః (ష.త) తాః.
5) మహౌషధిమ్ – మహతీ చాసౌ ఓషధిః (కర్మధా.) మహౌషధిః, తామ్।
6) ఆత్మభాసః – ఆత్మనః భాసః (ష.త.).

***సంధులు :–***

1) హంసమాలాః + శరది = హంసమాలాశ్శరది, విసర్గాదేశసన్ధిః, **(వా శరి).**
2) శరది + ఇవ = శరదీవ, సవర్ణదీర్ఘసన్ధిః.
3) ఇవ + ఆత్మభాసః = ఇవాత్మభాసః, సవర్ణదీర్ఘసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1.ప్రాక్తనజన్మవిద్యాః–

ఎ) ***శ్లో॥ అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః।***
***పురాణం ధర్మశాస్త్రంచ విద్యా హ్యేతాశ్చతుర్దశ॥ వి.పు.3-6-27.***

చతుర్వేదములు,షడ్వేదాంగములు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము) 11.మీమాంస, 12.న్యాయము, 13.పురాణము, 14. ధర్మశాస్త్రము

***శ్లో॥ ఆయుర్వేదో ధనుర్వేదో గాన్ధర్వశ్చేతి తే త్రయః।***
***అర్థశాస్త్రం చతుర్థం తు విద్యా హ్యష్టాదశైవ తు॥*** అని అష్టాదశ విద్యలు

2. The poet explains the advent of the lores by two compansions. In the first, the 'విద్యాః' are compared to the rows of the swans, parvati to the Ganges ఉపదేశకాలే and to శరది .......

In the second comparison, Parvati is compared to the మహౌషధి, and the 'విద్యాః' to ఆత్మభాసః .

The lustre of the luminous herb does not come to it from out side. It is always in the herb, but owing to the sun's overpowering light, the luster cannot assert itself till night has fallen. Similarly **the 'విద్యాః' had been all the while with Parvati, only they waited till the proper ఉపదేశకాల to reveal themselves**. - RD Karmarkar.



3. ఇదీ, అదీ, ఇప్పుడు, అప్పుడు, అని లేక 'సర్వవిద్యలు' – ఆ పార్వతీదేవి యందు ఉన్నవని భావము.

4. ద్వివిధో విద్యావినయః। యదాహ విష్ణుగుప్తః – 'కృతకః స్వాభావికశ్చ వినయః' (కౌటిల్య అర్థశాస్త్రము –1–5.2) ఇతి, తత్ర కృతకే విద్యావినయే ప్రథమముపమానం దర్శయతి – హంసమాలాః. శరది గంగామివేతి। హంసమాలాః హంసపంక్తయః శరది శరత్కాలే గంగామివ। హంసానాం వర్షాసు మానసే స్థితిః, పునశ్చ శరదారమ్భే స్వాభిమతేషు భాగీరథీ ప్రదేశాదిష్వితి ప్రసిద్ధః।–అని 'వివరణమ్'.

***క్రియాదర్శము :–*** **ప్రపేదిరే** – ప్రపూర్వకాత్ పదగతౌ ఇత్యస్మాద్ధాతోః సకర్మకాత్కర్తరి భూతే లిట్, ఆత్మనేపదీ ప్రథమపురుష రూపాః ప్రపేదే – ప్రపేదాతే – **ప్రపేదిరే.**

***అలంకారములు :–*** ఇట 'ఉపమాలంకారో'మున్నదని చెప్పదగును. కావ్యాదర్శః 2-14.

***లక్షణము :– శ్లో॥ యథా కథంచిత్ సాదృశ్యం యత్రోద్భూతం ప్రతీయతే।***
***'ఉపమా'నామ సా తస్యాః ప్రపంచేయం నిదర్శతే॥***

అన్వయము – సరళము. 

***అవతారికా :–*** నవయౌవన సమ్పన్నాయాః పార్వత్యాః అవయవవర్ణనమ్. నవయౌవన సంపన్నురాలైన పార్వతిదేవి యొక్క అవయవవర్ణనము.

**శ్లో॥ అసమ్భృతం మణ్డనమఙ్గయష్టే-**
**రనాసవాఖ్యం కరణం మదస్య ।**
**కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రం**
**బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే ॥ 31**

***పదవిభాగము :–*** అసమ్భృతమ్, మణ్డనమ్, అఙ్గయష్టేః, అనాసవాఖ్యమ్, కరణమ్, మదస్య, కామస్య, పుష్పవ్యతిరిక్తమ్, అస్త్రమ్, బాల్యాత్, పరమ్, సా, అథ, వయః, ప్రపేదే.

***అన్వయక్రమము :–*** అథ, సా, అంగయష్టేః, అసమ్భృతమ్, మణ్డనమ్, అనాసవాఖ్యమ్, మదస్య, కరణమ్, కామస్య, పుష్పవ్యతిరిక్తమ్, అస్త్రమ్, బాల్యాత్, పరమ్, వయః, ప్రపేదే.

***ప్రతిపదార్థము :–*** అథ = పిమ్మట, సా = ఆ పార్వతీదేవి, అంగయష్టేః = కఱ్ఱవంటి సన్నని దేహమునకు, అసంభృతమ్ = చేయని (సహజమైన), మణ్డనమ్ = అలంకార మైనట్టియు, అనాసవాఖ్యమ్ = ఆసవ మను పేరు లేనిదైన, మదస్య = ఉల్లాసమునకు,

కరణమ్ = సాధనమును, కామస్య = మన్మథునకు, పుష్పవ్యతిరిక్తమ్ = పూవుల కంటె వేఱయిన, అస్త్రమ్ = బాణమును, బాల్యాత్ = పసితనమున కన్న, పరమ్ = తరువాతిది యగు, వయః = వయస్సును, ప్రపేదే = పొందెను.

***తాత్పర్యము :–*** పిమ్మట, ఆ పార్వతీదేవి, కఱ్ఱవంటి సన్నని దేహమునకు చేయని అలంకారమైనట్టియు ఆసవమను పేరు లేనిదైన ఉల్లాసమునకు సాధనమును, మన్మథునకు పూవులకంటె వేఱయిన బాణమును, పసితనమున కన్న తరువాతిది యగు, వయస్సును పొందెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) అసంభృతమ్ – **అసంభృతమ్,** అసంభృతే, అసంభృతాని; అకారాన్త నపుంసకలింగ అసంభృత శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) మణ్డనమ్ – **మణ్డనమ్,** మణ్డనే, మణ్డనాని; అకారాన్త నపుంసకలింగ మణ్డన శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 3) అఙ్గయష్టేః – **అంగయష్టేః,** అంగయష్ట్యోః, అంగయష్టీనామ్; ఇకారాన్త స్త్రీలింగ అంగయష్టి శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) అనాసవాఖ్యమ్ – **అనాసవాఖ్యమ్,** అనాసవాఖ్యే, అనాసవాఖ్యాని; అకారాన్త నపుంసకలింగ అనాసవాఖ్య శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) కరణమ్ – **కరణమ్,** కరణే, కరణాని; అకారాన్త నపుంసకలింగ 'కరణ' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) మదస్య – **మదస్య,** మదయోః, మదానామ్; అకారాన్త పుంలింగ మద శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) కామస్య – **కామస్య,** కామయోః, కామానామ్; అకారాన్త పుంలింగ కామ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 8) పుష్పవ్యతిరిక్తమ్ – **పుష్పవ్యతిరిక్తమ్,** పుష్పవ్యతిరిక్తే, పుష్పవ్యతిరిక్తాని; అకారాన్త నపుంసకలింగ పుష్పవ్యతిరిక్త శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) అస్త్రమ్ – **అస్త్రమ్,** అస్త్రే, అస్త్రాని; అకారాన్త నపుంసకలింగ 'అస్త్ర' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) బాల్యాత్ – **బాల్యాత్,** బాల్యాభ్యామ్, బాల్యేభ్యః; అకారాన్త నపుంసకలింగ బాల్య శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 11) పరమ్ – **పరమ్,** పరే, పరాని; అకారాన్త నపుంసకలింగ పర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 13) అథ – అవ్యయము. 14) వయః – **వయః,** వయసీ, వయాంసి; సకారాన్త నపుంసకలింగ వయశ్శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 15) ప్రపేదే – క్రియ.

***సమాసాలు :–***

1) అంగయష్టేః – అంగం యష్టిరివ (ఉపమితకర్మధారయ) తస్య;
2) అసంభృతమ్ – న సంభృతమ్ (నఞ్ తత్పురుష);
3) అనాసవాఖ్యమ్ – ఆసవశ్చాసౌ ఆఖ్యా (కర్మధా.), అసవాఖ్యా, అవిద్యమానా అసవాఖ్యా యస్య (బహువ్రీహి) తత్; న ఆసవాఖ్యమ్, (నఞ్తత్పురుష) అనాసవాఖ్యమ్;
4) పుష్పవ్యతిరిక్తమ్ – విశేషేణ అతిరిక్తమ్, వ్యతిరిక్తమ్ (సుప్సుపా), పుష్పేభ్యః వ్యతిరిక్తమ్ (ష.త.).

***సంధులు:–***

1) సా + అథ – సాథ – సవర్ణదీర్ఘసన్ధిః

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **కామస్య –**



ఎ) శ్లో॥ ***అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా ।***
***నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః ॥***

1.అరవిందము, 2.అశోకము, 3.చూతము, 4.నవమల్లిక, 5.నీలోత్పలము

శ్లో॥ ***అరవిందమశోకం చ శిరీషం నీలముత్పలమ్ ।***
***చూతం చేతి ప్రకీర్త్యతే పంచబాణస్య సాయకాః ॥***

అంటే కొందరు 'నవమల్లిక'కు మాఱుగా 'శిరీష'ను పేర్కొన్నారు.

బి) శ్లో॥ ***సమ్మోహనోన్మాదనౌ చ శోషణస్తాపనస్తథా ।***
***స్తంభనశ్చేతి కామస్య పంచబాణాః ప్రకీర్తితాః ॥***

1.సమ్మోహనము, 2.ఉన్మాదనము, 3.శోషణము, 4.తాపనము, 5.స్తంభనము, ఇవి ఐదున్నూ మన్మథుని బాణములు.

2. The Sahityadarpana quotes this verse to illustrate 'యౌవనశోభా'; the Rasagangadhara, the Saraswathikantabharana, the Alankarasarvasva, the Alankarkaustubha and the Alankarasutra, refer to it in connection with the figure of speech 'విభావనా' and the Alankaratilaka refers to it as an instance of 'స్వజాతివ్యతిరేక'. -Karmarkar.

***క్రియాదర్శము :–*** ప్రపేదే – 30వ శ్లోకభాగ ధాతువివరణలో చూడదగును.

***అలంకారములు :–*** ఆలంకారికుల్లో దీనిపై భిన్నాభిప్రాయములున్నట్లు గమనింతురుగాక.

'సర్వత్ర విభావనేతి భోజరాజః । ద్వితీయపాద ఏవ విభావనేతి మంఖుకః। వామనః పునః ఏకగుణహానికల్పనాయాం సామ్యదార్ఢ్యం విశేషోక్తిః' ఇతి లక్షణమాశ్రిత్య విశేషోక్తిరలంకార ఇత్యుక్తవాన్। యౌవస్య మణ్డనత్వాది రూపణాద్ రూపకాలంకార ఏవ స్ఫుటః। సవ్యతిరేకం చేదం రూపకమిత్యస్మద్గురోరుపదేశః।।

అని 'నారాయణ' పండితుడు తన 'వివరణమ్' వ్యాఖ్యలో పేర్కొనినాడు. ✿

శ్లో॥ **ఉన్మీలితం తూలికయేవ చిత్రం**
**సూర్యాంశుభిర్భిన్నమివారవిన్దమ్ ।**
**బభూవ తస్యాశ్చతురస్రశోభి**
**వపుర్విభక్తం నవయౌవనేన ॥ 32**

***పదవిభాగము :–*** ఉన్మీలితమ్, తూలికయా, ఇవ, చిత్రమ్, సూర్యాంశుభిః, భిన్నమ్, ఇవ, అరవిన్దమ్, బభూవ, తస్యాః, చతురస్రశోభి, వపుః, విభక్తమ్, నవయౌవనేన.

***అన్వయక్రమము :–*** నవయౌవనేన, విభక్తమ్, తస్యాః, వపుః, తూలికయా, ఉన్మీలితమ్,

చిత్రమ్, ఇవ, సూర్యాంశుభిః, భిన్నమ్, అరవిందమ్, ఇవ, చతురస్రశోభి, బభూవ.

**ప్రతిపదార్థము :–** నవయౌవనేన = క్రొత్తవయసు చేత, విభక్తమ్ = ఏర్పడిన, తస్యాః = ఆ పార్వతీదేవి యొక్క, వపుః = శరీరము, తూలికయా = రంగులువేయు కుంచెతో, ఉన్మీలితమ్ = వన్నె పెట్టబడిన, చిత్రమ్ ఇవ = చిత్తరువు వలెను, సూర్యాంశుభిః = సూర్యకిరణముల చేత, భిన్నమ్ = విప్పబడిన, అరవిందమ్ + ఇవ = తామరపూవు వోలెను, చతురస్రశోభి = ఎక్కువ తక్కువలు లేక ప్రకాశించునది, బభూవ = ఆయెను.

**తాత్పర్యము :–** క్రొత్తవయస్సు చేత ఏర్పడిన ఆ పార్వతీదేవి యొక్క శరీరము, రంగులు వేయు కుంచెతో వన్నెపెట్టబడిన చిత్తరువువోలెను, సూర్యకిరణముల చేత విప్పబడిన తామరపూవువోలెను, ఎక్కువ తక్కువలు లేక ఆయెను.

**విభక్తులు / క్రియలు :–** 1) ఉన్మీలితమ్ – **ఉన్మీలితమ్,** ఉన్మీలితే, ఉన్మీలితాని; అకారాన్త నపుంసకలింగ ఉన్మీలిత శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) తూలికయా – **తూలికయా,** తూలికాభ్యామ్, తూలికాభిః; ఆకారాన్త స్త్రీలింగ తూలికాశబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) ఇవ – అవ్యయము. 4) చిత్రమ్ – **చిత్రమ్,** చిత్రే, చిత్రైః; అకారాన్త నపుంసకలింగ చిత్రశబ్దము, ద్వితీయావిభక్తి ఏ.వ. 5) సూర్యాంశుభిః–సూర్యాంశునా, సూర్యాంశుభ్యామ్, **సూర్యాంశుభిః;** ఉకారాన్త పుంలింగ 'సూర్యాంశు' శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 6) భిన్నమ్ – **భిన్నమ్**, భిన్నే, భిన్నాని; అకారాన్త నపుంసకలింగ భిన్న శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) అరవిన్దమ్ – **అరవిన్దమ్**, అరవిన్దే, అరవిన్దాని; అకారాన్త నపుంసకలింగ అరవిన్ద శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) బభూవ – క్రియ. 9) తస్యాః – **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) చతురస్రశోభి – **చతురస్రశోభి,** చతురస్రశోభినీ, చతురస్రశోభాని; నకారాన్త నపుంసకలింగ శోభిన్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 11) వపుః – **వపుః,** వపుసీ, వపూంసి; సకారాన్త నపుంసకలింగ 'వపుస్' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 12) విభక్తమ్ – **విభక్తమ్,** విభక్తే, విభక్తాని; అకారాన్త నపుంసకలింగ 'విభక్త' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 13) నవయౌవనేన – **నవయౌవనేన,** నవయౌవనాభ్యామ్, నవయౌవనైః; అకారాన్త నపుంసకలింగ 'నవయౌవన' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) నవయౌవనేన – నవం చ తద్ యౌవనమ్ (కర్మధా.) నవయౌవనమ్, తేన;

2) సూర్యాశుభిః – సూర్యస్య అంశవః (ష.త.) సూర్యాంశవః, తైః;

3) చతురస్రశోభి – చతస్రః అస్రయః యస్య (బహు) తత్ చతురస్రమ్, చతురస్రం శోభతే ఇతి (ఉపపద తత్పురుష) తత్.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **సూర్యాంశుభిః** – ఎ) సరతి ఆకాశే సూర్యః, 'సృగతౌ' ఇతిధాతోః

'రాజసూయ సూర్యమృషోద్యరుచ్యకుప్యకృష్టపచ్యావ్యథ్యాః' (3-1-44) ఇతి సూత్రేణ కర్తరి క్యప్, ప్రత్యయేన సాధుః। నిపాతనాదుత్వం చ। యద్వా 'షూప్రేరణే' ఇతి తౌదాదికాద్ధాతోః 'సువతికర్మణి లోకం ప్రేరయతి' ఇతి విగ్రహే పూర్వసూత్రాత్ క్యప్, తస్య రుట్ చ।



*శ్లో॥ ఆదిత్యః సవితా సహస్రకిరణః ప్రద్యోతనో భాస్కర –*
*స్తిగ్మాంశుస్తరణిస్తథా దినమణిర్భాస్వాన్వివస్వాన్హరిః ।*

*శ్లో॥ మార్తండస్తపనో వికర్తన ఇనః పూషా పతఙ్గో భగః*
*సూర్యో గోపతిరర్యమా దినకరః సూరోంశుమాలీ రవిః ॥ **35***

*శ్లో॥ మిహిరో విరోచనోఽర్కస్తిమిర రిపుర్ద్యుమణిరంశుమానంశుః ।*
*హరిదశ్వః సప్తాశ్వః ప్రభాకరో భానుమాన్భానుః ॥ **36***

*శ్లో॥ బ్రధ్నో హంసః ఖగో మిత్రశ్చిత్రభానురహర్పతిః ।*
*కర్మసాక్షీ జగచ్చక్షుర్ద్వాదశాత్మా త్రయీతనుః ॥*

అని హలాయుధము '47' నామములను సూర్యశబ్దానికి అందించగా 'అభిధాన చిన్తామణి' 72 నామములను పేర్కొన్నది.

బి) 'అంశు' శబ్దానికి 'అభిధానచిన్తామణి' 39 నామములను అందించగా హలాయుధ కోశము '32' నామములను పేర్కొన్నది.

అంశుః –పుం, అంశయతి ఇతి। (అంశ్ విభాజనే, మృగయ్వాదయశ్చ ఉణాదిసూత్రమ్ – 37. ఏతే కుప్రత్యయాన్తా నిపాంత్యన్తే।....ఆకృతిగణోఽయమ్)

*శ్లో॥ రోచిః శోచిరభీశుః ప్రద్యోతగభస్తిరశ్మి ఘృణికిరణాః ।*
*రుచిరుగ్దీధితిదీప్తిద్యుతి ప్రభాభావిభాభాసః ॥ **38***

*శ్లో॥ ఉస్రధామ వసుకేతుమరీచి ప్రగ్రహోపధృతివృష్ణిమయూఖాః ।*
*అంశుభానుకరపాదవిరోకా గావ ఇత్యభిహితాస్తు సమానాః ॥ **39***

2. **చతురస్రశోభి –** చతస్రః అస్రయః యస్యాః సా. చతురస్రా శోభా యస్య తత్। lit. Possessed of beauty in four parts, that is, possessing perfect, all round beauty.

The expression చతురస్ర occurs in రఘువంశమ్ 4-10.

***"మనుష్యవాహ్యం చతురస్రయానమధాస్య కన్యా పరివారశోభి।"***

In the reading 'చతురస్రశోభి', భి is to be taken as a long syllable, being at the end of a పాద. The Trivandrum edition reads శోభమ్. Youth did not import any outside beauty into her body; the beauty was already there, it was merely revealed by youth.... The saraswati kantabharanam quotes this verse to illustrate 'యౌవనసంపద్' The కావ్యాలంకారసూత్రవృత్తి remarks అత్ర చతురస్రశోభి న యుక్తమ్। -Karmarkar.

***క్రియాదర్శము :–*** బభూవ – 23వ శ్లోక వ్యాఖ్యాన భాగమును చూడగలరు.

***అలంకారములు :–*** ఇందు 'మాలోపమాలంకార'మున్నదని చెప్పదగును.

యౌవనాంకురముచేత పార్వతీదేవి సర్వాంగశోభితయైనదను దానిని రంగులువేయు కుంచెతో వన్నెపెట్టబడిన చిత్తరువుతోను, సూర్యకిరణములచేత విప్పబడిన తామరపూవు తోను వర్ణించి చెప్పబడుటచే ఇట 'మాలోపమాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :–*** పూర్వము చెప్పబడినది.



***అవతారికా :–*** దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠప్రభృతి వర్ణ్యతే. మానవానాం కేశాదరభ్యేతి ధార్మికాః. సమ్ప్రతి సప్తదశభిః శ్లోకైః పాదాదికేశాన్తవర్ణనమారభతే.

పార్వతీదేవిని పాదాది శిఖాంతముగా వర్ణించుచున్నాడు. దేవతలను పాదాది శిరోంతముగా, మానవులను శిఖాది పాదాంతముగా వర్ణింతురు. '17' శ్లోకములచే పార్వతీదేవి నట్లే వర్ణించుచున్నాడు.

**శ్లో॥ అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభి–**
**ర్నిక్షేపణాద్రాగమివోద్గిరన్తౌ ।**
**ఆజహ్రతుస్తచ్చరణౌ పృథివ్యాం**
**స్థలారవిన్దశ్రియమవ్యవస్థామ్ ॥ 33**

***పదవిభాగము :–*** అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభిః, నిక్షేపణాత్, రాగమ్, ఇవ, ఉద్గిరన్తౌ, ఆజహ్రతుః, తచ్చరణౌ, పృథివ్యామ్, స్థలారవిన్దశ్రియమ్, అవ్యవస్థామ్.

***అన్వయక్రమము :–*** అభ్య....ప్రభాభిః, నిక్షేపణాత్, రాగమ్, ఉద్గిరన్తౌ, ఇవ, తచ్చరణౌ, పృథివ్యామ్, అవ్యవస్థామ్, స్థలా...శ్రియమ్, ఆజహ్రతుః.

***ప్రతిపదార్థము :–*** అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభిః = ఎత్తైన బొటనవ్రేళ్ల గోళ్లయొక్క కాంతుల మూలమున, నిక్షేపణాత్ = నిబ్బరంగా ఉంచుట చేత, రాగమ్ = ఎఱుపును, ఉద్గిరన్తౌ ఇవ = వెడలుగ్రక్కుచున్నవో యనునట్లున్న, తచ్చరణౌ = ఆ పార్వతీదేవి యొక్క పాదములు, పృథివ్యామ్ = భూమియందు, అవ్యవస్థామ్ = ఒకచోట నిలిచియుండని, స్థలారవిన్దశ్రియమ్ = మెట్టతామరపూవు శోభను, ఆజహ్రతుః = హరించినవి.

***తాత్పర్యము :–*** ఎత్తైన బొటనవ్రేళ్ళ గోళ్ళయొక్క కాంతులమూలమున, నిబ్బరంగా ఉంచుటచేత ఎఱుపును వెడలుగ్రక్కుచున్నవో యనునట్లున్న ఆ పార్వతీదేవియొక్క పాదములు, భూమియందు ఒకచోట నిలిచియుండని మెట్టతామరపూవు శోభను హరించినవి.

(ఎఱ్ఱని పాదములుండుట – దేవతలకును, మహారాణులకును సహజలక్షణమని సాముద్రికము)



***శ్లో॥ యస్యా రక్తతలౌ పాదావున్నతాగ్రౌ తలస్పృశౌ ।***
***నిగూఢగుల్ఫౌ నిహతౌ సా స్యాన్నృపతిసమ్మతా ॥***

***విభక్తులు / క్రియలు :–*** 1) అభ్య...ప్రభాభిః – ప్రభయా, ప్రభాభ్యామ్, **ప్రభాభిః;** ఆకారాన్త స్త్రీలింగ ప్రభా శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 2) నిక్షేపణాత్ – **నిక్షేపణాత్,** నిక్షేపణాభ్యామ్, నిక్షేపణేభ్యః; అకారాన్త నపుంసకలింగ నిక్షేపణ శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 3) ఇవ – అవ్యయము. 4) రాగమ్ – **రాగమ్,** రాగౌ, రాగాన్; అకారాన్త పుంలింగ రాగ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) ఉద్గిరన్తౌ – ఉద్గిరాన్తః, **ఉద్గిరాన్తౌ,** ఉద్గిరాన్తాః; అకారాన్త పుంలింగ 'ఉద్గిరాన్త' శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 6) ఆజహ్రతుః – క్రియ. 7) తచ్చరణౌ – తచ్చరణః, **తచ్చరణౌ,** తచ్చరణాః; అకారాన్త పుంలింగ 'చరణ' శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 8) పృథివ్యామ్ – **పృథివ్యామ్,** పృథివ్యోః, పృథివీషు; ఈకారాన్త స్త్రీలింగ పృథివీ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) స్థలారవిన్దశ్రియమ్ – **స్థలారవిన్దశ్రియమ్,** శ్రియౌ, శ్రియః; ఈకారాన్త స్త్రీలింగ శ్రీ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) అవ్యవస్థామ్ – **అవ్యవస్థామ్,** అవ్యవస్థే, అవ్యవస్థాః; ఆకారాన్త స్త్రీలింగ 'అవ్యవస్థా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభిః – అంగుష్ఠయోః నఖౌ (ష.త.) అంగుష్ఠనఖౌ, అంగుష్ఠనఖయోః ప్రభా (ష.త.), అంగుష్ఠనఖప్రభా, అభ్యున్నతా చాసౌ అంగుష్ఠనఖప్రభా (కర్మధా.) అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభా, తాభిః;
2) తచ్చరణౌ – తస్యాః చరణౌ (ష.త.);
3) అవ్యవస్థామ్ – అవిద్యమానా వ్యవస్థా యస్యాః (బహువ్రీహి) సా, తామ్;
4) స్థలారవిందశ్రియమ్ – స్థలారవిందస్య శ్రీః (ష.త.) తామ్.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **పృథివ్యాం** – ఎ) "పృథివ్యాం త్రీణి రత్నాని జలమన్నం సుభాషితమ్."

బి) 1) పృథవీ – స్త్రీ 'ప్రథేః షివన్ సంప్రసారణఞ్చ' ఇతి కస్యచిన్మతే షవన్, షిత్వాద్ జీష్.

2)పృథివి – స్త్రీ. పృథివీ + జీషో వా హ్రస్వః.

3) పృథివీ – స్త్రీ. ప్రథతే విస్తారం యాతీతి. ప్రథ్ + ప్రథేః షివన్ సంప్రసారణఞ్చ ఇతి షివన్ సంప్రసారణం చ జీష్.

సి) ***శ్లో॥ భూర్భూమిః పృథివీ పృథ్వీ వసుధోర్వీ వసుంధరా ।***
***ధాత్రీ ధరిత్రీ ధారణీ విశ్వా విశ్వమ్భరా ధరా ॥***
***శ్లో॥ క్షితిః క్షోణీ క్షమాఽనన్తా జ్యా కుర్వసుమతీ మహీ ।***
***గౌర్గోత్రా భూతధాత్రీ క్ష్మా గన్ధమాతాఽచలాఽవనిః ॥ 2***
***శ్లో॥ సర్వంసహా రత్నగర్భో జగతీ మేదినా రసా ।***
***కాశ్యపీ పర్వతాధారా స్థిరేలా రత్నబీజాసూః ॥ 3***

***శ్లో॥ విపులా సాగరాచ్చాగ్రే స్యుర్నేమీమేఖలామ్బరాః ।***

అని అభిధానచిన్తామణి 'పృథివీ' శబ్దానికి '43' నామములను పేర్కొనగా హలాయుధ కోశము '37' నామములను పేర్కొన్నది.

డి) 'పృథివ్యాపస్తేజో వాయురాకాశమితి భూతాని' గౌ.న్యా.సూ. 1-1-13.

ఇ) **భూమి** – మన సౌరకుటుంబములో నాభిస్థానములో సూర్యుడు, దాని చుట్టూ దీర్ఘవృత్తాకారకక్ష్యలో పరిభ్రమిస్తూ నవగ్రహాలు, ఆ గ్రహాలలో కొన్ని గ్రహాల చుట్టూ పరిభ్రమిస్తూ ఉపగ్రహాలు; ఇవి గాక అనేక శకలాలు ఉన్నాయి. భూమి కు ముఖ్యంగా 4 రకాల చలనాలుంటాయి. 1) తన చుట్టూ తాను తిరగటం, 2) సూర్యుని చుట్టూ పరిభ్రమించటం, 3) Woobling action 4) సౌరకుటుంబంతో సహా **వేగానక్షత్రం** వైపు అత్యన్తవేగంగా ప్రయాణించటం.

మన సౌరకుటుంబంలో భూమి సూర్యుని నుండి 3వ ఉపగ్రహము. భూమి విశిష్ట గురుత్వం ఎక్కువ, పరిమాణము చిన్నది. భూవ్యాసార్థము 6378 కి.మీ. భూమి Geoid ఆకారములో ఉంటుంది. ధృవప్రాంతాలు చదునుగా, భూమధ్యరేఖా ప్రాంతం ఉబ్బెత్తుగాను ఉండి 'నారింజపండు' వలె ఉంటుంది. భూమధ్యరేఖ పొడవు 39000 కి.మీ.

భూమిని శాస్త్రజ్ఞులు 3 పొరలుగా విభజించినారు. అవి 1) భూపటలం, 2) భూ ప్రావారము, 3) భూకేంద్రమండలము. –అస్తు.

ఎఫ్) 'అభిజ్ఞానశాకున్తలమ్' నాటక ప్రథమాంకమున మంగళాచరణ శ్లోకమున శివ భగవానుని అష్టమూర్తులలో 'పృథివీ' రూపము స్మరింపబడినది.

***శ్లో॥ యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ***
***యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్।***
***యామాహుః సర్వబీజప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవంతః***
***ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః॥ 1***

జి) శ్రీ శంకరాచార్య విరచిత శ్రీ దక్షిణామూర్తిస్తోత్రమునందు '9' శ్లోకమును ఇచట అనుసంధానము చేసికొనదగును.

***శ్లో॥ భూ రంభాంస్యనలోఽనిలోంబరమహర్నాథో హిమాంశుః పుమాన్***
***ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।***
***నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః***
***తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥ 9***

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునకు మానసోల్లాసమనుపేర అతివిస్తృతవ్యాఖ్యను శ్రీ సురేశ్వరాచార్యులువారు అందించినారు. –అస్తు



హెచ్) భూమాత – ఉన్నది అనంతం, చెప్పేది, చెప్పిందీ అతి సూక్ష్మము. ఏవరి భావజాలము వారిది.

**క్రియాదర్శము:– ఆ+జహ్రతుః**– హృఞ్ (హృ) హరణే –(తీసుకొని పోవుట, దొంగిలించుట, నాశము చేయుట) – భ్వాదిప్రకరణమ్ (1), అనిట్, ద్వికర్మకమ్, (ఉభయ) పరస్మైపదీ, లిట్ ప్రథమపురుష ద్వివచనము. రూపాలు – ఆజహార – **ఆజహ్రతుః** – ఆజహ్రుః.

**అలంకారములు :–** ఇట 'నిదర్శనాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము :–** కా. నిదర్శనా

అభవన్ వస్తుసంబన్ధ ఉపమాపరికల్పకః. కావ్యప్రకాశము 10–10.

సంభవించని, కుదరని పదార్థముల లేదా వాక్యార్థముల సంబంధం 'ఉపమ' ను కల్పించినట్లయితే అది నిదర్శనాలంకారమగును. –బాలానందిని.

ఉపమేయము : పార్వతీదేవియొక్క చరణములు

ఉపమానధర్మము : తామరపూవుల శోభ

సంభవించని పదార్థము – అవ్యవస్థామ్.



**శ్లో॥ సా రాజహంసైరివ సన్నతాఙ్గీ**
**గతేషు లీలాఞ్చితవిక్రమేషు ।**
**వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధై –**
**రాదిత్సుభిర్నూపురశిఞ్జితాని ॥ 34**

**పదవిభాగము :–** సా, రాజహంసైః, ఇవ, సన్నతాఙ్గీ, గతేషు, లీలాఞ్చిత విక్రమేషు, వ్యనీయత, ప్రత్యుపదేశలుబ్ధైః, ఆదిత్సుభిః, నూపురశిఞ్జితాని.

**అన్వయక్రమము :–** ప్రత్యుపదేశలుబ్ధైః, నూపురశిఞ్జితాని, ఆదిత్సుభిః, రాజహంసైః, సన్నుతాఙ్గీ, సా, లీలాఞ్చిత విక్రమేషు, గతేషు, వ్యనీయత, ఇవ.

**ప్రతిపదార్థము :–** ప్రత్యుపదేశలుబ్ధైః = ప్రత్యుపదేశము నందు కోరికలవియు, నూపురశిఞ్జితాని = అందెల రవళిని, ఆదిత్సుభిః = పొందగోరినవియు నగు, రాజహంసైః = రాయంచల చేత, సన్నతాఙ్గీ = వంగిన దేహము గలదైన, సా = ఆ పార్వతీదేవి, లీలాఞ్చితవిక్రమేషు = విలాసములచే నొప్పుచున్న మెట్టులు గల, గతేషు = నడకల యందు, వ్యనీయత + ఇవ = నేర్పబడెనా యేమి యనునట్లుండెను.

**తాత్పర్యము :–** ప్రత్యుపదేశమునందు కోరిక కలవియు, అందెలరవళిని పొందగోరినవియు నగు రాయంచలచేత, వంగిన దేహముగలదైన ఆ పార్వతీదేవి విలాసములచే ఒప్పుచున్నట్లుగా మెట్టుచు నడువనేర్పినవా యనునట్లుండెను.

**విభక్తులు / క్రియలు :–** 1) ప్రత్యుపదేశలుబ్ధైః – ప్రత్యుపదేశలుబ్ధేన, ప్రత్యుపదేశలుబ్ధాభ్యామ్, **ప్రత్యుపదేశలుబ్ధైః,** అకారాన్త పుంలింగ ప్రత్యుపదేశలుబ్ధ శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 2) నూపురశిఞ్జితాని – నూపురశిఞ్జితమ్, నూపురశిఞ్జితే, **నూపురశిఞ్జితాని;** అకారాన్త నపుంసకలింగ శిఞ్జిత శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 3) ఆదిత్సుభిః – ఆదిత్సునా, ఆదిత్సుభ్యామ్, **ఆదిత్సుభిః;** ఉకారాన్త పుంలింగ ఆదిత్సు శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 4) రాజహంసైః – రాజహంసేన, రాజహంసాభ్యామ్, **రాజహంసైః;** అకారాన్త పుంలింగ రాజహంస శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 5) సన్నతాఙ్గీ – **సన్నతాఙ్గీ,** సన్నతాఙ్గ్యౌ, సన్నతాఙ్గ్యః; ఈకారాన్త స్త్రీలింగ సన్నతాఙ్గీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) లీలాఞ్చితవిక్రమేషు – విక్రమే, విక్రమయోః, **విక్రమేషు;** అకారాన్త నపుంసకలింగ విక్రమ శబ్దము, సప్తమీవిభక్తి బహువచనము. 8) గతేషు – గత, గతయోః, **గతేషు;** అకారాన్త నపుంసకలింగ గత శబ్దము, సప్తమీవిభక్తి బహువచనము. 9) ఇవ – అవ్యయము. 10) వ్యనీయత – క్రియ.

**సమాసాలు :–**

1) ప్రత్యుపదేశలుబ్ధైః – ఉపదేశస్య ప్రతిదానమ్ (ప్రాదితత్పురుష), ప్రత్యుపదేశే లుబ్ధాః (స.త.) తైః;
2) నూపురశిఞ్జితాని – నూపురయోః శిఞ్జితమ్ (ష.త.), నూపురశిఞ్జితమ్, తాని;
3) రాజహంసైః – హంసానాం రాజానః, రాజహంసాః, తైః;
4) సన్నతాఙ్గీ – సన్నతాని అంగాని యస్యాః (బహువ్రీహి) సా;
5) లీలాఞ్చితవిక్రమేషు – లీలయా అఞ్చితాః (తృ.త.), విక్రమా యేషు (బహువ్రీహి) తాని, లీలాఞ్చితవిక్రమాణి, తేషు.

**సంధులు :–**

1) రాజహంసైః + ఇవ = రాజహంసైరివ, విసర్గసన్ధిః.
2) లీలా + అంచిత = లీలాఞ్చిత, సవర్ణదీర్ఘసన్ధిః.
3) ప్రతి + ఉపదేశ = ప్రత్యుపదేశ, యణాదేశసన్ధిః.
4) ...లుబ్ధైః + ఆదిత్సుభిః = ...లుబ్ధైరాదిత్సుభిః, విసర్గసన్ధిః.
5) ఆదిత్సుభిః + నూపుర = ఆదిత్సుభిర్నూపుర..., విసర్గసన్ధిః.

**పాఠాంతరాలు :–** 1) విక్రమేషు – విభ్రమేషు. 2) సన్నతాఙ్గీ – సంనతాంసా

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **రాజహంసైః –**

ఎ) రాజహంస శబ్దము – జాతివాచకము. రాజదన్తాది తరగీతి. 'కృష్ణసర్ప' వలె నిత్యసమాసమని కొందఱి అభిప్రాయము.

*శ్లో॥ మేఘశ్యామా దిశో దృష్ట్వా – మానసోత్సుక చేతసామ్ ।*
*కూజితం రాజహంసానాం – నేదం నూపురశిఞ్జితమ్ ॥*

–విక్రమోర్వశీయమ్ *4-14.*



"మేఘావరణముచే నల్లనైన దిక్కులను చూచి, మానససరోవరమునకు వెళ్ళవలయునను ఉత్సాహముతో కూయుచున్న రాజహంసల కూజితమే కాని ఇది ఆమె అందెల రవళి కాదు.

బి) ముగ్ధమనోహరులగు స్త్రీల గమనము, రాజహంసల నడక వలె గాని, లేదా గజగమనము వలె గాని ఉంటుందని చెబుతారు.

*శ్లో॥ "భవనదీర్ఘికామత్తమరాళికాగమనరీత్యా లీలాలసగతివిలాసమ్"* – ద.కు.

*శ్లో॥ యది హంస గతా న తే నతభ్రూః*
*సరసో రోధసి దర్శనం ప్రియా మే ।*
*మదఖేలపదం కథం ను తస్యాః*
*సకలం చౌర! గతం త్వయా గృహీతమ్ ॥* విక్రమోర్వశీయమ్ *4-16*

*శ్లో॥ "హంస ప్రయచ్ఛ మే కాన్తాం గతిస్తస్యాస్త్వయా హృతా।" 4-17*

సి) *"హంసాస్తు శ్వేతాగరుతశ్చక్రాఙ్గా మానసౌకసః ।*
*రాజహంసాస్తు చఞ్చుచరణైర్లోహితైః సితాః ॥* *ఇతి సింహః ।*

2. **సంనతాంసా–** The Trivandrum edition reads సంనతాంసా which is also a good reading and would provide another ground for similarity between the Swans and Parvathi. The Swans have slightly bent shoulders. (స్మర్తవ్యాః శిథిలాంసహంసరుచయః గోదావరీవీచయః। quotated by Arunagirinadha) Having a slightly bent shoulder is a sing of auspiciousness in woman also (సంనతాంసాః స్త్రియః పూజ్యా ఉన్నతాంసాస్తు పూరుషాః । ఇతి సాముద్రిక – ప్రసిద్ధిః। - Karmakar.

3. ప్రత్యుపదేశలబ్ధైః –

*శ్లో॥ గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ఘనేన వా ।*
*అథవా విద్యయా విద్యా చతుర్థీ నోపపద్యతే ॥*

విద్యను నేర్చుకొనదలచినవారు పై న్యాయము ప్రకారము విద్య ద్వారా విద్యను నేర్చుకొనుటకు అవకాశమున్నదని పెద్దలందురు. ఈ శ్లోకము నందు రాజహంసలు, పార్వతీదేవి అను ఇద్దరు తమతమ వద్దనున్న విద్యను ఒకరు మరొకరికి నేర్పిరి అను భావమును మహాకవి శ్రీ కాళిదాసు మనోహరంగా పార్వతీదేవివద్ద నడుచునపుడు అందెలను మనోహరంగా చప్పుడు చేయించు విద్య ఉన్నది. రాజహంసలకడ 'నడక' అను విద్య ఉన్నది. హంసలు తమ అందమైన నడకను పార్వతీదేవికి నేర్పగా, ఆమె నడకలోని అందెలరవళిని తమ కూతల రూపమున హంసలు నేర్చుకొన్నవని భావము.

***క్రియాదర్శము :–*** **వ్యనీయత** – వ్యుపసర్గపూర్వకాత్, ణీఞ్ నీ ప్రాపణే (తీసుకొని వెళ్ళుట) ఇతి ధాతోః కర్మణి లఙ్. 'సార్వధాతుకే యక్' ఇతి యక్ ప్రత్యయః । వి+నీ+య+లఙ్. ప్రథమపురుష ఏకవచనమ్, ఆత్మనేపదీ రూపమ్. (ఉభయపదీ) భ్వాదిప్రకరణమ్. సకర్మకమ్, అకర్మకమ్.

ప్రథమపురుషరూపాలు : **వ్యనీయత** – వ్యనీయేతామ్ – వ్యనీయన్తామ్.

***అలంకారములు :–*** అత్ర ఉత్ప్రేక్షాలంకారః। తల్లక్షణం యథా

సాహిత్యదర్పణే – **'భవేత్సమ్భావనోత్ప్రేక్షా ప్రకృతస్య పరాత్మనా'** ఇతి అస్యా హంసగమనమిత్యుత్ప్రేక్షా।



**శ్లో॥ వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే**
**జఙ్ఘే శుభే సృష్టవతస్తదీయే ।**
**శేషాఙ్గనిర్మాణవిధౌ విధాతు –**
**ర్లావణ్య ఉత్పాద్య ఇవాస యత్నః ॥ 35**

***పదవిభాగము :–*** వృత్తానుపూర్వే, చ, న, చ, అతిదీర్ఘే, జఙ్ఘే, శుభే, సృష్టవతః, తదీయే, శేషాఙ్గనిర్మాణవిధౌ, విధాతుః, లావణ్యే, ఉత్పాద్యే, ఇవ, ఆస, యత్నః.

***అన్వయక్రమము :–*** వృత్తానుపూర్వే, న, చ, అతిదీర్ఘే, శుభే, తదీయే, జఙ్ఘే, సృష్టవతః, విధాతుః, శేషాఙ్గనిర్మాణవిధౌ, ఉత్పాద్యే, లావణ్యే, యత్నః, ఆస, ఇవ.

***ప్రతిపదార్థము :–*** వృత్తానుపూర్వే = (వృత్త + అనుపూర్వే) – గుండ్రనివియు ఆదోకలను (గోవు తోకవలె నున్నవనుట), నచ అతిదీర్ఘే = మిక్కిలి పొడవు కానివియు, శుభే = మంగళప్రదములును గల, తదీయే = ఆ పార్వతీదేవివి యగు, జఙ్ఘే = క్రీగాళ్ళను (మోకాలి నుండి మడమ వఱకు ఉన్న కాలి యొక్క భాగము), సృష్టవతః = సృజించిన, విధాతుః = బ్రహ్మయొక్క, శేషాఙ్గనిర్మాణవిధౌ = మిగిలిన అవయవముల సృష్టిక్రియయందు, ఉత్పాద్యే = మరల సమకూర్చుకొనవలసిన, లావణ్యే = కాంతివిషయమై, యత్నః = ప్రయత్నము, ఆస ఇవ = కలిగెనేమో యనునట్లుండెను.

***తాత్పర్యము :–*** గుండ్రంగాను, ఆదోకగాను, మిక్కిలి పొడవు కానివియు, మంగళప్రదములును గల ఆ పార్వతీదేవివి యగు క్రీగాళ్ళను సృజించిన బ్రహ్మయొక్క మిగిలిన అవయవముల సృష్టి క్రియ యందు మరల సమకూర్చుకొనవలసిన కాంతి విషయమై ప్రయత్నము కలిగెనేమో యనునట్లుండెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) వృత్తానుపూర్వే – వృత్తానుపూర్వమ్, **వృత్తానుపూర్వే,** వృత్తానిపూర్వాని; అకారాన్త నపుంసకలింగ వృత్తానుపూర్వ శబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 2) చ, న – అవ్యయాలు. 3) అతిదీర్ఘే – అతిదీర్ఘమ్, **అతిదీర్ఘే,** అతిదీర్ఘాని; అకారాన్త నపుంసకలింగ అతిదీర్ఘ శబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 4) జఙ్ఘే – జఙ్ఘమ్, **జఙ్ఘే,** జఙ్ఘాని; అకారాన్త నపుంసకలింగ జఙ్ఘ శబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 5) శుభే – శుభమ్, **శుభే,** శుభాని; అకారాన్త నపుంసకలింగ శుభ శబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 6) తదీయే – తదీయమ్, **తదీయే,** తదీయాని; అకారాన్త నపుంసకలింగ తదీయశబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 7) సృష్టవతః – **సృష్టవతః,** సృష్టవతోః, సృష్టవతామ్; తకారాన్త పుంలింగ సృష్టవత్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 8) శేషాఙ్గనిర్మాణవిధౌ – **విధౌ,** విధోః, విధిషు; ఇకారాన్త పుంలింగ ...విధి శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) విధాతుః – **విధాతుః,** విధాత్రోః, విధాతౄణామ్, ఋకారాన్త పుంలింగ విధాతృ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) లావణ్యే – **లావణ్యే,** లావణ్యయోః, లావణ్యేషు; అకారాన్త నపుంసకలింగ లావణ్య శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) ఉత్పాద్యే – **ఉత్పాద్యే,** ఉత్పాద్యయోః, ఉత్పాద్యేషు; అకారాన్త నపుంసకలింగ ఉత్పాద్య శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 12) ఇవ – అవ్యయము. 13) యత్నః – **యత్నః,** యత్నౌ, యత్నాః; అకారాన్త పుంలింగ యత్న శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 14) ఆస – అవ్యయము / క్రియ / క్రియావ్యయము. వ్యాఖ్యానకారుల్లో భిన్నాభిప్రాయమున్నది.



***సమాసాలు :–***

1) వృత్తానుపూర్వే – వృత్తే చ తే అనుపూర్వే (కర్మధా.) వృత్తానుపూర్వే; అనుపూర్వే – పూర్వమనగతా (ప్రాదితత్పురుష.) అనుపూర్వా, తే;
2) అతిదీర్ఘే – అత్యన్తం దీర్ఘా (సుప్సుపా) అతిదీర్ఘా, తే;
3) శేషాఙ్గనిర్మాణవిధౌ – శేషాణి అఙ్గాని (కర్మధా.) శేషాఙ్గాని, నిర్మాణస్య విధిః (ష.త.) నిర్మాణవిధిః, శేషాఙ్గానాం నిర్మాణవిధిః (ష.త.) శేషాఙ్గనిర్మాణవిధిః; తస్మిన్.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **ఆస –** ఎ) ఆసేతి బభూవార్థే తిఙన్త ప్రతిరూపక మవ్యయమిత్యాహ శాకటాయనః।

బి) వల్లభస్తు – తిఙన్త ప్రతిరూపకమవ్యయమ్ 'ఆస్తేర్భూః' ఇతి భ్వాదేశనియమాత్ తాదృక్ తిఙన్తస్యైవాభావాత్, కిం తు కవీనాం అయం ప్రామాదికః ప్రయోగః –ఇత్యాహ।

సి) వామనస్తు – 'అస గతిదీప్త్యాదానేష్వితి ధాతోర్లిటి రూపమిదమ్' ఇత్యాహ అస ఇత్యనుదాత్తేద్దీప్త్యర్థే – ఆసదిదీపే – ప్రవృత్త ఇత్యర్థః

డి) We think it best to agree with vallabha (కవీనాం అయం ప్రామాదికః ప్రయోగః) and say that this is a case of poetical license. -RD Karmarkar.

ఇ) 'మల్లినాథుడు' – దీని విషయమై వామనుడు, శకటాయనుడు, వల్లభుడు అనువార్ల (ముగ్గురి) అభిప్రాయములను తన వ్యాఖ్యలో ప్రతిపాదించినాడు.

ఎఫ్) మహాకవి శ్రీకాళిదాసు ఈ క్రియావ్యయాన్ని 'రఘువంశమ్' లో మూడు చోట్ల ప్రయోగించుట గమనించదగినది.

*శ్లో॥ జ్యానినాదమథ గృహ్ణతీ తయోః*
*ప్రాదురాస బహులక్షపాఛవిః । .... 11–15,*

*శ్లో॥ ....నిష్ప్రభవశ్చ రిపురాస భూభృతాం*
*ధూమశేష ఇవ ధూమకేతనః ॥ 11–81*

శ్లో॥ ....*తేనాస లోకః పితృమాన్ వినేత్రా*
*తైనైవ శోకాపనుదేన పుత్రీ* ॥ **14-23.**

జి) **"ఆస బభూవార్థే"** -అవ్యయకోశః (185)

"లావణ్యఉత్పాద్య ఇవాస యత్నః'। అస్య భాదిత్వం బోధ్యమ్ । కేచిత్తు నిపాతావ్యయ సంజ్ఞామస్యాహుః । వామనస్తు 'అస గతిదీప్త్యాదానేషు' (భ్వాది, సకర్మకమ్, సేట్, ఉభయపదీ) ఇత్యస్మాత్ లిటి రూపం సాధయిత్వాస్యానవ్యయమిచ్ఛతీతి వర్ధమానః । వల్లభస్తు తిజన్త ప్రతిరూపకో నిపాత ఇతి నాభ్యుపగచ్ఛతీతి గణరత్నే ప్రతిపాదితమ్। వస్తుతస్తు సర్వశిష్టసమ్మతత్వాత్, తిజన్తప్రతిరూపకమప్యస్త్వేవేతి భాష్యాదిషు స్పష్టమితి అన్యత్ర విస్తరః।

***క్రియాదర్శము :-*** పైన చేయబడినది.

***అలంకారములు :-*** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

పార్వతీదేవి క్రీగాళ్ళను సృజించుటకే బ్రహ్మదేవుడు తన దగ్గరున్న లావణ్యము వ్యయమైనందున, మిగిలిన అవయవములను సృజించుటకు నూతన లావణ్యమును సమకూర్చుకొనుటకు అధికప్రయత్నము చేయవలెను గదా యని చెప్పబడుటచే నిది 'ఉత్ప్రేక్షాలంకార'మనదగును.

***లక్షణము :-*** పూర్వము చెప్పబడినది. 'చిత్రమీమాంసా' ఈ శ్లోకాన్ని ఉత్ప్రేక్షాలంకారమునకు 'ఉదాహరణ' గా పేర్కొన్నది.



శ్లో॥ **నాగేన్ద్రహస్తాస్త్వచికర్కశత్వా -**
**దేకాన్తశైత్యాత్కదలీవిశేషాః ।**
**లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం**
**జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః ॥** **36**

***పదవిభాగము :-*** నాగేన్ద్రహస్తాః, త్వచికర్కశత్వాత్, ఏకాన్తశైత్యాత్, కదలీవిశేషాః, లబ్ధ్వా, అపి, లోకే, పరిణాహి, రూపమ్, జాతాః, తదూర్వోః, ఉపమానబాహ్యాః.

***అన్వయక్రమము :-*** నాగేన్ద్రహస్తాః, త్వచికర్కశత్వాత్, కదలీవిశేషాః, ఏకాన్తశైత్యాత్, లోకే, పరిణాహి, రూపమ్, లబ్ధ్వా, అపి, తదూర్వోః, ఉపమానబాహ్యాః, జాతాః.

***ప్రతిపదార్థము :-*** నాగేన్ద్రహస్తాః = గజేంద్రముల తుండములు, త్వచి = చర్మమునందు, కర్కశత్వాత్ = గఱుకు గలవగుటవలనను, కదలీవిశేషాః = విశేషములయిన అరటులు, ఏకాన్తశైత్యాత్ = కేవలము చల్లని వగుటవలనను, లోకే = పుడమిలో, పరిణాహి = విశాలమైన, రూపమ్ = ఆకారమును,లబ్ధ్వా+అపి = పొందియు, తదూర్వోః = ఆ పార్వతీ దేవి తొడలకు, ఉపమానబాహ్యాః = సామ్యమునకు బయటివై (సాటివి కానివి), జాతాః = అయినవి.



***తాత్పర్యము :-*** గజేంద్రముల తుండములు చర్మమునందు గఱుకు గలవగుటవలనను, విశేషములైన యరటులు కేవలము చల్లనివగుటవలనను, పుడమిలో విశాలమునైన ఆకారమును పొందియు, ఆ పార్వతీదేవి తొడలకు సాటివి కానివాయెను.

***విభక్తులు / క్రియలు :-*** 1) నాగేంద్రహస్తాః - నాగేంద్రహస్తః, నాగేంద్రహస్తౌ, **నాగేంద్రహస్తాః;** అకారాన్త పుంలింగ 'నాగేంద్రహస్త' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 2) త్వచి కర్కశత్వాత్ - ...**కర్కశత్వాత్,** కర్కశత్వాభ్యామ్, కర్కశత్వేభ్యః; అకారాన్త నపుంసకలింగ త్వచి కర్కశత్వ శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 3) ఏకాన్తశైత్యాత్ - **ఏకాన్తశైత్యాత్,** ఏకాన్తశైత్యాభ్యామ్, ఏకాన్తశైత్యేభ్యః; అకారాన్త నపుంసకలింగ ఏకాన్తశైత్య శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 4) కదలీవిశేషాః - కదలీవిశేషః, కదలీవిశేషౌ, **కదలీవిశేషాః;** అకారాన్త పుంలింగ కదలీవిశేష శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 5) లబ్ధ్వా - కృదన్తావ్యయము. 6) అపి - అవ్యయము. 7) లోకే - **లోకే,** లోకయోః, లోకేషు; అకారాన్త పుంలింగ లోక శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 8) పరిణాహి - **పరిణాహి,** పరిణాహినీ, పరిణాహీని; నకారాన్త నపుంసకలింగ 'పరిణాహిన్' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) రూపమ్ - **రూపమ్,** రూపే, రూపాణి; అకారాన్త నపుంసకలింగ రూప శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) జాతాః - జాతా, జాతే, **జాతాః;** ఆకారాన్త స్త్రీలింగ జాతా శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 11) తదూర్వోః - తదూరోః, **తదూర్వోః,** తదూరూనామ్; ఉకారాన్త స్త్రీలింగ 'తదూరు' శబ్దము, షష్ఠీవిభక్తి ద్వివచనము. 12) ఉపమానబాహ్యాః - బాహ్యా, బాహ్యే, **బాహ్యాః;** ఆకారాన్త స్త్రీలింగ '...బాహ్యా' శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :-***

1) నాగేన్ద్రహస్తాః - నాగానాం ఇంద్రాః (ష.త.) నాగేంద్రాః, నాగేంద్రాణాం హస్తాః (ష.త.);
2) త్వచికర్కశత్వాత్ - త్వచి కర్కశత్వాత్ (అలుక్ తత్పురుష) 'అమూర్ధమస్తకాత్ స్వాఙ్గాదకామే' (సూ 6-3.12) ఇత్యలుక్.
3) కదలీవిశేషాః - కదలీనాం విశేషాః (ష.త.);
4) ఏకాంతశైత్యాత్ - ఏకాన్తం శైత్యమ్ (కర్మధా.) తస్మాత్;
5) తదూర్వోః - తస్యా ఊరూ (ష.త.), తయోః;
6) ఉపమానబాహ్యాః - ఉపమానే బాహ్యాః (స.త.).

***సంధులు :-***

1) నాగేంద్రహస్తాః + త్వచి... = నాగేంద్రహస్తాస్త్వచి..., విసర్గసన్ధిః;
2) లబ్ధ్వా + అపి = లబ్ధ్వాపి, సవర్ణదీర్ఘసన్ధిః;
3) జాతాః + తదూర్వోః = జాతాస్తదూర్వోః, విసర్గసన్ధిః;
4) తదూర్వోః + ఉపమానబాహ్యాః = తదూర్వోరుపమానబాహ్యాః, విసర్గసన్ధిః.

***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.***

1. **అపి -** అవ్యయకోశః (88) ఎ) ***"...బన్ధస్థగనోపగమేష్వపి".***

1) బన్ధే - 'వితత్య శార్ఙ్గం కవచం పినహ్య।' భట్టికావ్యమ్ 3-47.
2) స్థగనే - 'అశ్వాః పృథుర్వసుమతీమతిరోచమానాః...' మాఘే 5-4

3) ఉపగమే – 'అథేతరే దుఃఖమేవాపి యన్తి।'

బి) పదార్థ – సంభావనా – న్వవసర్గ – గర్హా – సముచ్చయరూపార్థేషు కర్మప్రవచనీయ త్వమస్యైవ।

1) పదార్థః – అప్రయుక్తపదస్యార్థః। తస్మిన్ యథా– 'పరిశేషం న నామాపి స్థాపయిష్యతి తే ప్రభుః। –భట్టికావ్యమ్ 8-91.

2) సమ్భావనాయామ్ – 'అపి స్థాణుం జయేద్ రామో భవతో గ్రహణం కియత్।' భ.కా. 8-91.

3) అన్వవసర్గః – కామచారానుజ్ఞా। తస్మిన్ యథా – 'అపి స్తు హ్యాపి సేధాస్మాంస్తథ్యముక్తం నరాశన' –భ.కా. 8-92.

4) గర్హాయామ్ – 'అపి సిఞ్చః కృశానౌ త్వమ్...' భ.కా. 8-92.

5) సముచ్చయే – అపి సిఞ్చ అపి స్తుహి। సిఞ్చ, స్తుహి చేత్యర్థః।

సి) వీప్సాశీమృతిభూషాపేక్షాప్రశ్నబాధార్థేష్వపి దృశ్యతే।

1) వీప్సాయామ్ – 'యేపీన్ద్రపాణితులితాయుధలూనపక్షాః' మాఘే 5-31

2) అశిషి – 'అపి నః స కులే భూయాత్।' భద్రమపి।।

3) మృతౌ – మరణమపి।

4) భూషాయామ్ – అపి నిహ్యతి హారమ్।

5) అపేక్షాయామ్ – 'అపి గృహ్ణీయాం వేదమ్।

6) ప్రశ్నే – 'అపి కుశలమమర్త్యాః' –చంపూరామాయణే।

7) బాధార్థే – అపి, కుర్యామ్

2. **కదలీవిశేషాః** – కదలీవిశేషాః విశిష్టాః కదల్యః, నతు సామాన్యకదల్యః। నన్దనోద్యానాదిప్రరూఢాః కనకకదళీకాండా ఇతిభావః। యథోక్తం సౌందర్యలహర్యాం. "కరీంద్రాణాం శుండాః కనకకదలీకాండపటలీముభాభ్యామూరుభ్యాముభయమపి నిర్జిత్యభవతీ" ఇతి –

***క్రియాదర్శము :–***

***అలంకారములు :–*** ఇట 'వ్యతిరేకాలంకార'మున్నదని చెప్పదగును.

ఇట ఉపమేయమగు పార్వతీదేవియొక్క ఊరుద్వయమునకు, ఉపమానములగు గజేంద్రముల తుండములు, విశేషములైన అరటులు సాటివి కావు అని చెప్పబడుటచే నిది వ్యతిరేకాలంకారము.

***లక్షణము :– 'ఆధిక్యమపమేయస్యోపమానాన్న్యూనతాథ వా।***

***వ్యతిరేఖః...ఇతి. సాహిత్యదర్పణే 10-52.***





**శ్లో॥ ఏతావతా నన్వనుమేయశోభి**
**కాఞ్చీగుణస్థానమనిన్దితాయాః ।**
**ఆరోపితం యద్గిరిశేన పశ్చా-**
**దనన్యనారీకమనీయమఙ్కమ్ ॥ 37**

***పదవిభాగము :–*** ఏతావతా, నను, అనుమేయశోభి, కాంచీగుణస్థానమ్, అనిన్దితాయాః, ఆరోపితమ్, యత్, గిరిశేన, పశ్చాత్, అనన్యనారీకమనీయమ్, అఙ్కమ్.

***అన్వయక్రమము :–*** యత్, పశ్చాత్, గిరిశేన, అనన్యనారీకమనీయమ్, అఙ్కమ్, ఆరోపితమ్, అనిన్దితాయాః, కాంచీగుణస్థానమ్, ఏతావతా, నను, అనుమేయశోభి.

***ప్రతిపదార్థము :–*** యత్ = దేనిచేత, పశ్చాత్ = తపశ్చర్యానంతరము, గిరిశేన = శివుని చేత, అనన్యనారీకమనీయమ్ = ఇతర స్త్రీలను కోరుటకర్హముకాని, అఙ్కమ్ = తొడను, ఆరోపితమ్ = ఎక్కించుకొనబడినదో, అనిన్దితాయాః = దోషరహిత యగు పార్వతీదేవి యొక్క, కాంచీగుణస్థానమ్ = మొలనూలితావు అనగా పిఱుదు, ఏతావతా నను = దాని చేతనే, అనుమేయశోభి = ఊహింపదగిన శోభ గలది. (ఆసీత్)

***తాత్పర్యము :–*** దేనిచేత దోషరహితమగు పార్వతీదేవి యొక్క మొలనూలితావు అనగా పిఱుదు, తపశ్చర్యానంతరము, శివునిచేత ఇతర స్త్రీలకు కోరుటకర్హము కాని తొడను ఎక్కించుకొనబడిన దానిచేత ఊహింపదగిన శోభగలదాయెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) ఏతావతా – **ఏతావతా**, ఏతావద్భ్యామ్, ఏతావద్భిః; తకారాన్త స్త్రీలింగ 'ఏతావత్' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 2) నను – అవ్యయము. 3) అనుమేయశోభి – **అనుమేయశోభి,** అనుమేయశోభినీ, అనుమేయశోభీని; ఇకారాన్త నపుంసకలింగ శోభి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) కాంచీగుణస్థానమ్ – **కాంచీగుణస్థానమ్,** స్థానే, స్థానాని; అకారాన్త నపుంసకలింగ ...స్థాన శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) అనిన్దితాయాః – **అనిన్దితాయాః**, అనిన్దితయోః, అనిన్దితానామ్; ఆకారాన్త స్త్రీలింగ 'అనిన్దితా' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 6) ఆరోపితమ్ – **ఆరోపితమ్,** ఆరోపితే, ఆరోపితాని; అకారాన్త నపుంసకలింగ ఆరోపిత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) యత్ – అవ్యయము. 8) గిరిశేన – **గిరిశేన,** గిరిశాభ్యామ్, గిరిశైః; అకారాన్త పుంలింగ గిరిశ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) పశ్చాత్ – అవ్యయము. 10) అనన్యనారీకమనీయమ్ – **అనన్యనారీకమనీయమ్,** ...కమనీయౌ, ...కమనీయాన్; అకారాన్త పుంలింగ ...కమనీయ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) అఙ్కమ్ – **అఙ్కమ్,** అఙ్కౌ, అఙ్కాన్; అకారాన్త పుంలింగ అఙ్క శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) గిరిశేన – గిరౌ శేతే గిరిశః (అలుక్ సమాస తత్పురుష), తేన;

2) అనన్యనారీకమనీయమ్ – అన్యాశ్చ తా నార్యః (కర్మధా.) అన్యనార్యః, అన్యనారీణాం కమనీయః (ష.త.) న అన్యనారీకమనీయః (నఞ్ తత్పురుష) తమ్;

3) అనిన్దితాయాః – న నిన్దితా, అనిన్దితా (నఞ్ త.) తస్యాః;

4) కాంచీగుణస్థానమ్ – కాంచ్యా గుణాః (ష.త.) కాంచీగుణాః, కాంచీగుణస్య స్థానమ్ (ష.త.);

5) అనుమేయశోభి – అనుమేయా శోభా యస్య (బహువ్రీహి) తత్.

**సంధులు :–**

1) నను + అనుమేయ = నన్వనుమేయ, యణాదేశసన్ధిః, ఇకో యణచి.

2) యత్ + గిరిశేన = యద్గిరిశేన, జశ్త్వసన్ధిః, ఝలాం జశోఽన్తే.

3) పశ్చాత్ + అనన్య = పశ్చాదనన్య.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **నను** – అవ్యయకోశః (455)

ఎ) పరమతాక్షేపానుజ్ఞాపృష్టప్రతివచనప్రశ్ననయవిరోధోక్తి వ్యాక్యారమ్భ నిశ్చయాదయోఽస్యార్థాః।

1) పరమతాక్షేపే – "నను వక్తృవిశేషనిఃస్పృహా గుణగృహ్యా వచనే విపశ్చితః।" (కిరాత. 2–5)

2. అనుజ్ఞాయామ్ – 'నను సన్దిశేతి సుదృశోదితయా త్రపయా న కించన కిలాభిదధే।' మాఘః 9–61.

3) పృష్టప్రతివచనే – 'ఆకార్షీః కటం దేవదత్త। నను కరోమి భోః'

4) ప్రశ్నే – నను గచ్ఛసి।

5) నయే – 'ఆపదో నన్వహో వన్ధ్యాః సారాసారవివేచికాః।

6) విరోధోక్తౌ – 'నను వా ఇదమపి తుభ్యమ్।'

7) వాక్యారమ్భే – 'నను అపోహస్త్వవదుచ్యతే।

8) నిశ్చయే – 'లోకో దేవం సమాలోక్య ఉదాసీనో భవేన్నను। (భారతే 13–6–19)

బి) అవధారణా నునయామంత్రణామర్షాదయోఽపి అస్యార్థాః। యథా

1) అవధారణే – 'ఉపపన్నం నను శివం సప్తస్వఙ్గేషు యస్య మే। రఘు 1–60

2) అనునయే – 'నను సమర్థోఽసి, త్వమేవ విపణిం గచ్ఛ'.

3) ఆమన్త్రణే – 'నను మాం ప్రాపయ ప్రత్యురన్తికమ్' (కుమార. 4–32)

4) అమర్షే – 'నను సర్వ ఏవ సమవేక్ష్య కమపి గుణమేతి పూజ్యతామ్'
మాఘః 15–19

సి) వినయవినిగ్రహపరకృతిసంభ్రమాదయోఽపి అర్థాః కోశేషు నిర్దిష్టాః యథానుగుణం కావ్యేషు ద్రష్టవ్యాః।

*శ్లో॥ మన్యే శఙ్కే ధ్రువం మానం కింవా ప్రాయోఽనువేద్మి చ।*
*నను నామ హి జానామి ఉత్ప్రేక్షా వ్యంజకాని చ॥*



ఇతి కావ్యచన్ద్రికా వచనాదస్యోత్ప్రేక్షావ్యంజకత్వమపి సిద్ధమేవ।

2. **కాంచీగుణస్థానమ్** – మేఖలాసూత్రస్థలమ్ – నితమ్బబిమ్బమ్.

ఎ) శ్లో॥ *కాంచీపదం కలత్రం జఘనం శ్రోణీ కకుద్మతీ జ్ఞేయా।*
*ఆరోహశ్చ నితమ్బః కటీ కటీరం త్రికస్థానమ్ ॥* హలా. 512.

బి) 'యాతం యచ్చ నితమ్బయోర్గురుతయా మందం విలాసాదివ' –అ.శా. 2.2

సి) శ్లో॥ *నితమ్బబిమ్బైస్సదుకూలమేఖలైః*
*స్తనైః సహారాభరణైః సచన్దనైః।* ఋతుసంహారః 1–4

హారములతో కూడిన చందనముతో కూడిన స్తనములచే, పట్టుకోకలతోను, మొల నూళ్ళతోను కూడిన గుండ్రని పిఱుదులచే .....

డి) శ్లో॥ *విలాసినీ విభ్రమదన్తపత్రం – ఆపాణ్డురం కేతకబర్హమన్యః ।*
*ప్రియా నితమ్బోచిత సన్నివేశైః – విపాటయామాస యువా నఖాగ్రైః॥*
*–రఘువంశమ్ 6–17.*

ఇ) నితమ్బః, పుం. –హలాయుధకోశ వ్యాఖ్య.

"నిభృతం తమ్యతే ఆకాజ్క్యతే పర్వతీయైః కాముకైరితి వా।
తము కాంక్షాయామ్ + 'ఉల్బాదయశ్చేతి' సాధుః। యద్వా నితమ్బతి పీడయతి నాయకచిత్తమితి। ని+తమ్బ హింసాయామ్+అచ్"

3. **అనుమేయశోభి –**

ఎ) The reading 'అనుమేయశోభి' cannot properly be explained. Mallinatha tries somehow to justify that form with the help of 'త్వప్రత్యయస్తు గతార్థత్వాత్ న ప్రయుక్తః' of vamana (శోభతే ఇతి శోభి ఆవశ్యకే ణినిః తతః త్వప్రత్యయః। అనుమేయం శోభిత్వం శోభా యస్య తత్ అనుమేయశోభి) –Karmarkar.

బి) Some Explain it as 'అనుమేయం యథా తథా శోభి; cf.Supra చతురస్రశోభి. It may also be explained as అనుమేయేన శోభతే ఇతి తచ్ఛీలమ్. –Kale.

***క్రియాదర్శము :–***

***అలంకారములు :–*** ఇట 'అనుమానాలంకార'మున్నదని చెప్పదగును.

పార్వతీదేవి పిఱుదులు మాత్రమే శివభగవానుని తొడను అధిష్టించుననుటచే అది ఊహింపతగిన శోభ గలదనుటచే నిది అనుమానాలంకారమగును.

***లక్షణము :– కా. అనుమానం తదుక్తం యత్సాధ్యసాధనయోర్వచః ।*** – కా.ప్ర. 10–117.

సాధ్యసాధనములయొక్క ఏ చెప్పడం ఉన్నదో అది 'అనుమానాలంకారం' గా చెప్పబడినది.



**శ్లో॥ తస్యాః ప్రవిష్టా నతనాభిరన్ధ్రం**
**రరాజ తన్వీ నవరోమరాజిః ।**
**నీవీమతిక్రమ్య సితేతరస్య త-**
**న్మేఖలామధ్యమణేరివార్చిః ॥ 38**

**పదవిభాగము :–** తస్యాః, ప్రతిష్టా, నతనాభిరన్ధ్రమ్, రరాజ, తన్వీ, నవరోమరాజిః, నీవీమ్, అతిక్రమ్య, సితేతరస్య, తన్మేఖలామధ్యమణేః, ఇవ, అర్చిః.

**అన్వయక్రమము :–** నీవీమ్, అతిక్రమ్య, నతనాభిరన్ధ్రమ్, ప్రవిష్టా, తన్వీ, తస్యాః, నవరోమరాజిః, సితేతరస్య, తన్మేఖలామధ్యమణేః, అర్చిః, ఇవ, రరాజ.

**ప్రతిపదార్థము :–** నీవీమ్ = పోకముడిని (కోక ముడిని), అతిక్రమ్య = దాటి, నతనాభిరన్ధ్రమ్ = లోతయిన నాభి రంధ్రమును, ప్రవిష్టా = ప్రవేశించిన, తన్వీ = సన్నపాటిదైన, తస్యాః = ఆ పార్వతీదేవి యొక్క, నవరోమరాజిః = **క్రొత్తనూగారు**, సితేతరస్య = నల్లనైన, తన్మేఖలామధ్యమణేః = ఆ పార్వతీదేవి ఒడ్డాణముయొక్క నడుమనున్న ఇంద్రనీలమణి యొక్క, అర్చిః ఇవ = కాంతియో యనునట్లు, రరాజ = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** పోకముడిని దాటి లోతైన నాభిరంధ్రమును ప్రవేశించిన సన్నపాటిదగు ఆ పార్వతీదేవి యొక్క క్రొత్తనూగారు, నల్లనైన ఆ పార్వతీదేవి ఒడ్డాణముయొక్క నడుమనున్న ఇంద్రనీలమణి యొక్క కాంతియో యనునట్లు ప్రకాశించెను.

**విభక్తులు / క్రియలు :–** 1) తస్యాః – **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) ప్రవిష్టా – **ప్రవిష్టా,** ప్రవిష్టే, ప్రవిష్టాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రవిష్టా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) నతనాభిరన్ధ్రమ్ – **నతనాభిరన్ధ్రమ్,** ...రన్ధ్రే, ...రన్ధ్రాని; ఆకారాన్త నపుంసకలింగ 'నతనాభిరన్ధ్ర' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 4) రరాజ – క్రియ. 5) తన్వీ – **తన్వీ,** తన్వ్యౌ, తన్వ్యః; ఈకారాన్త స్త్రీలింగ తన్వీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6) నవరోమరాజిః – **నవరోమరాజిః,** ...రాజీ, ...రాజయః; ఇకారాన్త స్త్రీలింగ నవరోమరాజి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) నీవీమ్ – **నీవీమ్,** నీవ్యౌ, నీవీః; ఈకారాన్త స్త్రీలింగ నీవీ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) అతిక్రమ్య – ల్యబన్తము. 9) సితేతరస్య – **సితేతరస్య,** సితేతరయోః, సితేతరాణామ్; అకారాన్త పుంలింగ సితేతర శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) తన్మేఖలామధ్యమణేః – **...మణేః,** మణ్యోః, మణీనామ్; ఇకారాన్త పుంలింగ ...మణి శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) ఇవ – అవ్యయము. 12) అర్చిః – **అర్చిః,** అర్చిసీ, అర్చాంసి; సకారాన్త నపుంసకలింగ 'అర్చిస్' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–**

1) నతనాభిరంధ్రమ్ – నాభేః రంధ్రమ్ (ష.త.) నాభిరంధ్రమ్, నతఞ్చ తత్ నాభిరంధ్రమ్ (కర్మధా.) నతనాభిరంధ్రమ్;
2) నవరోమరాజిః – నవాని చ తాని రోమాణి (కర్మధా.) నవరోమ్ణాం రాజిః (ష.త.), నవరోమరాజిః;
3) సితేతరస్య – సితాద్ ఇతరః (పంచమీతత్పురుష) సితేతరః, తస్య;
4) తన్మేఖలామధ్యమణేః – తస్యాః మేఖలా (ష.త.) తన్మేఖలా, మధ్యశ్చాసౌ మణిః, మధ్యమణిః (కర్మధా.), తన్మేఖలాయా మధ్యమణిః (ష.త.) తన్మేఖలామధ్యమణిః, తస్య.



***సంధులు :–***

1) మణేః + ఇవ = మణేరివ, విసర్గసన్ధిః;
2) ఇవ + అర్చిః = ఇవార్చిః, సవర్ణదీర్ఘసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **నీవామ్ –** ఎ) "పరిధానాంశుకగ్రన్థిః ప్రోక్తా నీవీ తథోచ్చయః॥" హ.కో. 547

బి) "నివ్యయతి, నీవీయతే వా। ని+వ్యేఞ్+నౌ **వ్యో మలోపః పూర్వస్య చ దీర్ఘః** (ఉణాది సూత్రమ్ 4-137) ఇతి ఇఞ్, యలోపః, నిశబ్దస్య దీర్ఘత్వం చ। తత్ కృదికారాదితి వా జీష్".

సి) ***శ్లో॥ ఏకవస్త్రా త్వథో నీవీ రోదమానా రజస్వలా' –ఇతి మహాభారతే 2-63/19***

డి) నీవీం విస్రస్య పరిహితవస్త్రస్య వామాంగగ్రన్థిం యోచయిత్వా ఆచమానమాహ బౌధాయనః – ఇతి యజుర్వేదిశ్రాద్ధతత్త్వమ్.

ఇ) *శ్లో॥ జాలాన్తరప్రేషితదృష్టిరన్యా*
*ప్రస్థానభిన్నాం న బబన్ధ నీవీమ్ ।*
*నాభిప్రవిష్టా భరణప్రభేణ*
*హస్తేన తస్థావవలమ్బ్య వాసః ॥* రఘువంశమ్ 7-9.

ఇంకొక స్త్రీ కిటికీలోని దృష్టిని సారించి, వేగముగా నడుచుటవలన జారిన కోకముడిని మఱల బిగించలేదు. కాని చేతికి ఉన్న మణితో పొదగబడిన, ఆభరణముల నుండి వచ్చు కాంతులను బొడ్డు లోనికి ప్రవేశింపజేయు చేతితో ఆ వస్త్రమును పట్టుకొని కిటికీ వద్దకు నడిచెను.

ఎఫ్) మేఘదూతమున యక్షుడు–యక్షిణిని వర్ణించిన భాగమును ఇచట అనుసంధానము చేసుకొనదగును. (78) వ శ్లోకమును క్షుణ్ణంగా అధ్యయనం చేయుదురు గాక.

***శ్లో॥ తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబిమ్బాధరోష్ఠీ***
***మధ్యేక్షామా చకితహరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః ।***
***శ్రోణీభారదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం***
***యాతత్ర స్యాద్యువతివిషయే సృష్టిరాద్యేవ ధాతుః ॥***

(ఇచట – మేఘదూతమ్ – మృణాళినీవ్యాఖ్యా – చూడదగును)

"...బ్రహ్మయొక్క ప్రథమ సృష్టివలె ఏ యువతి యా భవనమున ఉండునో" ఇందు మహాకవి శ్రీకాళిదాసు – స్త్రీల విషయమున ఉండవలసిన లక్షణములన్నింటిని సాముద్రిక

శాస్త్రానుసారము ప్రతిపాదించినాడు. బ్రహ్మదేవుని రచన అత్యన్త సౌభాగ్యవంతమని భావము.

***క్రియాదర్శము :–*** **రరాజ** – రాజృ (దీప్తౌ) ప్రకాశించుట, భ్వాదిప్రకరణమ్ (1), అకర్మకమ్, సేట్, (ఉభయ) పరస్మైపదీ. భూతానద్యతనపరోక్షేలిట్.

ప్రథమపురుష రూపాలు : **రరాజ** – రేజతుః/రరాజతుః – రేజుః/రరాజుః

***అలంకారములు :–*** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– కా: సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్***

***–కావ్యప్రకాశే –10–91.***

పార్వతీదేవి యొక్క లోతైన బొడ్డు రంధ్రమున ప్రవేశించిన క్రొత్తనూగారు, ఆ పార్వతీదేవి యొక్క ఒడ్డాణము నడుమనున్న ఇంద్రనీలమణి యొక్క కాంతియో యనునట్లు ప్రకాశించెనని చెప్పబడుటనే నిది 'ఉత్ప్రేక్షాలంకార'మని చెప్పబడును. ❀

**శ్లో॥ మధ్యేన సా వేదివిలగ్నమధ్యా**
**వలిత్రయం చారు బభార బాలా ।**
**ఆరోహణార్థం నవయౌవనేన**
**కామస్య సోపానమివ ప్రయుక్తమ్ ॥ 39**

***పదవిభాగము :–*** మధ్యేన, సా, వేదివిలగ్నమధ్యా, వలిత్రయమ్, చారు, బభార, బాలా, ఆరోహణార్థమ్, నవయౌవనేన, కామస్య, సోపానమ్, ఇవ, ప్రయుక్తమ్.

***అన్వయక్రమము :–*** వేదివిలగ్నమధ్యా, సా, బాలా, మధ్యేన, చారు, వలిత్రయమ్, కామస్య, ఆరోహణార్థమ్, నవయౌవనేన, ప్రయుక్తమ్, సోపానమ్, ఇవ, బభార.

***ప్రతిపదార్థము :–*** వేదవిలగ్నమధ్యా = యజ్ఞవేదిక యొక్క నడుము వంటి నడుము గలదైన, సా = ఆ, బాలా = కన్య, మధ్యేన = నడుముమీద, చారు = సుందరమైన, వలిత్రయమ్ = మూడు మడతలును, కామస్య = మన్మథునికి, ఆరోహణార్థమ్ = ఎక్కుట కొఱకు, నవయౌవనేన = లేత్రాయముచేత, ప్రయుక్తమ్ = చేయబడిన, సోపానమ్ ఇవ = మెట్లవరుసయో యనునట్లు, బభార = ధరించెను.

***తాత్పర్యము :–*** యజ్ఞవేదిక నడుమువంటి నడుము గలదైన ఆ పార్వతీదేవి నడుము మీద సుందరమైన వలిత్రయమును, మన్మథుడెక్కుటకై, లే ప్రాయముచేత చేయబడిన మెట్లవరుసయో యనునట్లు ధరించెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) మధ్యేన – **మధ్యేన,** మధ్యాభ్యామ్, మధ్యైః; అకారాన్త పుంలింగ మధ్య శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 2) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) వేది...మధ్యా – **మధ్యా,** మధ్యే, మధ్యాః; ఆకారాన్త స్త్రీలింగ 'వేదివిలగ్నమధ్యా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.



4) వలిత్రయమ్ – **వలిత్రయమ్,** వలిత్రయే, వలిత్రయాణి; అకారాన్త నపుంసకలింగ వలిత్రయ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) చారు – **చారు,** చారునీ, చారుని; ఉకారాన్త నపుంసకలింగ చారు శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) బభార – క్రియ. 7) ఆరోహణార్థమ్ – **ఆరోహణార్థమ్,** ఆరోహణార్థే, ఆరోహణార్థాని, అకారాన్తనపుంసకలింగ, ఆరోహణార్థశబ్దం ప్రథమావిభక్తి ఏకవచనం, 8) నవయౌవనేన – **నవయౌవనేన,** నవయౌవనాభ్యామ్, నవయౌవనైః; అకారాన్త నపుంసకలింగ నవయౌవన శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) కామస్య – **కామస్య,** కామయోః, కామానామ్; అకారాన్త నపుంసకలింగ కామ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) ఇవ – అవ్యయము. 11) సోపానమ్ – **సోపానమ్,** సోపానే, సోపానాని; అకారాన్త నపుంసకలింగ 'సోపాన' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 12) ప్రయుక్తమ్ – **ప్రయుక్తమ్,** ప్రయుక్తే, ప్రయుక్తాని, అకారాన్త నపుంసకలింగ 'ప్రయుక్త' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) వేదివిలగ్నమధ్యా – వేదిః ఇవ విలగ్నః మధ్యః యస్యాః (బహువ్రీహి) సా;

2) వలిత్రయమ్ – వలీనాం త్రయమ్ (ష.త.);

3) నవయౌవనేన – నవఞ్చ తద్ యౌవనమ్ (కర్మధా.) నవయౌవనమ్ తేన;

4) ఆరోహణార్థమ్ – ఆరోహణాయ ఇదమ్ (చతుర్థీతత్పురుష)

***సంధులు :–*** 1) ఆరోహణ + అర్థమ్ = ఆరోహణార్థమ్, సవర్ణదీర్ఘసన్ధిః

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **ఆరోహణార్థమ్**–ఎ) ఆరోహణాయ ఇదమ్ ఆరోహణార్థమ్. (సోపానమ్ ఇతస్య విశేషణమ్)

'చతుర్థీ తదర్థాబలిహితసుఖరక్షితైః' (సూ 2–1–35) చతుర్థ్యన్తము తదర్థవాచకము తోను, అర్థ, బలి, హిత, సుఖ, రక్షిత ప్రకృతిక సుబన్తములతో వికల్పముగ సమసించును. (ఇందు అర్థశబ్దముతో సమాసము నిత్యము. విశేష్యలిఙ్గతయును విహితము) 'అర్థేన నిత్యసమాసో విశేష్యలిఙ్గతా చేతి వక్తవ్యమ్' ఇతి చతుర్థీతత్పురుషసమాసః

2. **వలిత్రయమ్ –** Parvati's waist was thin and she had three very charming folds on her belly. A thin waist and folds on the belly are regarded as signs of great beauty. ...This verse is quoted in the 'సువృత్తతిలకా' with the remark స్వరూపవర్ణనం యథా కాలిదాసస్య. - R D Karmarkar.

ఎ) 'సౌధారోహణపరిపాఠ్యా వలిత్రయం' –దశకుమారచరిత్ర.

బి) 'మధ్యేఽ స్యాస్త్రివలీతరంగవిషమే।' –రత్నావళి 2–11

సి) 'వితతవలివిభావ్యపాణ్డులేఖా।' –శిశుపాలవధ 7–33.

***క్రియాదర్శము :–*** **బభార** – భృఞ్ (భృ) భరణే (పోషించుట, రక్షించుట) భ్వాదిప్రకరణమ్ (1). సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లిట్

ప్రథమపురుషరూపాలు – **బభార** – బభ్రతుః – బభ్రుః

ఉత్తమపురుష ఏకవచనము కూడ 'బభార' గానే ఉంటుంది.

***అలంకారములు :–*** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

'వలిత్రయమును మెట్లవరుసయో యనునట్లుత్ప్రేక్షించబడినది.'



**శ్లో॥ అన్యోన్యముత్పీడయదుత్పలాక్ష్యాః**
**స్తనద్వయం పాణ్డు తథా ప్రవృద్ధమ్।**
**మధ్యే యథా శ్యామముఖస్య తస్య**
**మృణాలసూత్రాన్తరమప్యలభ్యమ్॥ 40**

***పదవిభాగము :–*** అన్యోన్యమ్, ఉత్పీడయత్, ఉత్పలాక్ష్యాః, స్తనపద్వయమ్, పాణ్డు, తథా, ప్రవృద్ధమ్, మధ్యే, యథా, శ్యామముఖస్య, తస్య, మృణాలసూత్రాన్తరమ్, అపి, అలభ్యమ్।

***అన్వయక్రమము :–*** అన్యోన్యమ్, ఉత్పీడయత్, పాణ్డు, ఉత్పలాక్ష్యాః, స్తనద్వయమ్, యథా, తథా, ప్రవృద్ధమ్, శ్యామముఖస్య, తస్య, మధ్యే, మృణాలసూత్రాన్తరమ్, అపి, అలభ్యమ్ (ఆసీత్).

***ప్రతిపదార్థము :–*** అన్యోన్యమ్ = పరస్పరమును, ఉత్పీడయత్ = రాచుకొనుచు, పాణ్డు = పాణ్డువర్ణముగలదైన, ఉత్పలాక్ష్యాః = కలువలవంటి కన్నులుగలదైన పార్వతీదేవి యొక్క, స్తనద్వయమ్ = చనుగవ; యథా, తథా = ఏరీతి గానుండవలెనో ఆరీతిగా, ప్రవృద్ధమ్ = వృద్ధినిపొందెను, శ్యామముఖస్య = నల్లని మొనలుగలిగినట్టి, తస్య = ఆ చనుగవ యొక్క, మధ్యే = మధ్యభాగమునందు, మృణాలసూత్రాన్తరమ్ అపి = తామరతూటి దారమంత యెడమున్నూ, అలభ్యమ్ = పొందశక్యము కాదు (ఆసీత్ = ఆమెను).

***తాత్పర్యము :–*** పరస్పరమును రాచుకొనుచు, పాణ్డువర్ణము గలదైన కలువల వంటి కన్నులు గలదైన పార్వతీదేవి యొక్క చనుగవ ఏరీతిగా నుండవలెనో ఆ రీతిగా వృద్ధిని పొందెను. నల్లని మొనలు గలిగినట్టి ఆ చనుగవ యొక్క మధ్యభాగము నందు తామరతూటి దారమంత యెడమున్ను పొందశక్యము కాదాయెను.(ఉత్తమస్త్రీయొక్క స్తనముల మధ్య యెడము లేకుండుటయు, నెడమున్నచో జారిణి యగుటయు కలాశాస్త్రమున చెప్పబడినది. – వావిళ్ళ.)

***విభక్తులు / క్రియలు :–*** 1) అన్యోన్యమ్–అవ్యయము. విపులవివరణకై ఆప్టే చూడగలరు. 2)ఉత్పీడయత్ – **ఉత్పీడయత్,** ఉత్పీడయతౌ, ఉత్పీడయతః; తకారాన్త పుంలింగ ఉత్పీడయత్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) ఉత్పలాక్ష్యాః – **ఉత్పలాక్ష్యాః,** ఉత్పలాక్ష్యోః, ఉత్పలాక్షీణామ్; ఈకారాన్త స్త్రీలింగ 'ఉత్పలాక్షీ' శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) స్తనద్వయమ్ – **స్తనద్వయమ్,** స్తనద్వయే, స్తనద్వయాని; అకారాన్త నపుంసకలింగ స్తనద్వయ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) పాణ్డు – **పాణ్డు,** పాణ్డునీ, పాణ్డుని; ఉకారాన్తనపుంసక లింగ పాణ్డుశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6) యథా, తథా – అవ్యయాలు. 7) ప్రవృద్ధమ్ – **ప్రవృద్ధమ్,** ప్రవృద్ధే, ప్రవృద్ధాని; అకారాన్తనపుంసకలింగ, ప్రవృద్ధశబ్దము, ప్రథమా విభక్తి ఏకవచనము. 8) మధ్యే – **మధ్యే,** మధ్యయోః, మధ్యేషు; అకారాన్తపుంలింగ మధ్యశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) శ్యామముఖస్య – **శ్యామముఖస్య,** శ్యామముఖయోః, శ్యామముఖానామ్; అకారాన్తనపుంసకలింగ శ్యామముఖ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 10) తస్య – **తస్య,** తయోః, తేషామ్; దకారాన్తనపుంసకలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) మృణాలసూత్రాన్తరమ్ –





**అన్తరమ్,** అన్తరే, అన్తరాని; అకారాన్తనపుంసక మృణాలసూత్రాన్తర శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 12) అపి – అవ్యయము. 13) అలభ్యమ్ – **అలభ్యమ్,** అలభ్యే, అలభ్యాని; అకారాన్తనపుంసకలింగ అలభ్యశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) ఉత్పలాక్ష్యాః – ఉత్పలే ఇవ అక్షిణీ యస్యాః (బహువ్రీహి) సా, ఉత్పలాక్షీ, తస్యాః.
2) స్తనద్వయమ్–స్తనయోః ద్వయమ& (ష. త).
3) ప్రవృద్ధమ్ – ప్రకర్షేణ వృద్ధమ్ (సుప్సుపాసమాసః).
4) శ్యామముఖస్య – శ్యామం ముఖం యస్య(బహువ్రీహి) తత్ శ్యామముఖమ్, తస్య.
5) మృణాలసూత్రాన్తరమ్ – మృణాలస్య సూత్రమ్(ష. త.) మృణాలసూత్రమ్; మృణాలసూత్రస్య అన్తరమ్ (ష.త.).
6) అలభ్యమ్ – న లభ్యమ్ (నఞ్ తత్పురుష) అలభ్యమ్.

***సంధులు :–***

1) ఉత్పీడయత్ + ఉత్పలాక్ష్యాః,ఉత్పీడయదుత్పలాక్ష్యాః, జశ్త్వసన్ధిః.
2) అపి + అలభ్యమ్ – అప్యలభ్యమ్ – యణాదేశసన్ధిః.

***పాఠాంతరాలు :–*** పాణ్డు – చారు.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1)'.అన్యోన్యస్య పరస్పరార్థే' (చాదిః)

విభక్తిప్రతిరూపకమవ్యయ మిదమ్। 'అన్యోన్యస్య స్మరన్తి'। పరస్పరం స్మరన్తి ఇత్యర్థః। అత్ర కర్మవ్యతిహారే సర్వనామ్నో ద్వే వాచ్యే సమాసవచ్చ బహుళమ్,(వా. 8–1–12) ఇతి వచనాత్ సర్వనామసంజ్ఞకస్య అన్యశబ్దస్య కర్మవ్యతీహారార్థే వర్తమానస్య ద్విర్వచనే కృతే, బహులగ్రహణాత్ అన్యశబ్దస్య సమాసవద్భావాభావే చ సతి 'అసమాసవద్భావే పూర్వపదస్థస్య సుపః సుర్వక్తవ్యః' (వా. 8–1–12) ఇతి షష్ఠీవిభక్తిప్రతిరూపకావ్యయత్వమ్ ఇతి జ్ఞేయమ్।.

***క్రియాదర్శము :–***

***అలంకారములు :–*** ఇట 'అతిశయోక్త్యలంకార' మున్నదని చెప్పదగును.

***లక్షణము :– శ్లో॥ నిమిత్తతో వచో యత్తు లోకాతి క్రాన్తగోచరమ్।***
***మన్యన్తేఽతిశయోక్తిం తామలఙ్కారతయా యథా॥***
***కావ్యాలంకారః –2–81.***

ఏదియో ఒక నిమిత్తమును పురస్కరించుకొని, లోకోత్తరమగు అర్థమునకు సంబంధించిన అనగా సాధారణముగ లోకమునందు సంభావ్యము కాని అర్థమును బోధించు ఏ వచనము కలదో అట్టి దానిని 'అతిశయోక్త్యలంకార'ముగ చెప్పుదురు.

'పార్వతీదేవియొక్క స్తనముల మధ్యభాగమునందు తామరతూటిదారమంత యెడమున్నూ లేదనుట అనునది లోకసాధారణము కాని విషయముగాన ఇది అతిశయోక్తి. ❁

**అవతారికా :–** లోకే సుకుమారత్వమేవ కుసుమాయుధస్య సాధకత్వమితి స్థితే సత్యాహ. లోకమున కుసుమాస్త్రునకు సుకుమారత్వమే కార్యసిద్ధికరమనుటకై దీనిని చెప్పుచున్నాడు.

**శ్లో॥ శిరీషపుష్పాధికసౌకుమార్యౌ**
**బాహూతదీయావితి మే వితర్కః ।**
**పరాజితేనాఽపి కృతౌ హరస్య**
**యౌ కణ్ఠపాశౌ మకరధ్వజేన ॥ 41**

**పదవిభాగము :–** శిరీషపుష్పాధికసౌకుమార్యౌ, బాహూ, తదీయౌ, ఇతి, మే, వితర్కః, పరాజితేన, అపి, కృతౌ, హరస్య, యౌ, కణ్ఠపాశౌ, మకరధ్వజేన.

**అన్వయక్రమము :–** యౌ (బాహూ) పరాజితేన, అపి, మకరధ్వజేన, హరస్య, కణ్ఠపాశౌ, కృతౌ, (అతః) తదీయౌ, బాహూ, శిరీషపుష్పాధికసౌకుమార్యౌ, ఇతి, మే, వితర్కః (అస్తి).

**ప్రతిపదార్థము :–** యౌ = ఏ బాహువులు, పరాజితేన = ఓడిన, మకరధ్వజేన + అపి = మన్మథుని చేతనే, హరస్య = హరునికి, కణ్ఠపాశౌ = కంఠపాశములుగా, కృతౌ = చేయబడినవో, (అతః) = (ఇందువలన), తదీయౌ = ఆ పార్వతీదేవివి యగు, బాహూ = బాహువులు, శిరీషపుష్పాధికసౌకుమార్యౌ = దిరిసెన పువ్వునకంటె అధికమైన కోమలత్వము కలవి, ఇతి = అని, మే = నాయొక్క, వితర్కః = ఊహ, (అస్తి) = (కలదు).

**తాత్పర్యము :–** ఏ బాహువులు, ఓడిన మన్మథుని చేతనే హరునికి కంఠపాశములుగా చేయబడినవో, ఆ పార్వతీదేవివి యగు బాహువులు దిరిసెన పువ్వునకంటె అధికమైన కోమలత్వము కలవి అని నాయొక్క ఊహ.

**విభక్తులు / క్రియలు :–** 1) శిరీషపుష్పాధికసౌకుమార్యౌ – ...సౌకుమారీ, **...సౌకుమార్యౌ,** సౌకుమార్యః; ఈకారాన్త స్త్రీలింగ ...సౌకుమారీ శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 2) బాహూ – బాహుః, బాహూ, బాహవః; ఉకారాన్త పుంలింగ బాహు శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 3) తదీయౌ – తదీయః, తదీయౌ, తదీయాః; ఈకారాన్త పుంలింగ తదీయ శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 4) ఇతి – అవ్యయము 5) మే – మే/మమ, ఆవయోః/నౌ, అస్మాకమ్/ నః; దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 6) వితర్కః – **వితర్కః,** వితర్కౌ, వితర్కాః; అకారాన్త పుంలింగ వితర్క శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) అపి – అవ్యయము. 8) పరాజతేన – **పరాజితేన,** పరాజితాభ్యామ్, పరాజితైః; అకారాన్త పుంలింగ పరాజిత శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) కృతౌ – కృతః, **కృతౌ,** కృతాః; అకారాన్త పుంలింగ కృత శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 10) హరస్య – **హరస్య,** హరయోః, హరాణామ్; అకారాన్త పుంలింగ హర శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) యౌ – **యౌ**; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 12) కణ్ఠపాశౌ – కణ్ఠపాశః, **కణ్ఠపాశౌ,** కణ్ఠపాశాః; అకారాన్త పుంలింగ కణ్ఠపాశ శబ్దము, ప్రథమావిభక్తి ద్వివచనము. 13) మకరధ్వజేన – **మకరధ్వజేన,** మకరధ్యజాభ్యామ్, మకరధ్వజైః; అకారాన్త పుంలింగ మకరధ్వజ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :–** 1) మకరధ్వజేన – మకరః ధ్వజః యస్య (బహుౖవ్రీహి) సః, తేన;



2) కణ్ఠపాశౌ – కణ్ఠస్య పాశౌ (ష.త.);

3) శిరీషపుష్పాధికసౌకుమార్యౌ – శిరీషస్య పుష్పమ్ (ష.త.), శిరీషపుష్పమ్; శిరీషపుష్పాద్ అధికం (ష.త.) సౌకుమార్యం యయోః (బహువ్రీహి) తౌ;

4) వితర్కః – విశిష్టః తర్కః (కర్మధా.)

***సంధులు :–***

1) పుష్ప + అధిక = పుష్పాధిక, సవర్ణదీర్ఘసన్ధిః.

2) తదీయౌ + ఇతి = తదీయావితి, **ఏచోఽయవాయావః** (సూ 6–1–78). "ఏ, ఓ, ఐ, ఔ లకు అచ్చు పరముగా నున్నప్పుడు క్రమముగా అమ్, అవ్, ఆమ్, ఆవ్ అనునవి ఆదేశముగా వచ్చును".

3) పరాజితేన + అపి = పరాజితేనాపి, సవర్ణదీర్ఘసన్ధిః.

***పాఠాంతరాలు :–*** శిరీషపుష్పా – శిరీషమాలా

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **శిరీషపుష్పాధికసౌకుమార్యౌ –**

ఎ) శ్లో॥ *శిరీషపుష్పాధికసౌకుమార్యః*
*ఖేదం సయాయాదపి భూషణేన ।*
*నితాన్తగుర్వీమపి సోఽనుభావా –*
*ద్ధురం ధరిత్ర్యా బిభరామ్బభూవ ॥ రఘువంశమ్ 18–45.*

శిరీషకుసుమముకంటెను సుకుమారమైనశరీరముగల ఆ రాజుబరువైన మణి భూషణములు ధరించుటచేతనే అలసిపోయెడివాడు. అంతటి సుకుమారుడైనను, తన శౌర్యసామర్థ్యముచేత ఎంతో బరువైన భూభారమును వహించెను.

బి) Now the poet's idea is this - Kama who always uses delicate weapons tried his arrow 'శిరీష' but failed; and finding nothing softer than that, had to yield; but now that he used Parvati's arms as his weapons, they must have been softer than the 'శిరీష' flower even. - Kale.

సి) శ్లో॥ *...పదం సహేతభ్రమరస్య పేలవం*
*శిరీషపుష్పం న పునః పతత్రిణః ॥ కు.సం. 5–4.*

"...సుకుమారమైన దిరిసెనపువ్వు తుమ్మెద కాలిబరువును సహించును గాని కఠినమగు పక్షి కాలిబరువును సహించుకొనగలదా?"

2. **మకరధ్వజేన –**

మకరధ్వజః – మకరేణ చిహ్నితో ధ్వజో యస్య। మకరః ధ్వజే యస్యేతి వా।

శ్లో॥ ప్రద్యుమ్నో మకరధ్వజో మనసిజః సంకల్పజన్మాఙ్గజః
పంచేషుః కుసుమాయుధశ్చ మదనో మారః స్మరో మన్మథః ।
కందర్పో ఝషకేతనో రతిపతిః శ్రీనందనో హృచ్ఛయః
కామః శమ్బరసూదనో మధుసఖః శృఙ్గారయోనిః స్మృతః ॥ **32**

శ్లో॥ దర్పకః శూపకారాతిరనఙ్గో విషమాయుధః ।
ఆత్మభూర్మనసిశయః పుష్పధన్వా మనోభవః ॥ **33**

శ్లో॥ **మాపత్యమిరజశ్చైవ....** అని హలాయుధకోశము, మకరధ్వజునకు '30' నామములను పేర్కొన్నది.

శ్లో॥ బాణాహవవ్యాహతశంభుశక్తే -
రాసత్తిమాసాద్య జనార్దనస్య ।
శరీరిణా జైత్రశరేణ యత్ర
నిశ్శంకమూషే మకరధ్వజేన ॥ *3-81, మాఘే*

....జయశీలములగు బాణములు కలవాడగు మన్మథుడు నిర్భయంగా నివసించెను.

**క్రియాదర్శము :-**

**అలంకారములు :-** ఇట 'పరిణామాలంకార' మున్నదని చెప్పదగును.

**లక్షణము :-** విషయాత్మతయారోప్యే ప్రకృతార్థోపయోగిని ॥ **34**
పరిణామో భవేత్ .... *సాహిత్యదర్పణే దశమః పరిచ్ఛేదః*

పార్వతీదేవి బాహువులపై పాశారోపణము చేయబడుటచే నిది 'పరిణామాలంకార' మని చెప్పదగును.

2) The figure of speech here is 'వ్యతిరేక'. - Kale. 

శ్లో॥ కణ్ఠస్య తస్యాస్స్తనబన్ధురస్య
ముక్తాకలాపస్య చ నిస్తలస్య ।
అన్యోన్యశోభాజననాద్బభూవ
సాధారణోభూషణ భూష్యభావః ॥ **42**

**పదవిభాగము :-** కణ్ఠస్య, తస్యాః, స్తనబన్ధురస్య, ముక్తాకలాపస్య, చ, నిస్తలస్య, అన్యోన్యశోభాజననాత్, బభూవ, సాధారణః, భూషణభూష్యభావః.

**అన్వయక్రమము :-** స్తనబన్ధురస్య, తస్యాః, కణ్ఠస్య, నిస్తలస్య, ముక్తాకలాపస్య, చ, అన్యోన్యశోభాజననాత్, భూషణభూష్యభావః, సాధారణః, బభూవ.



**ప్రతిపదార్థము :-** స్తనబంధురస్య = పాలిండ్లచేత నిగిడియున్న, తస్యాః = ఆ పార్వతీదేవి యొక్క, కణ్ఠస్య = మెడకును, నిస్తలస్య = గుండ్రని, ముక్తాకలాపస్య చ = ముత్యాల సరమునకును, అన్యోన్యశోభాజననాత్ = ఒకదానికొకటి శోభను కలిగించుట వలన, భూషణభూష్యభావః = అలంకార-అలంకార్య భావము (భూషణమగుట, భూషితమగుట), సాధారణః = సమానము, బభూవ = ఆయెను.

**తాత్పర్యము :-** పాలిండ్లచేత నిగిడియున్న ఆ పార్వతీదేవి యొక్క మెడకును, గుండ్రని ముత్యాల సరమునకును, ఒకదానికొకటి శోభను కలిగించుటవలన అలంకార-అలంకార్య భావము సమానమాయెను. (కంఠమునకు హారము, ముత్యాలహారమునకు కంఠము నలంకరించుచు పరస్పరసౌందర్యములను పరస్పరమభివృద్ధి పరచుకొనెననుట)

**విభక్తులు / క్రియలు :-** 1) కణ్ఠస్య - **కణ్ఠస్య,** కణ్ఠయోః, కణ్ఠానామ్; అకారాన్త పుంలింగ కణ్ఠ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) తస్యాః - **తస్యాః,** తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. షష్ఠీవిభక్తి ఏకవచనము. 3) స్తనబంధురస్య - **స్తనబంధురస్య,** స్తనబంధురయోః, స్తనబంధురాణామ్; అకారాన్త పుంలింగ స్తనబంధుర శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 4) ముక్తాకలాపస్య - **ముక్తాకలాపస్య,** ముక్తాకలాపయోః, ముక్తాకలాపానామ్; అకారాన్త పుంలింగ ముక్తాకలాప శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 5) చ - అవ్యయము. 6) నిస్తలస్య - **నిస్తలస్య,** నిస్తలయోః, నిస్తలానామ్; అకారాన్త పుంలింగ నిస్తల శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) అన్యోన్యశోభాజననాత్ - **...జననాత్,** ...జననాభ్యామ్, ...జననేభ్యః; అకారాన్త నపుంసకలింగ జనన శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 7) బభూవ - క్రియ. 8) భూషణభూష్యభావః - **భావః,** భావౌ, భావాః; అకారాన్త పుంలింగ భావ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) సాధారణః - **సాధారణః,** సాధారణౌ, సాధారణాః; అకారాన్త పుంలింగ సాధారణ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

**సమాసాలు :-**

1) స్తనబంధురస్య - స్తనాభ్యాం బంధురః (తృ.త.) స్తనబంధురః, తస్య;
2) ముక్తాకలాపస్య - ముక్తానాం కలాపః (ష.త.) ముక్తాకలాపః, తస్య;
3) నిస్తలస్య - నిర్గతః తాత్ (ప్రాదితత్పురుష);
4) అన్యోన్యశోభాజననాత్-అన్యోన్యస్య శోభా (ష.త.) అన్యోన్యశోభా, అన్యోన్యశోభాయాః జననమ్ (ష.త.) తస్మాత్;
5) భూషణభూష్యభావః - భూషణఇఞ్చ భూష్యఇఞ్చ (ద్వంద్వ) భూషణభూష్యా, భూషణభూష్యయోః భావః (ష.త.).

**సంధులు :-**

1) తస్యాః + స్తనబంధురస్య = తస్యాస్స్తనబంధురస్య, విసర్గసన్ధిః.
2) జననాత్ + బభూవ = జననాద్బభూవ, జశ్త్వసంధిః.

**పాఠాంతరాలు :-** తస్యాః స్తనబంధురస్య - తస్యాస్తనుబంధురస్య; 2) నిస్తలస్య - నిస్తులస్య.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.**

1. **ముక్తాకలాపస్య – నిస్తలస్య. –**

ఎ) ముక్తాభిః కృతః కలాపః తస్య. కలాప is used here in the sense of an ornament. నిస్తల means round, circular. నిస్తల seems to refer to both ముక్తా and కలాప. The ornament was circular in form and it was made of fine round pearls. Perfectly round pearls are extremely rare and so costly.

– Karmarkar.

***క్రియాదర్శము :–*** బభూవ – 32వ శ్లోక వ్యాఖ్య భాగము చూడగలరు.

***అలంకారములు :–*** ఇట 'అన్యోన్యాలంకార'మున్నదని చెప్పదగును.

ఎ) అలంకారసర్వస్వము, సరస్వతీకంఠాభరణము, అలంకారసూత్రము, అలంకార తిలకము, అలంకారకౌస్తుభము – అన్నీ ఈ శ్లోకాన్ని 'అన్యోన్యాలంకారము'నకు ఉదాహరణ గా పేర్కొన్నవి.

***లక్షణము :– "క్రియయా తు పరస్పరమ్ వస్తునోర్జననేఽన్యోన్యమ్***

వృ :– అర్థయోరేకక్రియాముఖేన పరస్పరం కారణత్వే సతి అన్యోన్య నామాలంకారః.

వస్తువులయొక్క క్రియచేత పరస్పరము పుట్టించడం జరుగుచుండగా అన్యోన్యాలంకార మని చెప్పబడును.

ఒక్క క్రియద్వారా రెండు వస్తువులు పరస్పరము కారణం అయినట్లయితే 'అన్యోన్యం' అనే పేరు గల అలంకారము.

"కంఠమునకు ముత్యాలహారమును, ముత్యాలహారమునకు కంఠమును అలంకరించుచు పరస్పర సౌందర్యములను, పరస్పరమభివృద్ధి పరచుకొనెననుట'చే ఇచట 'అన్యోన్యాలంకార' మున్నదని చెప్పదగును.



***శ్లో॥ చన్ద్రం గతా పద్మగుణాన్న భుఙ్క్తే***
***పద్మాశ్రితా చాన్ద్రమసీమభిఖ్యామ్ ।***
***ఉమాముఖన్తు ప్రతిపద్య లోలా***
***ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః ॥ 43***

***పదవిభాగము :–*** చన్ద్రమ్, గతా, పద్మగుణాన్, న, భుఙ్క్తే, పద్మాశ్రితా, చాన్ద్రమసీమ్, అభిఖ్యామ్, ఉమాముఖమ్,తు,ప్రతిపద్య, లోలా, ద్విసంశ్రయమ్, ప్రీతమ్, అవాప, లక్ష్మీః.

***అన్వయక్రమము :–*** లోలా, లక్ష్మీః, చంద్రమ్, గతా (సతీ), పద్మగుణాన్, న, భుఙ్క్తే, పద్మాశ్రితా (సతీ), చాన్ద్రమసీమ్, అభిఖ్యామ్, న, భుఙ్క్తే, ఉమాముఖమ్, ప్రతిపద్య, తు, ద్విసంశ్రయామ్, ప్రీతమ్, అవాప.



***ప్రతిపదార్థము :–*** లోలా = చంచలురాలగు, లక్ష్మీః = లక్ష్మీదేవి (కాంత్యభిమానదేవత), చంద్రమ్ = చంద్రుని, గతా (సతీ) = పొందినదై (యున్నప్పుడు), పద్మగుణాన్ = కమలముయొక్క పరిమళాది గుణములను, న భుఙ్క్తే = అనుభవింపలేదు, పద్మాశ్రితా (సతీ) = పద్మమునాశ్రయించి (యున్నప్పుడు), చాన్ద్రమసీమ్ = చంద్రసంబంధమగు, అభిఖ్యామ్ = శోభను, న భుఙ్క్తే = అనుభవింపలేదు, ఉమాముఖమ్ = పార్వతీదేవి మోమును, ప్రతిపద్య తు = పొందిననో, ద్విసంశ్రయామ్ = చంద్రపద్మములు కారణముగా గల, ప్రీతమ్ = ఆనందమును, అవాప = పొందెను.

**తాత్పర్యము :–** చంచలురాలగు లక్ష్మీదేవి 1) చంద్రునియందున్నప్పుడు కమలముయొక్క పరిమళాది గుణములను అనుభవింపలేదు, 2) పద్మమునాశ్రయించియున్నప్పుడు చంద్ర సంబంధమగు శోభను అనుభవింపలేదు. 3) పార్వతీదేవి మోమును పొందియున్నపుడో చంద్రపద్మములు కారణముగా గల (ఆనందరూపశైత్యశోభను, పరిమళాదిగుణములను) ఆనందమును పొందెనని భావము.

***విభక్తులు / క్రియలు :–*** 1) చన్ద్రమ్ – **చన్ద్రమ్,** చంద్రౌ, చంద్రాన్; అకారాన్త పుంలింగ చన్ద్ర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) గతా – **గతా,** గతే, గతాః; ఆకారాన్త స్త్రీలింగ 'గతా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) పద్మగుణాన్ – పద్మగుణమ్, పద్మగుణౌ, **పద్మగుణాన్;** అకారాన్త పుంలింగ 'పద్మగుణ' శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 4) న – అవ్యయము. 5) భుఙ్క్తే – క్రియ. 6) పద్మాశ్రితా – **పద్మాశ్రితా,** పద్మాశ్రితే, పద్మాశ్రితాః; ఆకారాన్త స్త్రీలింగ 'పద్మాశ్రితా' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) చాన్ద్రమసీమ్ – **చాన్ద్రమసీమ్,** చాన్ద్రమస్యౌ, చాన్ద్రమస్యః; ఈకారాన్త స్త్రీలింగ చాన్ద్రమసీ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) అభిఖ్యామ్ – **అభిఖ్యామ్,** అభిఖ్యే, అభిఖ్యాః; ఆకారాన్త స్త్రీలింగ అభిఖ్యా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) ఉమాముఖమ్ – **ఉమాముఖమ్,** ఉమాముఖే, ఉమాముఖాని; అకారాన్త నపుంసకలింగ ఉమాముఖ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) తు – అవ్యయము. 11) ప్రతిపద్య – ల్యబన్తము. 12) లోలా – **లోలా,** లోలే, లోలాః; ఆకారాన్త స్త్రీలింగ లోలా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 13) ప్రీతమ్ – **ప్రీతమ్,** ప్రీతీ, ప్రీతీః; ఇకారాన్త స్త్రీలింగ 'ప్రీతి' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 14) అవాప – క్రియ. 15) లక్ష్మీః – **లక్ష్మీః,** లక్ష్మ్యౌ, లక్ష్మ్యః; ఈకారాన్త స్త్రీలింగ లక్ష్మీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) పద్మగుణాన్ – పద్మస్య గుణాః (ష.త.) తాన్;
2) పద్మాశ్రితా – పద్మ ఆశ్రితా (ద్వి.త.);
3) ఉమాముఖమ్ – ఉమాయాః ముఖమ్ (ష.త.), ఉమాముఖమ్;
4) ద్విసంశ్రయామ్ – ద్వే సంశ్రయః యస్యాః (బహువ్రీహి) తామ్.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **లక్ష్మీః** – ఈకారాన్తః స్త్రీలింగో 'లక్ష్మీ' శబ్దః(లక్ష్మీ). ప్రథమా ఏకవచనమరూపము–లక్ష్మీః

ఎ) లక్షధాతోః 'లక్షేర్ముట్ చ' ఇతి ఈప్రత్యయే ముడాగమే చ 'లక్ష్మీ' శబ్దః। అజ్యన్తత్వాన్న సులోపః। 'కృదికారాది' తి జీష్ తు సులోపో భవత్యేవేతి సిద్ధాన్తః। అత ఏవ 'లక్ష్మీర్లక్ష్మీ హరిప్రియే' తి ద్విరూపకోషః సఙ్గచ్ఛతే। శేషం గౌరీవత్.

బి) **లక్ష్మీః**

శ్లో॥ స్తుతిః సిద్ధిరితి ఖ్యాతా శ్రియా సంశ్రయణాచ్చ వా ।

**లక్ష్మీ**ర్వా లలనా వాపి క్రమాత్ సా కాంతిరుచ్యతే ॥ *దేవీపురాణే - 55 అధ్యాయః*

సి) శ్లో॥ **లక్ష్మీః** శ్రీః కమలా పద్మా పద్మవాసా హరిప్రియా ।

క్షీరోదతనయా మా చ శబ్దజ్ఞైరిన్దిరా స్మృతా ॥ *31*

అని 'లక్ష్మీ' శబ్దమునకు '9' నామములను 'హలాయుధకోశము' పేర్కొనగా

డి) శ్లో॥ **లక్ష్మీః** పద్మా రమా యా మా తా సా శ్రీః కమలేందిరా।

హరిప్రియా పద్మవాసా క్షీరోదతనయాఽపి చ ॥ *140*

అని అభిధానచిన్తామణి '14' నామములను ఇచ్చినది.

శేషశ్చాత్ర - లక్ష్మ్యాన్తు భర్భరీ విష్ణుశక్తిః క్షీరాబ్ధిమానుషీ।

ఇట శ్రీసూక్తమును, శ్రీలక్ష్మీతంత్రమును అనుసంధానము చేసికొనదగును.

***క్రియాదర్శము :-*** 1) **భుఙ్క్తే** - భుజ (భుజ్) భోజనార్థే (భుజించుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ), ఆత్మనేపదీ. వర్తమానే లట్.

ప్రథమపురుషరూపాలు : **భుఙ్క్తే -** భుఞ్జాతే - భుఞ్జతే

శ్లో॥ *జేమత్యశ్నాతి జమతి భక్షయత్యత్తి ఖాదతి ।*

*చరతి ప్సాతి క్షమతి **భుఙ్క్తే** చమతి చర్వతి ॥ 24*

శ్లో॥ *వల్భతే ఘసతి క్వాపి ఛమతి ప్రత్యవస్యతి ।*

*చషత్యభ్యవహరత్యేతే తర్ణోతి భక్షతి ॥ 25*

శ్లో॥ *తృణోతి చాత్మనే పంచాప్యుపభఙ్క్తే చ జక్షితి ।*

*వేతి భుక్తౌ విష్వణతి చావష్వణతి సద్వనౌ ॥ 26.*

అని 'ఆఖ్యాతచన్ద్రిక' తుల్యరూపాలను పేర్కొన్నది.

2) **అవాప** - అవోపసర్గపూర్వకాత్ 'ఆప వ్యాప్తౌ' ఇతి ధాతోర్లిటి ప్రథమపురుషైకవచనే రూపమిదమ్. స్వాదిప్రకరణమ్ (5), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ.

ప్రథమపురుషరూపాలు - అవ+ఆప = **అవాప** - అవ+ఆపతుః = అవాపతుః - అవ+ఆపుః = అవాపుః.

***అలంకారములు :-*** ఇట 'వ్యతిరేకాలంకార' మున్నదని చెప్పదగును.

***లక్షణము :-*** **ఉపమానవతోఽర్థస్య యద్విశేషనిదర్శనమ్ ।**

**వ్యతిరేకం తమిచ్ఛన్తి విశేషాపాదనాద్వథా ॥** *-కావ్యాలంకారః 2-75.*

ఏదైనా ఒక ఉపమానమును చెప్పి వర్ణించిన విషయమునకు, ఏదియో ఒక వైశిష్ట్యమును కల్పించి విశేషమును చూపించుట 'వ్యతిరేకాలంకార'మని అంగీకరింతురు - బాలనందిని.



లక్ష్మీదేవి పార్వతీదేవి మోమున చంద్రశైత్యశోభయు, కమలపరిమళమును గల ఆనందమును పొందెను. చంద్రుని యందున్నప్పుడు కమల పరిమళమును అనుభవించలేదు. కమలముయందున్నప్పుడు శైత్యశోభ అనుభవించలేదు. చంద్రుని యందు శైత్యశోభ మాత్రమే ఉండును, కమలము యందు పరిమళము మాత్రమే యుండును. ఉమాదేవి మోమున పైరెండున్నూ ఉండునని చెప్పబడుటచే నిది 'వ్యతిరేకాలంకార'ముగా భావింపదగును. 

**శ్లో॥ పుష్పం ప్రవాళోపహితం యది స్యా-**
**న్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థమ్ ।**
**తతోఽనుకుర్యాద్విశదస్య తస్యా -**
**స్తామ్రోష్ఠపర్యస్తరుచస్స్మితస్య ॥** ***44***

***పదవిభాగము :-*** పుష్పమ్, ప్రవాళోపహితమ్, యది, స్యాత్, ముక్తాఫలమ్, వా, స్ఫుటవిద్రుమస్థమ్, తతః, అనుకుర్యాత్, విశదస్య, తస్యాః, తామ్రోష్ఠపర్యస్తరుచః, స్మితస్య.

***అన్వయక్రమము :-*** పుష్పమ్, ప్రవాళోపహితమ్, స్యాత్, యది, ముక్తాఫలమ్, వా స్ఫుటవిద్రుమస్థమ్, స్యాత్, యది; తతః, విశదస్య, తామ్రోష్ఠపర్యస్తరుచయః, తస్యాః, స్మితస్య, అనుకుర్యాత్.

***ప్రతిపదార్థము :-*** పుష్పమ్ = తెల్లతామర మున్నగు పూవు, ప్రవాళోపహితమ్ = లేత చిగురునందు ఉంచబడినది, స్యాత్ యది = అయిన యెడల, ముక్తాఫలమ్ వా = ముత్యపు పూసయైనను, స్ఫుటవిద్రుమస్థమ్ = నిర్మలమైన పగడమునందు ఉన్నట్టిది, (స్యాత్ యది) = (అయిన యెడల), తతః = ఆ పక్షమున, విశదస్య = స్వచ్ఛమైన, తామ్రోష్ఠపర్యస్తరుచయః = ఎఱ్ఱని పెదవి యందు వ్యాపించిన కాంతికలదైన, తస్యాః = ఆ పార్వతీదేవియొక్క, స్మితస్య = చిఱునగవుకు, అనుకుర్యాత్ = సరిపోలును.

***తాత్పర్యము :-*** తెల్లతామరమున్నగు పూవు లేత చిగురు నందుంచబడినది ఐనయెడల ముత్యపుపూసయైనను నిర్మలపగడము నందున్నట్టిది అయిన యెడల, ఆ పక్షమున స్వచ్ఛమైన ఎఱ్ఱని పెదవి యందు వ్యాపించిన కాంతి కలదైన ఆ పార్వతీదేవి యొక్క చిఱునగవుకు సరిపోలును.

***విభక్తులు / క్రియలు :-*** 1) పుష్పమ్ - **పుష్పమ్,** పుష్పే, పుష్పాని; అకారాన్త నపుంసకలింగ పుష్ప శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) ప్రవాళోపహితమ్ - **ప్రవాళోపహితమ్,** హితౌ, హితాన్, అకారాన్త పుంలింగ ప్రవాళోపహిత శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 3) యది - అవ్యయము. 4) స్యాత్ - క్రియ. 5) వా - అవ్యయము. 6) ముక్తాఫలమ్ - **ఫలమ్,** ఫలే, ఫలాని; అకారాన్త నపుంసకలింగ ఫల శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 7) తతః - అవ్యయము. 8) స్ఫుటవిద్రుమస్థమ్ - **స్ఫుటవిద్రుమస్థమ్,** విద్రుమస్థౌ, విద్రమస్థాన్, అకారాన్త పుంలింగ స్ఫుటవిద్రుమస్థ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) అనుకుర్యాత్ - క్రియ. 10)

విశదస్య – **విశదస్య,** విశదయోః, విశదానామ్; అకారాన్త నపుంసకలింగ విశద శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 11) తస్యాః – **తస్యాః,** తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 12) తామ్రోష్ఠపర్యస్తరుచః – **రుచః,** రుచోః, రుచానామ్; చకారాన్త నపుంసకలింగ రుచ్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 13) స్మితస్య – **స్మితస్య,** స్మితయోః, స్మితానామ్; అకారాన్త నపుంసకలింగ స్మిత శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) ప్రవాళోపహితమ్ – ప్రవాళే ఉపహితమ్, (స.త.);

2) ముక్తాఫలమ్ – ముక్తా ఏవ ఫలమ్ (మయూరవ్యంసకాది కర్మధా.);

3) స్ఫుటవిద్రుమస్థమ్ – స్ఫుటః చాసౌ విద్రుమశ్చ (కర్మధా.) ఇతి, స్ఫుటవిద్రుమః, స్ఫుటవిద్రుమే తిష్ఠతి (ఉపపదతత్పురుష) ఇతి స్ఫుటవిద్రుమస్థః, తమ్;

4) తామ్రోష్ఠపర్యస్తరుచః – తామ్రః చాసౌ ఓష్ఠః (కర్మధా.) తామ్రోష్ఠః, తామ్రోష్ఠే పర్యస్తా (స.త.) రుక్ యస్య (బహువ్రీహి) తస్య.

***సంధులు :–***

1) ప్రవాళ + ఉపహితమ్ = ప్రవాళోపహితమ్, గుణసన్ధిః, ఆద్గుణః;

2) స్యాత్ + ముక్తాఫలమ్ = స్యాన్ముక్తాఫలమ్, అనునాసికసన్ధిః, **'యరోఽనునాసికే అనునాసికో వా'** (సూ. 8-4-44) రహలు తప్ప తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్రులకు) అనునాసిక వర్ణము పరముగా నున్నచో ఆయా వర్గలకు సంబంధించిన అనునాసిక (ఞ మ ఙ ణ న) వర్ణమాదేశముగ వికల్పముగ వచ్చును;

3) తతః + అనుకుర్యాత్ = తతోఽనుకుర్యాత్ = తతోఽనుకుర్యాత్, ఉత్వాదేశసన్ధిః, **'అతోరో రప్లుతాదప్లుతే'** సూ (6-1-109) తతస్ + అనుకుర్యాత్ = రుత్వాదేశ సంధిః, తదర్ + అనుకుర్యాత్ = ఉత్వాదేశసంధిః, తత + ఉ + అనుకుర్యాత్ = గుణము, తతో + అనుకుర్యాత్ = పూర్వరూపము, తతోఽనుకుర్యాత్;

4) తస్యాః + తామ్రోష్ఠపర్యస్తరుచః = తస్యాస్తామ్రోష్ఠపర్యస్తరుచః, విసర్గసన్ధిః;

5) రుచః + స్మితస్య = రుచస్స్మితస్య, విసర్గసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **పుష్పమ్** – పుష్యతి వికసతి యః। పుష్ప్ వికసనే + అచ్.

శ్లో॥ *పుష్పం ప్రసవః కుసుమం ప్రసూనకం సుమనసః సమాఖ్యాతాః॥*

అని హలాయుధకోశము 5 నామములు పేర్కొన్నది.

శ్లో॥ *ఉపహార్యాణి పుష్పాణి మమ కర్మపరాయణః।*
*యో మాముపానయేద్ భూమే మమ కర్మపథే స్థితః॥*

శ్లో॥ *పుష్పాణి తత్ర యావన్తి మమ మూర్ధని ధారయేత్।*
*సా కృత్వా పుష్కలం కర్మ మమ లోకాయ గచ్ఛతి॥* వరాహపురాణమ్



శ్లో॥ *పత్రం పుష్పం ఫలం తోయం మే భక్త్యా ప్రయచ్ఛతి।*
*తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః॥ భ. 9-26*

2. **వా** – (చాదులు, స్వరాదులు) అవ్యయము – అవ్యయకోశము (708)

***వికల్పోపమాన ద్వంద్వసముచ్చయావధారణానవక్లృప్తి వితర్క పాదాపూరణాదిషు వర్తతే.***

ఎ) వికల్పే – 'ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వాపి తద్విధా' మను. 2-112

బి) ఉపమానే – 'ఆశీవిషో వా సంక్రుద్ధః సూర్యో వాత్ర వినిర్గతః।
భీమోఽన్తకో వా సమరే గదాపాణిరదృశ్యత॥ మాఘే 4-35.

సి) ద్వంద్వే – 'సా వా శమ్భోస్తదీయా వా మూర్తి ర్జలమయీ మమ' కు.సం. 2-60

డి) సముచ్చయే – 'వాయుర్వా త్వా మనుర్వా త్వా। తై.సం.-1-7-7-2 వాయుర్మనుశ్చేత్యర్థః

ఇ) అవధారణే– 'సుయోధనం వా న గుణైరతీతాః (కిరాత. 3-13)

ఎఫ్) అనవక్లృప్తౌ – 'శస్త్రవేదమధిగమ్య తత్త్వతః కస్య వేహ భుజవీర్యశాలినః'-కిరాత 13-62.

జి) వితర్కే – 'కిం తే హిడిమ్బ ఏతైర్వా సుఖసుప్తైః ప్రబోధితైః'

హెచ్) పదపూరణే – 'దేవాసురగణాన్ వాపి సుగన్ధర్వోరగాన్ భువి' రామా బాల. 25-3.

***క్రియాదర్శము :–*** 1) **స్యాత్** – అస (అస్) భువి ఉండుట. అదాదిప్రకరణమ్ (2) అకర్మకమ, అనిట్, పరస్మైపదీ. విధిలిఙ్. ప్రథమపురుషరూపాలు:– **స్యాత్**–స్యాతామ్,స్యుః.

2) **అనుకుర్యాత్** – అను+కుర్యాత్ – డుకృఞ్ (కృ) కరణే (చేయుట) తనాది ప్రకరణమ్ (8), సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, విధిలిఙ్. ప్రథమపురుషరూపాలు : **కుర్యాత్** – కుర్యాతామ్ – కుర్యుః. అను ఉపసర్గ.

***అలంకారములు :–*** ఇట 'అతిశయోక్త్యలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– శ్లో॥ నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాన్తగోచరమ్।***
***మన్యన్తేఽతిశయోక్తిం తామలఙ్కారతయా యథా॥ 81***

కావ్యాలంకారః – ద్వితీయః పరిచ్ఛేదః

ఏదియో ఒక నిమిత్తమును పురస్కరించుకొని, లోకోత్తరమగు అర్థమునకు సంబంధించిన ఏ వచనము కలదో అట్టి అతిశయోక్తిని అలంకారముగా చెప్పుదురు. –బాలానందిని.

తెల్లతామరపూవు లేత చిగురునందు ఉంచబడిన యెడల, ముత్యపుపూస నిర్మలమైన పగడము నందు ఉంచబడిన యెడల, అప్పుడే పార్వతీదేవి యొక్క చిఱునగవుకు సరిపోలును అని చెప్పబడుటయే ఇట అతిశయోక్తి.



*శ్లో॥ స్వరేణ తస్యామమృత స్రుతేవ*
*ప్రజల్పితాయామభిజాతవాచి ।*
*అప్యన్యపుష్టా ప్రతికూల శబ్దా*
*శ్రోతుర్వితన్త్రీరివ తాడ్యమానా ॥* **45**

***పదవిభాగము :–*** స్వరేణ, తస్యామ్, అమృతస్రుతేవ, ప్రజల్పితాయామ్, అభిజాతవాచి, అపి, అన్యపుష్టా, ప్రతికూలశబ్దా, శ్రోతుః, వితన్త్రీః, ఇవ,తాడ్యమానా।

***అన్వయక్రమము :–*** అభిజాతవాచి, తస్యామ్, అమృతస్రుతా, ఇవ, స్వరేణ, ప్రజల్పితాయామ్(సత్యామ్), అన్యపుష్టా, అపి, తాడ్యమానా, వితంత్రీః, ఇవ, శ్రోతుః, ప్రతికూలశబ్దా (భవతి).

***ప్రతిపదార్థము :–*** అభిజాతవాచి = మధురమైన వాక్కుగలదైన, తస్యామ్ = ఆ పార్వతీ దేవి, అమృతస్రుతా ఇవ = అమృతమును స్రవించుచున్నట్లున్న, స్వరేణ = స్వరముతో, ప్రజల్పితాయామ్(సత్యామ్) = పలుకుచుండగ, అన్యపుష్టా అపి = కోయిల సైతము, తాడ్యమానా=వాయింపబడుచున్న, వితంత్రీః = విషయముగా కట్టబడిన తంత్రివలె, శ్రోతుః = వినువానికి, ప్రతికూలశబ్దా = అప్రియమైన నాదము కలది, (భవతి) = అగుచున్నది.

***తాత్పర్యము :–*** మధురమైన వాక్కుగలదైన ఆ పార్వతీదేవి అమృతమును స్రవించుచున్నట్లున్న స్వరముతో పలుకుచుండగ; కోయిల సైతము వాయింపబడుచున్న విషమముగా కట్టబడిన తంత్రివలె వినువానికి అప్రియమైన నాదముకలది అగుచున్నది.

***విభక్తులు / క్రియలు :–*** 1) స్వరేణ – **స్వరేణ**, స్వరాభ్యామ్, స్వరైః; అకారాన్తపుంలింగ స్వరశబ్దము,తృతీయా విభక్తి ఏకవచనము. 2) తస్యామ్ – **తస్యామ్**, తయోః, తాసు; దకారాన్తస్త్రీలింగ తచ్ఛబ్దము, సప్తమీ విభక్తి ఏకవచనము. 3) ఇవ – అవ్యయము. 4) అమృతస్రుతా – **అమృతస్రుతా**, అమృతస్రుద్భ్యామ్, అమృతస్రుద్భిః, తకారాన్త స్రీలింగ స్రుత్‌శబ్దము, తృతీయవిభక్తి ఏకవచనము. 4) ప్రజల్పితాయామ్ – **ప్రజల్పితాయామ్,** ప్రజల్పితయోః, ప్రజల్పితాసు; ఆకారాన్తస్త్రీలింగ ప్రజల్పితాశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) అభిజాతవాచి – **అభిజాతవాచి,** అభిజాతవాచోః, అభిజాతవాక్షు; చకారాన్త స్త్రీలింగ వాక్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 6) అపి అవ్యయము. 7) ప్రతికూలశబ్దా – **ప్రతికూలశబ్దా,** ప్రతికూలశబ్దే ప్రతికూలశబ్దాః; ఆకారాన్తస్త్రీలింగ ప్రతికూలశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) శ్రోతుః – శ్రోతుః, శ్రోత్రోః, శ్రోతౄణామ్; ఋకారాన్తపులింగ శ్రోతృశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనమ. 9) ఇవ – అన్యయము. 10) వితన్త్రీః – 11) తాడ్యమానా – **తాడ్యమానా,** తాడ్యమానౌ; తాడ్యమానాః, ఆకారాన్త స్త్రీలింగ తాడ్యమానా శబ్దము, ప్రథమా విభక్తి ఏకవచనము.

***సమాసాలు :– 1)*** అభిజాతవాచి – అభిజాతా వాక్ యస్యాః (బహుప్రీహి) సా, తస్యామ్. 2) అమృతస్రుతా – అమృతం స్రవతీతి (ఉపపద తత్పురుష) తేన. 3) ప్రజల్పితాయామ్ – ప్రకర్షేణ జల్పితా (ప్రాదితత్పు.) తస్యామ్. 4) అన్యపుష్టా – అన్యైః పుష్టా (తృ. త.). 5) వితన్త్రీః – విషమబద్ధా తన్త్రీ (మధ్యమపదలోపి తత్పు). 6) ప్రతికూలశబ్దా – ప్రతికూలః శబ్దః యస్యాః (బహుప్రీహి) సా.



***సంధులు :–*** 1) అమృతస్రుతా + ఇవ = అమృతస్రుతేవ, గుణసన్ధిః. 2) అపి + అన్యపుష్టా = అప్యన్యపుష్టా, యణాదేశసన్ధిః, ఇకో యణచి. 3) శ్రోతుః + వితన్త్రీః = శ్రోతుర్వితన్త్రీః, విసర్గసన్ధిః. 4) వితన్త్రీః + ఇవ = వితన్త్రీరివ, విసర్గసన్ధిః

***పాఠాంతరాలు :–***

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1.వితన్త్రీః:– విషమబద్ధా తన్త్రీః వితన్త్రీరివ 'విరుద్ధా తన్త్రీర్వితన్త్రీరితి ప్రాదిసమాసః'. 'అవి తృాస్తృా తన్త్రీభ్య ఈః' ఇతి తన్త్రిధాతో రౌణాదిక ఈప్రత్యయః.జీబబావాన్న 'హల్జ్యాభ్యః' – ఇతి సులోపః తదుక్తమ్.

జి) శ్లో॥ *అవీ లక్ష్మి తరీ తన్త్రీ హ్రీ ధీ శ్రీణాముణాదితః।*
*స్త్రీలింగానామమీషాం తు న సులోపః కదాచన॥ ఇతి.*
*ఏతే జీబన్తా నభవన్తి నభవన్తీత్యర్థః.* --- *సంజీవనీ వ్యాఖ్యా.*

వితన్త్రీ the wrong string which produces a discordant note.

'ఉత్పాద్యానాం స్వరాదీనాం విహితం తాడనక్రమమ్।
వినా వా తాడ్యతే మందైః సా వితన్త్రీరిహోచ్యతే॥'

వితన్త్రీ is a badly tuned lute. .

***అలంకారములు :–*** 1) అత్రామృతస్రుతేత్యుత్ప్రేక్షా మాధుర్యసౌకుమార్యాదిగుణైః పరభృతావిరుతాద్ దేవీ సంజల్పితస్య వ్యతిరేకం ద్యోతయతి, ప్రతికూలశబ్దశ్చ తమభిద్యోతయతీతి వ్యతిరేకాలంకారో ధ్వన్యతే – ' వివరణమ్' వాఖ్యా.

2) ఉపమాలంకారము:– పార్వతీదేవి మృదుమధురసర్వముతో పలుకుచుండ, కోయిల స్వరము, విషమముగా కట్టబడిన తంత్రి స్వరము వలె ఉన్నదని వర్ణింపబడుటచే ఇట ఉపమాలంకారమున్నదని చెప్పబడుచున్నది.

***లక్షణము:–*** సామ్యం వాచ్యమవైధర్మ్యం వాక్యైక్య 'ఉపమా' ద్వయోః। –సాహిత్యదర్పణే, 10–14.



*శ్లో॥ ప్రవాతనీలోత్పలనిర్విశేష –*
*యధీరవిప్రేక్షితమాయతాక్ష్యా ।*
*తయా గృహీతం ను మృగాఙ్గనాభ్య*
*స్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః ॥* **46**

***పదవిభాగము :–*** ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్, అధీరవిప్రేక్షితమ్, ఆయతాక్ష్యా, తయా, గృహీతమ్, ను, మృగాఙ్గనాభ్యః, తతః, గృహీతమ్, ను, మృగాఙ్గనాభిః.

**అన్వయక్రమము :–** ప్రవాత...శేషమ్, అధీర...తమ్, ఆయతాక్ష్యా, తయా, మృగాఙ్గనాభ్యః, గృహీతమ్, ను, మృగాఙ్గనాభిః, తతః, గృహీతమ్, ను.

**ప్రతిపదార్థము :–** ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్ = గాలి ఎక్కువగ వీస్తున్న ప్రదేశమున నల్లకలువల కంటె భేదము లేనిదైన, అధీరవిప్రేక్షితమ్ = బెదురు చూపు, ఆయాతాక్ష్యా = విశాలములైన నేత్రములు గలదైన, తయా = ఆ పార్వతీదేవి చేత, మృగాఙ్గనాభ్యః = ఆడులేడుల నుండి, గృహీతమ్ ను = గ్రహింపబడెనదా!, మృగాఙ్గనాభిః = ఆడులేడుల చేత, తతః = ఆమె (పార్వతీదేవి) వలన నుండి, గృహీతమ్ ను = గ్రహింపబడెనదా!.

**తాత్పర్యము :–** గాలి ఎక్కువగ వీస్తున్న ప్రదేశమున నల్లకలువలకంటె భేదములేనిదైన బెదురుచూపు, విశాలనేత్రములుగలదైన ఆ పార్వతీదేవి చేత ఆడులేడులనుండి గ్రహింపబడెనదా! ఆడులేడులచేత ఆ పార్వతీదేవి గ్రహింపబడినదా!

**విభక్తులు / క్రియలు :–** 1) ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్ – **నిర్విశేషమ్,** నిర్విశేషే, నిర్విశేషాణి; అకారాన్త నపుంసకలింగ '...నిర్విశేష' శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) అధీరవిప్రేక్షితమ్ – **అధీరవిప్రేక్షితమ్,** అధీరవిప్రేక్షితే, అధీరవిప్రేక్షితాని; అకారాన్త నపుంసకలింగ అధీరవిప్రేక్షిత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) ఆయతాక్ష్యా – **ఆయతాక్ష్యా,** అయతాక్షిభ్యామ్, అయతాక్షిభిః; ఇకారాన్త స్త్రీలింగ ఆయతాక్షి శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 4) తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 5) గృహీతమ్ – **గృహీతమ్,** గృహీతే, గృహీతాని; అకారాన్త నపుంసకలింగ గృహీత శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము, 6) ను – అవ్యయము. 7) తతః – అవ్యయము. 8) మృగాఙ్గనాభ్యః – మృగాఙ్గనాయాః, మృగాఙ్గనాభ్యామ్, **మృగాఙ్గనాభ్యః;** ఆకారాన్త స్త్రీలింగ 'మృగాఙ్గనా' శబ్దము, పంచమీవిభక్తి బహువచనము. 9)మృగాఙ్గనాభిః – మృగాఙ్గనయా, మృగాఙ్గనాభ్యామ్, **మృగాఙ్గనాభిః;** ఆకారాన్త స్త్రీలింగ 'మృగాఙ్గనా' శబ్దము, తృతీయావిభక్తి బహువచనము.

**సమాసాలు:–**

1) ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్ – ప్రవాతమ్–ప్రకృష్టా వాతా యత్ర (స.త.) తత్ ప్రవాతమ్, నీలోత్పలమ్ – నీలఞ్చ తద్ ఉత్పలమ్ (కర్మధా.) నిర్విశేషమ్ – విశేషాత్ నిర్గతమ్ (ప్రాదితత్పు.); ప్రవాతే నీలోత్పలమ్ (స.త.) ప్రవాతనీలోత్పలమ్; ప్రవాతనీలోత్పలాత్ నిర్విశేషమ్ (పం.త.);

2) అధీరవిప్రేక్షితమ్ – న ధీరమ్ (నఞ్తత్పు.) అధీరమ్; విప్రేక్షితమ్ – ప్రకృష్టమ్ ఈక్షితమ్ (ప్రాదితత్పు.) ప్రేక్షితమ్, విశిష్టఞ్చ తత్ ప్రేక్షితమ్ – విప్రేక్షితమ్ (కర్మధా.) అధీరఞ్చ తత్ విప్రేక్షితమ్ (కర్మధా.);

3) ఆయతాక్ష్యా – ఆయతే అక్షిణీ యస్యాః (బహుర్రీహి) సా, తయా;

4) మృగాఙ్గనాభ్యః – మృగాణాం అంగనాః (ష.త.) తాభ్యః;

5) మృగాఙ్గనాభిః – మృగాణాం అంగనాః (ష.త.) తాభిః.

**సంధులు :–** 1) మృగ + అంగనాభ్యః = మృగాంగనాభ్యః, సవర్ణదీర్ఘసన్ధిః;
2) అంగనాభ్యః + తతః = అంగనాభ్యస్తతః, విసర్గసన్ధిః.



**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **ఆయతాక్షిః** – విశాలములైన కన్నులు –సౌందర్యమునకు గుర్తుగా భావింతురు.

శ్లో॥ *గతం భయం భీరు సురారిసమ్భవం*
*త్రిలోకరక్షీ మహిమా హి వజ్రిణః ।*
*తదేతదున్మీలయ* ***చక్షురాయతం***
*నిశావసానే నలినీవ పంకజమ్ ॥ విక్రమోర్వశీయమ్ 1-6*

శ్లో॥ *ప్రియమితి వనితా నితాన్తమాగః స్మరణసరోషకషాయితాయతాక్షీ ।*
*చరణగతసఖీవచోஉనురోధాత్కిల....* *శిశుపాలవధే, 7-11*

ఈ శ్లోకభావానికి కించిత్ తుల్యమైన భావముగల ఈ దిగువనీయబడిన శ్లోకములను పరిశీలించగలరు.

శ్లో॥ *పరస్పరాక్షిసాదృశ్యమదూరోజ్ఝితవర్మసు ।*
*మృగద్వన్ద్వేషు పశ్యన్తౌ స్యన్దనాబద్ధదృష్టిషు ॥ రఘువంశమ్ 1-40*

"రథము సమీపించుటవలన బెదిరి, దారిని విడిచి, దగ్గరనే నిలిచినవై, వారి రథముపైనే తమ చూపులను నిలిపిన, లేళ్ళు జంటలయందు ఒకరొకరి కన్నుల పోలికను చూచుకొనుచు ఆ దంపతులు ఆశ్రమము వైపునకు సాగిరి. –శర్మ.

శ్లో॥ *అపి దృష్టవానసి మమ ప్రియాం వనే? కథయామి తే తదుపలక్షణం శృణు।*
*పృథులోచనా సహచరీ యథైవ సుభగం తథైవ ఖలు సాపి వీక్షతే ॥*
*విక్రమోర్వాశీయమ్ 4-32.*

శ్లో॥ *అత్యన్తమాత్మసదృశేక్షణవల్లభాభిరోహో నివత్స్యతి సమం హరిణాంకనాభిః ।*
*అభిజ్ఞానశాకున్తలమ్ -1*

**అలంకారములు :–** 'ఉత్ప్రేక్షా' మఱియు 'సందేహా'లంకారములున్ను, వాటి కలయికచే నిట సంకరాలంకారమున్నదని చెప్పదగును.



**శ్లో॥ *తస్యాశ్శలాకాఞ్జననిర్మితేవ***
***కాన్తిర్భ్రువోరాయతలేఖయోర్యా ।***
***తాం వీక్ష్య లీలాచతురామనఙ్గః***
***స్వచాపసౌన్దర్యమదం ముమోచ ॥*** **47**

**పదవిభాగము :–** తస్యాః, శలాకాఞ్జననిర్మితా, ఇవ, కాన్తిః, భ్రువోః, ఆయతలేఖయోః, యా, తామ్, వీక్ష్య, లీలాచతురామ్, అనఙ్గః, స్వచాపసౌన్దర్యమదమ్, ముమోచ.

***అన్వయక్రమము :–*** ఆయతలేఖయోః, తస్యాః, భ్రువోః, శలాకాఞ్జననిర్మితా, ఇవ, యా, కాన్తిః, లీలాచతురామ్, తామ్, వీక్ష్య, అనఙ్గః, స్వచాపసౌన్దర్యమదమ్, ముమోచ.

***ప్రతిపదార్థము :–*** ఆయతలేఖయోః = పొడవగురేఖలు కల, తస్యాః = ఆ పార్వతీదేవి యొక్క, భ్రువోః = కనుబొమ్మల సంబంధమగు, శలాకాఞ్జననిర్మితా + ఇవ = కాటుక పుడకతో నిర్మించబడినది వలెనున్న, యా = ఏ, కాన్తిః = కాంతి కలదో, లీలాచతురామ్ = విలాసము చేత సొబగుగా నున్న, తామ్ = ఆ కాంతిని, వీక్ష్య = చూచి, అనఙ్గః = మన్మథుడు, స్వచాపసౌన్దర్యమదమ్ = తన వింటి చక్కదనము వలని గర్వమును, ముమోచ = విడిచిపెట్టెను.

***తాత్పర్యము :–*** పొడవగు రేఖలు కల ఆ పార్వతీదేవి యొక్క కనుబొమ్మల సంబంధమగు కాటుక పుడకతో నిర్మించబడినది వలెనున్న ఏ కాంతి కలదో, విలాసము చేత సొబగుగా నున్న ఆ కాంతిని చూచి, మన్మథుడు తన వింటి చక్కదనము వలని గర్వమును విడిచిపెట్టెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) తస్యాః – **తస్యాః,** తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) ఇవ – అవ్యయము. 3) శలాకాంజననిర్మితా – **నిర్మితా,** నిర్మితే, నిర్మితాః; ఆకారాన్త స్త్రీలింగ నిర్మితా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) కాన్తిః – **కాన్తిః,** కాన్తీ, కాంతః; ఇకారాన్త స్త్రీలింగ కాంతి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) భ్రువోః – భ్రువః (భ్రువాః), **భ్రువోః,** భ్రూణామ్ (భ్రువామ్); ఊకారాన్త స్త్రీలింగ 'భ్రూ' శబ్దము, షష్ఠీవిభక్తి ద్వివచనము. 6) ఆయతలేఖయోః – ఆయతలేఖాయాః, **ఆయతలేఖయోః,** ఆయతలేఖానామ్; ఆకారాన్త స్త్రీలింగ ఆయతలేఖా శబ్దము, షష్ఠీవిభక్తి ద్వివచనము. 7) యా–**యా,** యే, యాః; దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) తామ్ – తామ్, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) వీక్ష్య – ల్యబన్తము (వి+ఈక్ష్య+క్త్వా). 10) లీలాచతురామ్ – **లీలాచతురామ్,** లీలాచతురే, లీలాచతురాః; అకారాన్త స్త్రీలింగ లీలాచతురా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) అనఙ్గః – **అనఙ్గః,** అనఙ్గౌ, అనఙ్గాః; అకారాన్త పుంలింగ అనఙ్గ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 12) స్వ...మదమ్ – **మదమ్,** మదౌ, మదాన్; అకారాన్త పుంలింగ మద శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) ముమోచ – క్రియ.

***సమాసాలు :–***

1) ఆయతలేఖయోః – ఆయతా లేఖా యయోః (బహువ్రీహి) తే ఆయతలేఖే, తయోః;
2) శలాకాంజననిర్మితా – శలాకాయాః అంజనమ్ (ష.త.) శలాకాంజనమ్, తేన నిర్మితా (తృ.త.);
3) లీలాచతురామ్ – లీలయా చతురా (తృ.త.) తామ్;
4) స్వచాపసౌన్దర్యమదమ్ – స్వః చాపః (కర్మధా.) స్వచాపః; స్వచాపస్య సౌందర్యమ్ (ష.త.), స్వచాపసౌందర్యస్య మదః (ష.త.) తమ్.

***సంధులు:–***

1) తస్యాః + శలాకా = తస్యాశ్శలాకా, శ్చుత్వసంధిః, స్తోః శ్చునా శ్చుః;
2) శలాక + అంజన = శలాకాంజన, సవర్ణదీర్ఘసన్ధిః, అకః సవర్ణే దీర్ఘః;



3) నిర్మితా + ఇవ = నిర్మితేవ, గుణసంధిః, ఆద్గుణః;
4) కాన్తిః + భ్రువోః = కాన్తిర్భ్రువోః, రుత్వాదేశసన్ధిః;
5) భ్రువోః + ఆయత = భ్రువోరాయత, రుత్వాదేశసన్ధిః;
6) లేఖయోః + యా = లేఖయోర్యా, రుత్వాదేశసన్ధిః

***పాఠాంతరాలు :–*** 1. ఆయతలేఖయోః – ఆయతలేఖయోః – ఆనతలేఖయోః – ఆనతరేఖయోః. 2) లీలాచికురా – లీలాచతురా. 3) యా – సా.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **ఆయతలేఖయోః –** ఆయతరేఖయోః – ఆనతలేఖయోః – ఆనతరేఖయోః

ఎ) ఆయతాలేఖా తయోః Whose outline is long or broad. This is the reading of Mallinadha. The Trivendram edition reads ఆనతరేఖాయోర్యా (The printed text reads... ఆనతరేఖయోర్వా. It is clear from the commantaries there, that the text ought to be indicated above) Which is decided better. ఆనతా (Bent) లేఖా (Lion, Form) యయోః, Whose form is bent or curved. Curved Eyebrows known to be a sign of beauty. Such is not the case with ఆయతలేఖత్వ, which, infact has no propriety whatsoever with reference to the eyebrows. The readings సా for యా also improves the sense and gets rid of the clumsiness involved in the reading with యా. Instead of saying యా కాన్తిః తాం వీక్ష్య, the poet could have easily said కాన్తిం వీక్ష్య. సా would mean తథావిధా i.e. indescribable. If we read ఆనతరేఖయోః సా యాం వీక్ష్య, the whole would be one secentance. - Karmakar.

***క్రియాదర్థము :– ముమోచ*** – ముచ్ఌ (ముచ్) మోచనే (విడుచుట) తుదాది ప్రకరణమ్ (6), సకర్మకమ్, అనిట్ (ఉభయపదీ) పరస్మైపదీ. లిట్.

(6.ముచ్, 7.విద్, 8.సిచ్ ధాతువులకు 'శేముచాదీనామ్' (సూ 7–1–59) అను సూత్రముచే 'నుమ్' (న్) ఆగమము చెప్పబడినది.

ముచ్+అ+తి – మున్చ్+అ+తి – ముంచ్+అ+తి (నకారమునకు అనుస్వారము) – ముఞ్చ్+అ+తి(అనుస్వారమునకు పరసవర్ణము) = ముఞ్చతి)

*లిట్ ప్రథమపురుషరూపాలు :* **ముమోచ –** *ముముచతుః – ముముచుః*

***అలంకారములు :–*** ఇట 'అతిశయోక్త్యలంకార'మున్నదని చెప్పదగును.

*మూ : వివక్షా యా విశేషస్య లోక సీమాతివర్తినీ ।*
*అసావతిశయోక్తిః స్యాదలంకారోత్తమా యథా ॥* కావ్యదర్శః 2-214

ఏ అలంకారమునకైనను మూలము విచిత్రవర్ణనము. లోకములో మామూలుగ కనబడని విధమున వర్ణించుట. ఇదియే అతిశయోక్తి స్వరూపము. కావుననే అతిశయోక్తి సర్వాలంకారమూలము. గాన అది అలంకారోత్తమము. భామహుడు కూడ అతిశయోక్తియే వక్రోక్తి యని చెప్పుచు –

*'సైషా సర్వైవ వక్రోక్తిరనయార్థో విభావ్యతే।*
*యత్నోఽ స్యాం కవినా కార్యః కోఽ లంకారోఽనయా వినా॥'*
*(అని చెప్పియున్నాడు. కావ్యాలంకారము 11-85) –బాలానందిని* ❁

**శ్లో॥ లజ్జా తిరశ్చాం యది చేతసి స్యా –**
**దసంశయం పర్వతరాజపుత్ర్యాః ।**
**తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యు –**
**ర్వాలప్రియత్వం శిథిలం చమర్యః ॥ 48**

***పదవిభాగము :–*** లజ్జా, తిరశ్చామ్, యది, చేతసి, స్యాత్, అసంశయమ్, పర్వతరాజపుత్ర్యాః, తమ్, కేశపాశమ్, ప్రసమీక్ష్య, కుర్యుః, వాలప్రియత్వమ్, శిథిలమ్, చమర్యః।

***అన్వయక్రమము :–*** తిరశ్చామ్, చేతసి, లజ్జా, స్యాత్, యది, అసంశయమ్, పర్వతరాజపుత్ర్యాః, తమ్, కేశపాశమ్, ప్రసమీక్ష్య, చమర్యః బాల ప్రియత్వమ్, శిథిలమ్, కుర్యుః।

***ప్రతిపదార్థము :–*** తిరశ్చామ్ = తిర్యగ్జంతువులకు, చేతసి = మనస్సు నందు, లజ్జా = సిగ్గు, స్యాత్ యది = ఉన్న యెడల, అసంశయమ్ = నిస్సందేహముగా, పర్వతరాజపుత్ర్యాః = పార్వతీదేవి యొక్క, తమ్ = ఆ, కేశపాశమ్ = కేశపాశమును (తలకట్టును), ప్రసమీక్ష్య = చూచి, చమర్యః = చమరాంగనలు, వాలప్రియత్వమ్ = తోకలయందలి ప్రీతిని, శిథిలమ్ = సడలిన దానినిగా, కుర్యుః = చేయుదురు.

***తాత్పర్యము :–*** తిర్యక్ జంతువులకు మనస్సున సిగ్గు ఉన్న యెడల నిస్సంశయముగా పార్వతీదేవియొక్క ఆ తలకట్టును చూచి చమరాంగనలు తోకలయందలి ప్రీతిని సడలిన దానినిగా చేయుదురు.

***విభక్తులు / క్రియలు :–*** 1) లజ్జా – **లజ్జా,** లజ్జే, లజ్జాః; ఆకారాన్త స్త్రీలింగ లజ్జాశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) తిరశ్చామ్ – తిరశ్చః, తిరశ్చోః, **తిరశ్చామ్,** చకారాన్త పుంలింగ తిర్యఞ్చ్ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 3) యది – అవ్యయము. 4) చేతసి – **చేతసి,** చేతసోః, చేతఃసు; సకారాన్త నపుంసకలింగ చేతస్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) స్యాత్ – క్రియ. 6) అసంశయమ్ – అవ్యయము. 7) పర్వతరాజపుత్ర్యాః – **పుత్ర్యాః,** పుత్ర్యోః, పుత్రీణామ్; ఈకారాన్త స్త్రీలింగ పర్వతరాజపుత్రీ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 8) తమ్ – **తమ్,** తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) కేశపాశమ్ – **కేశపాశమ్,** కేశపాశౌ, కేశపాశాన్; అకారాన్త పుంలింగ కేశపాశ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) ప్రసమీక్ష్య –





ప్ర+సమ్+ఈక్ష్య+క్త్వా, ల్యబన్తము. 11) కుర్యుః – క్రియ. 12) వాలప్రియత్వమ్ – వాలప్రియత్వమ్, వాలప్రియత్వే, వాలప్రియత్వాని; అకారాన్త నపుంసకలింగ వాలప్రియత్వ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) శిథిలమ్ – **శిథిలమ్,** శిథిలే, శిథిలాని; అకారాన్త శిథిల శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 14) చమర్యః – చమరీ, చమర్యౌ, **చమర్యః;** ఈకారాన్త స్త్రీలింగ చమరీ శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :–***

1) అసంశయమ్ – సంశయస్య అభావః (అవ్యయీభావసమాసము);
2) పర్వతరాజపుత్ర్యాః – పర్వతానాం రాజా (ష.త.) పర్వతరాజః, పర్వతరాజస్య పుత్రీ (ష.త.) తస్యాః;
3) కేశపాశమ్ – కేశానాం పాశః (ష.త.) తమ్;
4) వాలప్రియత్వమ్ – వాలాః ప్రియా యాసామ్ (బహువ్రీహి) తాః, వాలప్రియాః తాసాం భావః.

***సంధులు:–***

1) స్యాత్ + అసంశయమ్ = స్యాదసంశయమ్, జశ్త్వమ్, ఝలాం జశోఽన్తే.
2) కుర్యుః + వాలప్రియత్వమ్ = కుర్యుర్వాలప్రియత్వమ్, విసర్తసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. ఈ శ్లోకభావానికి కించిత్ వైవిధ్యమున్న ఈ శ్లోకాన్ని చూడండి.

*శ్లో॥ మృదుపవనవిభిన్నో మత్ప్రియాయా వినాశాద్*
*ఘనరుచిరకలాపో నిఃసపత్నోఽస్య జాతః ।*
*రతివిగళితబన్ధే కేశపాశే సుకేశ్యాః*
*సతి కుసుమసనాథే కం హరేదేష బర్హీ ॥ విక్రమోర్వశీయమ్ 3-10*

(Here the hair are compared to the peacock's plumage)

2. **లజ్జా –** ఎ) లజ్జనమితి, లస్జ వ్రీడనే + 'గురోశ్చ హలః' ఇతి అ, టాప్ అంతఃకరణ వృత్తి విశేషః

***శ్లో॥ హ్రీర్లజ్జాపత్రపా వ్రీడా త్రపా మన్దాక్షముచ్యతే ॥ 567***

అని హలాయుధకోశము '6' నామములను అందించుటయే కాక 'వివృతి' ఈ శ్లోకాన్నే – ఈ పదవివరణకు ఉదాహరణగా ఇచ్చినది.

బి) "కామాతురాణాం న భయం న లజ్జా" –సుభాషితమ్.

సి) ***శ్లో॥ స త్వం నివర్తస్య విహాయ లజ్జాం***
***గురోర్భవాన్ దర్శితశిష్యభక్తిః ।*** *–రఘువంశమ్ 2-40.*

*3)* తిర్యఞ్చ్ – తిరశ్చః, తిరశ్చోః, తిరశ్చామ్ – షష్ఠీవిభక్తిరూపాలు ఇవి. ప్రథమా విభక్తి ఏకవచన రూపం, తిర్యఙ్. తిర్–కుటిలం, అంచతి–గచ్ఛతి–ఇతి విగ్రహే పూర్వవత్ క్విన్నాదేశోత్తరం, 'తిరసస్తిర్యలోపే' ఇతి తిరసః – తిర్యాదేశే యణి కృత్వాదికం పూర్వవత్ – బృహశబ్దకుసుమాకరః

***క్రియాదర్శము :–*** 1) **స్యాత్** – 44 శ్లోకభాగవ్యాఖ్యను చూడగలరు.

2) **కుర్యుః** – డుకృఞ్ (కృ) కరణే (చేయుట) తనాదిప్రకరణమ్ (8). సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ. విధిలిఙ్. ప్రథమపురుష బహువచనరూపము.

ప్రథమపురుషరూపాలు – కుర్యాత్ – కుర్యాతామ్ – **కుర్యుః**

***అలంకారములు :–*** ఇట 'కావ్యలింగాలంకార'మున్నదని చెప్పదగును.

"ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువు చెప్పడం కావ్యలింగాలంకారము"

ఆడుచమరీమృగములు పార్వతీదేవి కేశపాశమును చూచి, తమ కేశపాశముపైనున్న విశేషాదరమును వీడినవిగా చెప్పబడుటచే నిది 'కావ్యలింగాలంకార'మని చెప్పబడును.

***లక్షణము :– 'హేతోర్వాక్యపదార్థేత్వే కావ్యలింగముదాహృతమ్'.***



***శ్లో॥ సర్వోపమాద్రవ్యసముచ్చయేన***
***యథాప్రవేశం వినివేశితేన ।***
***సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా***
***దేకస్థసౌన్దర్యదిదృక్షయేవ ॥ 49***

***పదవిభాగము :–*** సర్వ...యేన, యథాప్రవేశమ్, వినివేశితేన, సా, నిర్మితా, విశ్వసృజా, ప్రయత్నాత్, ఏకస్థసౌందర్యదిదృక్షయా, ఇవ.

***అన్వయక్రమము :–*** సా, విశ్వసృజా, ఏకస్థ...యా, ఇవ, ప్రయత్నాత్, యథాప్రవేశమ్, వినివేశితేన, సర్వో...యేన, నిర్మితా.

***ప్రతిపదార్థము :–*** సా = ఆ పార్వతీదేవి, విశ్వసృజా = బ్రహ్మచేత, ఏకస్థసౌన్దర్యదిదృక్షయా = ఒకచోటనున్న అన్ని అందములను చూచుటయందలి కోరిక చేత, ఇవ = వలె, ప్రయత్నాత్ = పూనికతో, యథాప్రవేశమ్ = ఆయాచోట, వినివేశితేన = ఉంచబడిన, సర్వోపమాద్రవ్యసముచ్చయేన = సమస్తమైన సాటి వస్తువుల సమూహముతో, నిర్మితా = సృజింపబడెను.

***తాత్పర్యము :–*** ఆ పార్వతీదేవి, బ్రహ్మచేత ఒకచోటనున్న అన్ని అందములను చూచుటయందలి కోరిక చేత వలె పూనికతో ఆయాచోట ఉంచబడిన సమస్తమైన సాటి వస్తువుల సమూహముతో సృజింపబడెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) సా – **సా**, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) విశ్వసృజా – **విశ్వసృజా,** విశ్వసృగ్భ్యామ్, విశ్వసృగ్భిః; జకారాన్త పుంలింగ విశ్వసృజ్ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 3) ఏకస్థసౌన్దర్యదిదృక్షయా – **దిదృక్షయా,** దిదృక్షాభ్యామ్, దిదృక్షాభిః; ఆకారాన్త స్త్రీలింగ దిదృక్షా శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 4) ఇవ – అవ్యయము. 5) ప్రయత్నాత్ – **ప్రయత్నాత్,** ప్రయత్నాభ్యామ్, ప్రయత్నేభ్యః; అకారాన్త పుంలింగ ప్రయత్న శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 6) యథాప్రవేశమ్ – అవ్యయము.



7) వినివేశితేన – **వినివేశితేన**, వినివేశితాభ్యామ్, వినివేశితైః; అకారాన్త పుంలింగ వినివేశిత శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 8) సర్వ...యేన – **సముచ్చయేన,** సముచ్చయాభ్యామ్, సముచ్చయైః; అకారాన్త పుంలింగ 'సర్వ...సముచ్చయ' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 9) నిర్మితా – **నిర్మితా,** నిర్మితే, నిర్మితాః, ఆకారాన్త స్త్రీలింగ నిర్మితా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము.

***సమాసాలు :–***

1) విశ్వసృజా – విశ్వం సృజతీతి (ఉపపదతత్పురుష) తేన;

2) ఏకస్థ సౌన్దర్యదిదృక్షయా – ఏకస్మిన్ తిష్ఠతీతి ( ఉపపదతత్పురుష); ఏకస్థం సౌన్దర్యమ్ (కర్మధా.) ఏకస్థసౌర్దన్యమ్; ఏకస్థసౌన్దర్యస్య దిదృక్షా (ష.త.) తయా;

3) ప్రయత్నాత్ – ప్రకృష్టః యత్నః (ప్రాది), ప్రయత్నః, తస్మాత్.

4) యథాప్రవేశమ్ – ప్రదేశమ్ అనతిక్రమ్య (అవ్యయీభావసమాసము);

5) వినివిశితేన – విశేషేణ నివేశితః (సుప్సుపా);

6) సర్వోపమాద్రవ్యసముచ్చయేన – ఉపమాయా ద్రవ్యాణి (ష.త.) ఉపమాద్రవ్యాణి, సర్వాణి చ తాని ఉపమాద్రవ్యాణి (కర్మధా.) సర్వోపమాద్రవ్యాణి, సర్వోపమా ద్రవ్యాణాం సముచ్చయః (ష.త.) తేన.

***సంధులు :–***

1) సర్వ + ఉపమా = సర్వోపమా, గుణసన్ధిః, ఆద్గుణః;

2) దిదృక్షయా + ఇవ = దిదృక్షయేవ, గుణసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. ఈ శ్లోకసారాంశాన్ని వివరించే భాగము 'మేఘదూతము' నందలి

***"తన్వీశ్యామా శిఖరి దశనా .... ధాతుః" 78***

ఇట మేఘదూతమునకు నే జేసిన 'మృణాలినీ' వ్యాఖ్య చూడగలరు.

***అలంకారములు :–*** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.



***అవతారికా :–*** నారదాగమనమ్. (నారదుని ఆగమనము)

***శ్లో॥ తాం నారదః కామచరః కదాచి –***
***త్కన్యాం కిల ప్రేక్ష్య పితుస్సమీపే ।***
***సమాదిదేశైకవధూం భవిత్రీం***
***ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య ॥ 50***

***పదవిభాగము :–*** తామ్, నారదః, కామచరః, కదాచిత్, కన్యామ్, కిల, ప్రేక్ష్య, పితుః సమీపే, సమాదిదేశ, ఏకవధూమ్, భవిత్రీమ్, ప్రేమ్ణా, శరీరార్ధహరామ్, హరస్య.

***అన్వయక్రమము :-*** కామచరః, నారదః, కదాచిత్, పితుః, సమీపే, కన్యామ్, తామ్, ప్రేక్ష్య, కిల, ప్రేమ్ణా, హరస్య, శరీరార్ధహరామ్, ఏకవధూమ్, భవిత్రీమ్, సమాదిదేశ.

***ప్రతిపదార్థము :-*** కామచరః = స్వేచ్ఛావిహారియగు (కామగమనశక్తి గల), నారదః = నారదుడు, కదాచిత్ = ఒకనాడు, పితుః = తండ్రియైన హిమవంతుని యొక్క, సమీపే = చెంతను, కన్యామ్ = అవివాహితయగు, తామ్ = ఆ పార్వతిని, ప్రేక్ష్య = చూచి, ప్రేమ్ణా కిల = ఆప్యాయత చేతను (వాత్సల్యము), హరస్య = శివుని యొక్క, శరీరార్ధహరామ్ = దేహార్ధభాగమును గైకొనుదానినిగా, ఏకవధూమ్ = ఒక్కతెయే భార్యగా, భవిత్రీమ్ = కాగలదానినిగా, సమాదిదేశ = ఆనతిచ్చెను.

***తాత్పర్యము :-*** స్వేచ్ఛావిహారియగు నారదుడు ఒకనాడు తండ్రియగు హిమవంతుని యొక్క చెంతను అవివాహితయగు ఆ పార్వతిని చూచి ఆప్యాయత చేతను శివుని యొక్క దేహార్ధభాగమును గైకొనుదానినిగా ఒక్కతెయే భార్యగా కాగలదానినిగా ఆనతిచ్చెను (దీవించెను).

***విభక్తులు / క్రియలు:-*** 1) తామ్ - **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 2) నారదః - **నారదః,** నారదౌ, నారదాః; అకారాన్త పుంలింగ నారద శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) కామచరః - **కామచరః,** కామచరౌ, కామచరాః; అకారాన్త పుంలింగ కామచర శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) కదాచిత్ - అవ్యయము. 5) కన్యామ్ - **కన్యామ్,** కన్యే, కన్యాః; ఆకారాన్త స్త్రీలింగ కన్యా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) కిల - అవ్యయము. 7) ప్రేక్ష్య - ల్యబన్తము (ప్ర + ఈక్ష్య + క్త్వా). 8) పితుః - **పితుః,** పిత్రోః, పితౄణామ్; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 9) సమీపే - **సమీపే,** సమీపయోః, సమీపేషు; అకారాన్త పుంలింగ సమీప శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 10) సమాదిదేశ - క్రియ. 11) ఏకవధూమ్ - **ఏకవధూమ్,** ఏకవధ్వౌ, ఏకవధూః; ఊకారాన్త స్త్రీలింగ వధూ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) భవిత్రీమ్ - **భవిత్రీమ్,** భవిత్ర్యౌ, భవిత్రీః; ఈకారాన్త స్త్రీలింగ భవిత్రీ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) ప్రేమ్ణా - **ప్రేమ్ణా,** ప్రేమభ్యామ్, ప్రేమభిః; నకారాన్త నపుంసకలింగ 'ప్రేమన్' శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. **(ప్రేమభ్యామ్ - భ్యామాదౌహలి 'స్వాదిష్వి' తి పదత్వాన్నల్లోపః).** 14) శరీరార్ధహరామ్ - **శరీరార్ధహరామ్,** శరీరార్ధహరే, శరీరార్ధహరాః; ఆకారాన్త స్త్రీలింగ 'శరీరార్ధహరా' శబ్దమ్, ద్వితీయావిభక్తి ఏకవచనము. 15) హరస్య - **హరస్య,** హరయోః, హరాణామ్; అకారాన్త పుంలింగ హర శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము.

***సమాసాలు :-***

1) కామచరః - కామేన చరతీతి (ఉపపదతత్పురుష);
2) శరీరార్ధహరామ్ - అర్ధం హరతీతి (ఉపపద.) అర్ధహరా, శరీరస్య అర్ధహరా (ష.త.) తామ్, శరీరార్ధహరామ్;
3) ఏకవధూమ్ - ఏకా చసౌ వధూః (కర్మధా.) ఏకవధూః, తామ్;

***సంధులు :-***

1) పితుః + సమీపే = పితుస్సమీపే, విసర్గసన్ధిః.
2) సమాదిదేశ + ఏకవధూమ్ = సమాదిదేశైకవధూమ్, వృద్ధిసన్ధిః, వృద్ధిరేచి.
3) శరీర + అర్ధహరామ్ = శరీరార్ధహరామ్, సవర్ణదీర్ఘసన్ధిః.





***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.***

1. **నారదః -** ఎ) నరాణాం సంబంధి నారమ్ జ్ఞానమ్ తద్ ద్యతి ఖణ్డయతీతి.

బి) శ్లో॥ *అహం ప్రజా స్సిసృక్షుస్తు తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।*
*ప్రచేతసం వసిష్ఠం చ భృగుం నారదమేవ చ ॥ మనుస్మృతి 1-35*

బ్రహ్మదేవుడు "ఆ తపఃప్రభావముమవల్ల ప్రజాపతులైన మహర్షులను తొలుత సృష్టిచేసినాను. వారు మరీచి....ప్రచేతసుడు, వశిష్ఠుడు, భృగువు, నారదుడు అనేవారు.

సి) "నారదస్తు దేవబ్రహ్మా పిశునః కలికారకః"

అని అభిధానచిన్తామణి 4 నామములను పేర్కొన్నది. 'కలిప్రియ' పేరున్ను నారదునకున్నది. + దేవర్షిః

***క్రియాదర్శము :- సమాదిదేశ*** - సమ్ + ఆ + దిశ, లిట్, ప్రథమపురుషైకవచనము. సమా ఉపసర్గతో కూడిన ఈ ధాతువునకు - (వాత్సల్యపూర్వకంగా, లేదా గౌరవంగా పలుకుట) అని అర్ధము. సకర్మకమ్, అనిట్ (ఉభయపదీ). పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్ (6). దిశ - అతిసర్జనే (త్యాగః, దానశ్చ)

లిట్ ప్రథమపురుష రూపాలు : **సమాదిదేశ,** సమాదిదిశతుః, సమాదిదిశుః

***అలంకారములు :-*** ఇట 'అనుప్రాస' ఉన్నదని చెప్పదగును.

శ్లోక ప్రథమార్ధంలో 'క' వర్ణము పెక్కుసార్లు పునరావృతమగుటచే 'అనుప్రాస' గా చెప్పదగును.



**శ్లో॥ గురుః ప్రగల్భేఽపి వయస్యతోఽస్యా-**
**స్తస్థౌ నివృత్తాన్యవరాభిలాషః ।**
**ఋతే కృశానో ర్న హి మన్త్రపూత-**
**మర్హన్తి తేజాంస్యపరాణి హవ్యమ్ ॥ 51**

***పదవిభాగము :-*** గురుః, ప్రగల్భే, అపి, వయసి, అతః, అస్యాః, తస్థౌ, నివృత్తాన్య వరాభిలాషః, ఋతే, కృశానోః, న, హి, మంత్రపూతమ్, అర్హన్తి, తేజాంసి, అపరాణి హవ్యమ్.

***అన్వయక్రమము :-*** గురుః, అతః, అస్యాః, ప్రగల్భే, వయసి, అపి, నివృత్తాన్యవరాభిలాషః, (సన్) తస్థౌ, మన్త్రపూతమ్, హవ్యమ్, కృశానోః, ఋతే, అపరాణి, తేజాంసి, న, అర్హన్తి.

***ప్రతిపదార్థము :-*** గురుః = తండ్రియగు హిమవంతుడు, అతః = ఇందువలన, అస్యాః = ఈమెకు (పార్వతీదేవికి), ప్రగల్భే వయసి అపి = నిండు వయస్సునందు సైతము, నివృత్త +అన్య వరాభిలాషః (సన్) = విడువబడిన ఇతరవరుని యందలి కోరిక గలవాడై, తస్థౌ

= ఉండెను, మన్త్రపూతమ్ = మంత్రములచే సంస్కరింపబడిన హవ్యమ్ = ఆహుతిని, కృశానోః ఋతే = అగ్నిదేవుడు తప్ప, అపరాణి = ఇతరములగు, తేజాంసి = తేజస్సులు, న అర్హన్తి = నార్హన్తి = గ్రహింపదగవు.

**తాత్పర్యము :-** తండ్రియగు హిమవంతుడు పార్వతీదేవికి నిండువయస్సు వచ్చినను ఇతరుని కీయదలంపక యూరకుండెను. ఏలయన మంత్రసంస్కృతమయిన ఆహుతిని అగ్నిదేవుడు తప్ప ఇతర తేజస్సులు గ్రహింపదగవుగదా! (పార్వతీదేవిని స్వీకరించుటకు అప్పరమశివుడు తప్ప అన్యుడు తగడుగదా! యని భావము).

**లోకోక్తి :-** **ఋతే కృశానో ర్న హి మన్త్రపూత**
**మర్హన్తి తేజాంస్యపరాణి హవ్యమ్ ।**

**విభక్తులు / క్రియలు :-** 1) గురుః – **గురుః,** గురూ, గురవః; ఉకారాన్త పుంలింగ గురు శబ్దము,ప్రథమావిభక్తి ఏకవచనము. 2) అపి – అవ్యయము. 3) ప్రగల్భే – **ప్రగల్భే,** ప్రగల్భయోః, ప్రగల్భేషు; అకారాన్త నపుంసకలింగ ప్రగల్భ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 4) వయసి – **వయసి,** వయసోః, వయఃసు; సకారాన్త నపుంసకలింగ వయస్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) అతః – అవ్యయము. 6) అస్యాః – **అస్యాః,** అనయోః, ఆసామ్; మకారాన్త స్త్రీలింగ ఇదమ్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 7) తస్థౌ – క్రియ. 8) నివృత్తాన్యవరాభిలాషః – **అభిలాషః,** అభిలాషౌ, అభిలాషాః; అకారాన్త పుంలింగ అభిలాష శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) ఋతే – అవ్యయము. 10) కృశానోః – **కృశానోః,** కృశానుభ్యామ్, కృశానుభ్యః; ఉకారాన్త పుంలింగ కృశాను శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. (ఋతే పద సంబంధమున). 11) న, హి – అవ్యయాలు. 12) మంత్రపూతమ్ – **మంత్రపూతమ్,** మంత్రపూతే, మంత్రపూతాని; అకారాన్త నపుంసకలింగ మంత్రపూత శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) హవ్యమ్ – **హవ్యమ్**, హవ్యే, హవ్యాని; అకారాన్త నపుంసకలింగ హవ్య శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 14) తేజాంసి – తేజః, తేజసీ, తేజాంసి; సకారాన్త నపుంసకలింగ తేజశ్శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 15) అపరాణి – అపరమ్, అపరే, **అపరాణి,** అకారాన్త నపుంసకలింగ అపర శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

**సమాసాలు :-**

1) నివృత్తాన్యవరాభిలాషః – అన్యః చాసౌ వరః (కర్మధా.) అన్యవరః, అన్యవరే అభిలాషః (స.త.) అన్యవరాభిలాషః, నివృతః అన్యవరాభిలాషః యస్య (బహువ్రీహి) సః;
2) మంత్రపూతమ్ – మంత్రేణ పూతమ్ (తృ.త.)

**సంధులు :-**

1) ప్రగల్భే + అపి = ప్రగల్భేఽపి, పూర్వరూపసన్ధిః.
2) వయసి + అతః = వయస్యతః, యణాదేశసన్ధిః, ఇకో యణచి.
3) అతః + అస్యాః = అతోఽస్యాః, పూర్వరూపసన్ధిః.
4) అస్యాః + తస్థౌ = అస్యాస్తస్థౌ, విసర్గసన్ధిః, విసర్జనీయస్య సః (సూ 8-3-34) కఠిన హల్లులు పరముగా నున్నప్పుడు విసర్గమునకు సకారాదేశమువచ్చును.
5) నివృత్త + అన్యవర + అభిలాషః = నివృత్తాన్యవరాభిలాషః, సవర్ణదీర్ఘసన్ధిః.





6) కృశానోః + న = కృశానోర్న, విసర్గసన్ధిః, ససజుషో రుః (సూ 8-2-66).
7) తేజాంసి + అపరాణి = తేజాంస్యపరాణి, యణాదేశసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **హవ్యమ్ –** ఎ) దేవతలకు సమర్పించే నియమితాన్నమునకు హవ్యమని, పితృదేవతలకు సమర్పించే నియమితాన్నమునకు కవ్యమని పేరు.

బి) శ్లో॥ *'మమేష్టం నిత్యశో హవ్యైర్మన్త్రైః సంపూజ్య పావకమ్'* రామాయణమ్ *7-30-13.*

"...నాకు ఎల్లప్పుడు హవ్యములచేత మంత్రములచే అగ్నిని పూజించి..."

సి) హవ్యకవ్యే దైవ పైత్రే అన్నే.... అమరకోశము.

2. **కృశానుః** – పుం. ఎ) కృశ్యతి తనూకరోతి తృణకాష్ఠాదివస్తుజాతమితి. 'ఋతన్యంజీతి' ఆనూక్ ప్రత్యయః

బి) శ్లో॥ ***సప్తార్చిర్బహులః శిఖీ హుతవహో వైశ్వానరోఽగ్నిర్వసు –***
***ర్వహ్నిర్వాయుసఖః సితేతరగతిః స్వాహాప్రియః పావకః ।***
***అర్చిష్మాన్ జ్వలనః కృశాను రనలో ధూమధ్వజో హవ్యవాట్***
***బర్హిర్జ్యోతిరుషర్బుధశ్చ దహనః స్యాచ్చిత్రభానుః శుచిః ॥*** ***62***

శ్లో॥ ***కృపీటయోనిర్దమునాః కృష్ణవర్త్మాశుశుక్షణిః ।***
***విభావసురాపాంపిత్తం జాతవేదాస్తనూనపాత్ ॥*** ***63***

శ్లో॥ ***వీతహోత్రో బృహద్భానురాశ్రయాశో ధనంజయః ।***
***హిరణ్యరేతా స్తమోఘ్నో రోహితాశ్వో హుతాశనః ॥*** ***64***

అని 'కృశాను' నకు 39 నామములను హలాయుధకోశము ఇచ్చినది.

సి) శ్లో॥ ***ప్రదక్షిణప్రక్రమణాత్ కృశానో –***
***రుదర్చిషస్తన్మిథునం చకాశే ।***
***మేరోరుపాన్తేష్వివ వర్తమాన –***
***మన్యోన్యసంసక్తమహస్త్రియామమ్ ॥*** *రఘువంశమ్ 7-24*

మేరు పర్వతము చుట్టును ఒకదాని వెనుక ఒకటిగా తిరుగు పగలు రాత్రుల వలె ఒకరి వెనుక ఒకరు కలసి బాగుగా జ్వాలలతో వెలుగొందు అగ్నికి ప్రదక్షిణము నాచరించి, ఆ జంట తేజరిల్లెను.

***క్రియాదర్శము :-*** 1) **తస్థౌ –** ష్ఠా (స్థా) గతి నివృత్తౌ (నిలుచుట) భ్వాదిప్రకరణమ్ (1). అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లిట్ ప్రథమపురుషైకవచనమ్.

ప్రథమపురుషరూపాలు : **తస్థౌ** – తస్థతుః – తస్థుః

2) **అర్చన్తి** – అర్చ (అర్చ్) పూజాయామ్ (పూజించుట) భ్వాదిప్రకరణమ్ (1). సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్ ప్రథమపురుష బహువచనము.

ప్రథమపురుషరూపాలు : అర్చతి – అర్చతః – **అర్చన్తి**

శ్లో॥ తం సన్తః శ్రోతుమర్హన్తి సదసద్వ్యక్తి హేతవః ।
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా ॥ *–రఘువంశమ్ 1-10*

***అలంకారములు :*** – ఇట 'అర్థాంతరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :*** – ***శ్లో॥ హి శబ్దేనాపి హేత్వర్థప్రథనాదుక్తసిద్ధయే ।***
***అయమర్థాన్తరన్యాసః సుతరాం వ్యజ్యతే యథా ॥*** *–కావ్యాలంకారః 2-73*

ముందుగ చెప్పబడిన విషయము సిద్ధించుటకై హేతువు అనెడి అర్థమును చెప్పుట వలన **'హి'** శబ్దప్రయోగము చేత కూడ, అర్థాన్తరన్యాసము సూచింపబడెను. –బాలానందిని. ❀

***అవతారికా*** – తర్హి తమేవాహూయ దీయతామిత్యాశఙ్క్యాహ ।

అయినచో ఆ పరమేశ్వరునే పిలిచి పిల్లని స్వీకరింపుమని అడగవచ్చును కదా! ఈభావమునకు సమాధానము ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ అయాచితారం న హి దేవమద్రి–**
**స్సుతాం ప్రతిగ్రాహయితుం శశాక ।**
**అభ్యర్థనాభఙ్గభయేన సాధు–**
**ర్మాధ్యస్థ్యమిష్టేऽప్యవలమ్బతేऽర్థే ॥ 52**

***పదవిభాగము :*** – అయాచితారమ్, న, హి, దేవమ్, అద్రిః, సుతామ్, ప్రతిగ్రాహయితుమ్, శశాక. అభ్యర్థనాభఙ్గభయేన, సాధుః, మాధ్యస్థ్యమ్, ఇష్టే, అపి, అవలమ్బతే, అర్థే.

***అన్వయక్రమము :*** – అద్రిః, అయాచితారమ్, సుతామ్, ప్రతిగ్రాహయితుమ్, న శశాక, హి, సాధుః, అభ్యర్థనాభఙ్గభయేన, ఇష్టే, అపి, అర్థే, మాధ్యస్థ్యమ్, అవలమ్బతే ।.

***ప్రతిపదార్థము :*** – అద్రిః = హిమవంతుడు, అయాచితారమ్ = అడుగని వాడైన, దేవమ్ = శివుని గూర్చి, ప్రతిగ్రాహయితుమ్ = స్వీకరింప జేయుటకు, న శశాక = సమర్థుడు కాడాయెను, హి = ఏలయన, సాధుః = సత్పురుషుడు, అభ్యర్థనాభఙ్గభయేన = ప్రార్థనయొక్క సఫలత్వము వలని భయము చేత, ఇష్టే అర్థే అపి = ఇష్టమైన కార్యమునందునను, మాధ్యస్థ్యమ్ = ఉదాసీనత్వమును, అవలమ్బతే = వహించుచున్నాడు.

***తాత్పర్యము :*** – హిమవంతుడు అడుగనివాడైన శివుని గూర్చి తన కుమారితను ఇచ్చుటకు సమర్థుడు కాడాయెను. ఏలయన సత్పురుషుడు తన ప్రార్థన విఫలమగునని భయము చేత ఇష్టమైన కార్యమునందునను ఉదాసీనత్వమును వహించుచున్నాడు.



***"శ్లో॥ అయాచితాని దేయాని సర్వద్రవ్యాణి భారత ।***
***అన్నం విద్యా తథా కన్యా అనర్థిభ్యో న దీయతే ॥"***

***విభక్తులు / క్రియలు :*** –1) అద్రిః – **అద్రిః,** అద్రీ, అద్రయః; ఇకారాన్తపుంలింగ అద్రి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) అయాచితారమ్ – **అయాచితారమ్,** అయాచితారౌ, అయాచితారాన్; అకారాన్త పుంలింగ అయాచితార శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 3) దేవమ్ – **దేవమ్,** దేవౌ, దేవాన్; అకారాన్తపులింగ దేవశబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 4) సుతామ్ – **సుతామ్,** సుతే, సుతాః; ఆకారాన్తస్త్రీలింగ 'సుతా' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) ప్రతిగ్రాహయితుమ్ – ప్రతి + గ్రాహ్ + ణిచ్ + తుమున్ ప్రత్యయము; అవ్యయము. 6) న – అవ్యయము. 7) శశాక – క్రియ (లిట్). 7) సాధుః – **సాధుః,** సాధూ, సాధవః; ఉకారాన్త పుంలింగ సాధుశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 8) అభ్యర్థనాభఙ్గభయేన – **భయేన,** భయాభ్యామ్, భయేభ్యః; అకారాన్తనపుంసకలింగ భయశబ్దము, తృతీయా విభక్తి ఏకవచనము. 9) అపి – అవ్యయము. 10) ఇష్టే – **ఇష్టే,** ఇష్టయోః, ఇష్టేషు; అకారాన్తనపుంసకలింగ ఇష్టశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 11) అర్థే – **అర్థే,** అర్థయోః, అర్థేషు; అకారాన్త నపుంసకలింగ అర్థశబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 12) మాధ్యస్థ్యమ్ – **మాధ్యస్థ్యమ్,** మాధ్యస్థ్యే, మాధ్యస్థ్యాని; అకారాన్త నపుంసకలింగ మాధ్యస్థ్య శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) అవలమ్బతే – క్రియ (లట్).

***సమాసాలు :*** – 1) అయాచితారమ్ – న యాచితా (నఞ్తత్పు) అయాచితా, తమ్. 2) అభ్యర్థనాభఙ్గభయమ్ – అభ్యర్థనాయా భఙ్గః (ష.త.) అభ్యర్థనాభఙ్గః, అభ్యర్థనాభఙ్గాత్ భయమ్, (పం.త.) అభ్యర్థనాభఙ్గభయమ్, తేన.

***సంధులు :*** – 1) అద్రిః + సుతామ్ = అద్రిస్సుతామ్, విసర్గసన్ధిః. 2) సాధుః + మాధ్యస్థ్యమ్ = సాధుర్మాధ్యస్థ్యమ్, విసర్గసన్ధిః. 3) ఇష్టే + అపి = ఇష్టేऽపి, పూర్వరూపసన్ధిః. 4) అవలమ్బతే + అర్థే = అవలమ్బతేऽర్థే, పూర్వరూపసన్ధిః.

***పాఠాంతరాలు :*** –

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1) సాధుః – ఎ) సాధ్నోతి పరకార్యాణి ఇతి సాధుః. 'సాధ్ సంసిద్ధౌ' ధాతోః 'కృవాపాజిమిస్వది సాధ్యశూభ్య ఉణ్' ఇతిఉణ్ ప్రత్యయః.

బి) 'మహకులకులీనార్య సభ్యసజ్జనసాధవః' – అని అమరము.

సి) 'సాధుర్వాధుషికే చారౌ సజ్జనే చాభిధేయవత్ – అని విశ్వకోశము.

డి) సాధ్నోతి ధరమ్మం కర్మేతి సాధుః సజ్జనః.

ఇ) 'న కించిద్వచనం రాజన్నబ్రవీత్ సాధ్వసాధు వా' – మహభారతే 1-107-8.

ఎఫ్) ***శ్లో॥ న ప్రహృష్యది సమ్మానే నావమానేన కుప్యతి ।***
***న క్రుద్ధః పురుషం బ్రూయాదేతత్ సాధోऽస్తు లక్షణమ్।*** *– గారుడే (113/42)*

జి) ***శ్లో॥ త్యక్తాత్మసుఖభోగేచ్ఛాః సర్వసత్త్వసుఖైషిణః ।***
***భవన్తి పరదుఃఖేన సాధవో నిత్యదుఃఖితాః ॥***

***శ్లో॥ పరదుఃఖాతురా నిత్యం స్వసుఖాని మహాన్త్యపి ।***
***నాపేక్షే మహాత్మానః సర్వభూతహితే రతాః ॥***

***శ్లో॥ పరార్థముద్యతాః సన్తః సన్తః కిం కిం న కుర్వతే ।***
***ఆత్మానం పీడయిత్వాపి సాధుః సుఖయతే పరమ్ ।***

***శ్లో॥ ప్రహ్లాదయన్నాశ్రితాన్ వృక్షో దుఃఖఞ్చ సహతే స్వయమ్ ॥*** – ఇతి వహ్నిపురాణే.

హెచ్) ***శ్లో॥ అద్ధా శ్రియం పాలితసఙ్గరాయ***
***ప్రత్యర్పయిష్యనఘం స సాధుః ।***
***హత్వా నివృత్తాయ మృధే ఖరాదీన్***
***సంరక్షితాం త్వామివ లక్ష్మణో మే ॥*** *రఘువంశమ్ 13-65*

"....సజ్జనుడైన భరతుడు, తానేమాత్రమును అనుభవింపక, కేవలం సంరక్షించిన రాజ్యలక్ష్మిని తండ్రి ప్రతిజ్ఞను నెరవేర్చిన నాకు, ఇప్పుడు అప్పగింపబోవుచున్నాడు.

ఐ) ***శ్లో॥ ఏభిః సాధో! హృదయనిహితై.......***
***......పుష్యతి స్వామభిఖ్యామ్ ।*** *మేఘదూతమ్ -76.*

***" ఓ సంసిద్ధుడా! మేఘుడా! హృదయమునందు మఱువని......***

**క్రియాదర్శము :–** 1) **శశాక** – శక్ల (శక్) శక్తౌ (సమర్థగుట) స్వాదిప్రకరణమ్ (5). అకర్మకమ్,అనిట్, పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషైకవచనమ్, ప్రథమపురుషరూపాలు – **శశాక** – శేకతుః – శేకుః.

2) **అవలమ్బతే** – అవ, ఉపసర్గ, అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్, ప్రథమ పురుష ఏకవచనమ్.

భ్వాదిప్రకరణమ్ (1) లభి (శబ్దౌ) శబ్దించుట అవలమ్బతే – ఆశ్రయమిచ్చుట/హించుట అను అర్థము వచ్చును, ప్రథమపురుషరూపాలు–**అవలమ్బతే** – అవలమ్బేతే – అవలమ్బన్తే.

**అలంకారములు :–** ఇట 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. సామాన్యముచే విశేషణము సమర్థింపబడుటచే నిది అర్థాంతరన్యాసము. శ్లోక ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడినదిక్కడ.

**లక్షణము :–** ***సామాన్యం వా విశేషేణ విశేషస్తేన వా యది ।***
***కార్యం చ కారణేనేదం కార్యేణ చ సమర్థ్యతే ।***
***సాధర్మ్యేణేత రేణార్థాన్తరన్యాసోఽష్టధా తతః ॥*** *సాహిత్యదర్పణే – 10-61, 62.*





**అవతారికా :–** శివస్య వైరాగ్యమ్ – తపశ్చ (శివుని వైరాగ్యము – తపస్సు)

న చ తథైవ స్థితః కిం తూపాయాన్తరం చిన్తితవానితి వక్తుం ప్రస్తౌతి. హిమవంతుడు అట్లు కేవలం ఉదాసీనుడై ఉండలేదు. తన కూతురు వివాహమునకు ఉపాయాంతరమును ఆలోచించినాడని చెప్పుటకు క్రింది శ్లోకము ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥ యదైవ పూర్వే జననే శరీరం సా**
**దక్షరోషాత్సుదతీ ససర్జ ।**
**తదా ప్రభృత్యేవ విముక్తసఙ్గః**
**పతిః పశూనామపరిగ్రహోఽభూత్ ॥ 53**

**పదవిభాగము :–** యదా, ఏవ, పూర్వే, జననే, శరీరమ్, సా, దక్షరోషాత్, సుదతీ, ససర్జ, తదా, ప్రభృతి, ఏవ, విముక్తసఙ్గః, పతిః, పశూనామ్, అపరిగ్రహః, అభూత్.

**అన్వయక్రమము :–** సుదతీ, సా, పూర్వే, జననే, యదా, దక్షరోషాత్, శరీరమ్, ససర్జ, తదా, ప్రభృతి, ఏవ, పశూనామ్, పతిః, విముక్తసఙ్గః, (సన్) అపరిగ్రహః, అభూత్.

**ప్రతిపదార్థము :–** సుదతీ = సుశోభిత దంతములు గలదైన, సా = ఆ పార్వతీదేవి, పూర్వే జననే = క్రిందటి జన్మమునందు, యదా ఏవ = ఏ సమయమందు, దక్షరోషాత్ = తండ్రియగు దక్షుని యందు కోపము చేత, శరీరమ్ = దేహమును, ససర్జ = విడిచెనో, తదా ప్రభృతి + ఏవ = అది మొదలుగానే, పశూనామ్ పతిః = శివుడు, విముక్తసఙ్గః = విడువబడిన విషయాభిలాష గలవాడై, అపరిగ్రహః = భార్యలేనివాడుగా, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :–** సుశోభితదంతములు గలదైన ఆ పార్వతీదేవి క్రింది జన్మము నందు ఏ సమయమందు తండ్రియగు దక్షుని యందు కోపముచేత దేహమును విడిచెనో, అది మొదలుగానే శివుడు విడువబడిన విషయాభిలాష గలవాడై, భార్యలేని వాడుగా ఆయెను.

**విభక్తులు / క్రియలు :–** 1) సుదతీ – **సుదతీ,** సుదత్యౌ, సుదత్యః; ఈకారాన్త స్త్రీలింగ సుదతీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) పూర్వే – **పూర్వే,** పూర్వయోః, పూర్వేషు; అకారాన్త నపుంసకలింగ పూర్వ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 4) జననే – **జననే,** జననయోః, జనన్యేషు; అకారాన్త నపుంసకలింగ జనన శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 5) యదా, ఏవ – అవ్యయాలు. 6) దక్షరోషాత్ – **దక్షరోషాత్,** దక్షరోషాభ్యామ్, దక్షరోషేభ్యః; అకారాన్త పుంలింగ దక్షరోష శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 7) శరీరమ్ – **శరీరమ్,** శరీరే, శరీరాణి; అకారాన్త నపుంసకలింగ శరీర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) ససర్జ – క్రియ (లిట్). 9) తదా, ప్రభృతి, ఏవ – అవ్యయాలు. 10) పతిః – **పతిః,** పతీ, పతయః; ఇకారాన్త పుంలింగ పతి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 11) పశూనామ్ – పశోః, పశ్వోః, **పశూనామ్;** ఉకారాన్త పుంలింగ పశు శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 12) విముక్తసంగః – **విముక్తసఙ్గః,** విముక్తసఙ్గౌ, విముక్తసంగాః; అకారాన్త పుంలింగ విముక్తసంగ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 13) అపరిగ్రహః – **అపరిగ్రహః,** అపరిగ్రహౌ, అపరిగ్రహాః; అకారాన్త పుంలింగ అపరిగ్రహ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 14) అభూతే – క్రియ (లఙ్)

**సమాసాలు :-**

1) సుదతీ – శోభనా దన్తా యస్యాః (బహువ్రీహి) సా;

2) దక్షరోషాత్ – దక్షే రోషః (స.త.) తస్మాత్;

3) విముక్తసంగః – విముక్తః సంగః యేన (బహువ్రీహి) సః;

4) అపరిగ్రహః – అవిద్యమానః పరిగ్రహః యస్య (బహువ్రీహి) సః.

**సంధులు :-**

1) యదా + ఏవ = యదైవ, వృద్ధిసన్ధిః, వృద్ధిరేచి (సూ 6-1-85);

2) ప్రభృతి + ఏవ = ప్రభృత్యేవ, యణాదేశసన్ధిః, ఇకో యణచి (సూ 6-1-74);

3) అపరిగ్రహః + అభూత్ = అపరిగ్రహోఽభూత్, ఉత్వాదేశవిసర్గసన్ధిః.

**పాఠాంతరాలు :-** 1) సుదతీ ససర్జ – స్వయసుత్ససర్జ. 2) జననే – జ్వలనే, 3) దక్షరోషాత్సుదతీ – దక్షరోషాత్తు సతీ.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **అపరిగ్రహః –** ఎ) పరిగ్రహః – 1) పత్నీ, భార్యా. 2) పరిగ్రహణమితి. పరి + గ్రహ్ + గ్రహవృదృనిశ్చిగమశ్చ ఇతి అప్.

3) *శ్లో॥ పరివారః పరికరః పరిస్పన్దః పరిగ్రహః ।*
*తథోపకరణం ప్రోక్తం పరివర్హః పరిచ్ఛదః ॥* ***306***

హలాయుధకోశము 7 నామములను పేర్కొన్నది.

*శ్లో॥ నివవృతే స మహార్ణవరోధసః*
*సచివకారితబాలసుతాంజలీన్ ।*
*సమనుకమ్ప్య సపత్నపరిగ్రహా–*
*ననలకానలకానవమాం పురీమ్ ॥* *రఘువంశమ్ 9-14.*

"...భర్తృమరణముచే ముంగుమల నలంకరించుకొనని శత్రు రాజులభార్యలను కనికరించి, ...."

*శ్లో॥ తథేతి ప్రతిజగ్రాహ ప్రీతిమాంత్సపరిగ్రహః ।*
*ఆదేశం దేశకాలజ్ఞశ్శిష్యశ్శాసితురానతః ॥ రఘువంశమ్ 1-92*

దేశకాల పరిస్థితులనెరిగిన దిలీపుడు భార్య యగు సుదక్షిణతో కూడినవాడై వినయవంతుడై, సంతోషముతో తన గురువగు వశిష్ఠుని ఆజ్ఞను అట్లే స్వీకరించెను.

*శ్లో॥ పరిగ్రహ బహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య నః ।*
*సముద్రరసనా చోర్వీ సఖీ చ యువయోరియమ్ ॥* ***అ.శా. 3-23***



**క్రియాదర్శము :-** 1) **ససర్జ** – సృజ – విసర్గే, తుదాదిప్రకరణమ్ (6). సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లిట్ ప్రథమపురుషైకవచనము.

ప్రథమపురుషరూపాలు : **ససర్జ** – ససర్జతుః – ససృజుః

2) **అభూత్** – భూ (సత్తాయామ్) ఉండుట. భ్వాదిప్రకరణమ్ (1), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లుజ్ ప్రథమపురుషైకవచనము.

ప్రథమపురుషరూపాలు : **అభూత్** – అభూతామ్ – అభూవన్.

**అలంకారములు :-** ఇట 'కావ్యలింగాలంకార'మున్నదని చెప్పదగును.

'ఏదైనా ఒక విషయం చెప్పి దానికి హేతువు చెప్పడం కావ్యలింగాలంకారము'.

'శివుడు విడువబడిన విషయాభిలాష గలవాడని చెప్పుటకు హేతువు గత జన్మము నందు పార్వతీదేవి దేహమును విడుచుట' అని చెప్పబడినది గనుక ఇది కావ్యలింగాలంకార మని చెప్పదగును.

**శ్లో॥ స కృత్తివాసాస్తపసే యతాత్మా**
**గఙ్గాప్రవాహోక్షితదేవదారు ।**
**ప్రస్థం హిమాద్రేర్మృగనాభిగన్ధి**
**కిఞ్చిత్క్వణత్కిన్నరమధ్యువాస ॥ 54**

**పదవిభాగము :-** సః, కృత్తివాసాః, తపసే, యతాత్మా, గఙ్గా...దారు, ప్రస్థమ్, హిమాద్రేః, మృగనాభిగన్ధి, కిఞ్చిత్, క్వణత్, కిన్నరమ్, అధ్యువాస.

**అన్వయక్రమము :-** కృత్తివాసాః, యతాత్మా, సః, తపసే, గఙ్గా...దారు, మృగనాభిగన్ధి, క్వణత్కిన్నరమ్, కిఞ్చిత్, హిమాద్రేః, ప్రస్థమ్, అధ్యువాస.

**ప్రతిపదార్థము :-** కృత్తివాసాః = తోలు వస్త్రముగా గలవాడైన, యతాత్మా = నియతమగు చిత్తము గలవాడగు, సః = ఆ శివుడు, తపసే = తపస్సు కొఱకు, గంగా ప్రవాహ + ఉక్షిత దేవదారు = గంగా ప్రవాహము చేత తడుపబడిన దేవదారు వృక్షములు గలదియు, మృగనాభిగన్ధి = కస్తూరి పరిమళముగలదియు, కించిత్ క్వణత్కిన్నరమ్ = ఇంచుక పాడుచున్న కిన్నరులు గలదియు అగు, హిమాద్రేః = హిమవంతుని యొక్క, ప్రస్థమ్ = చరియను, అధ్యువాస = పొందెను.

**తాత్పర్యము :-** తోలు వస్త్రముగా గలవాడైన, నియతమగు చిత్తము గలవాడగు ఆ శివుడు తపస్సు కొఱకు గంగా ప్రవాహము చేత తడుపబడిన దేవదారు వృక్షములు కలదియు, కస్తూరి పరిమళము గలదియు, ఇంచుక పాడుచున్న కిన్నరులు గలదియు అగు హిమవంతుని యొక్క చరియను పొందెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) కృత్తివాసాః – **కృత్తివాసాః,** కృత్తివాససౌ, కృత్తివాససః; సకారాన్త పుంలింగ కృత్తివాసస్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) యతాత్మా – **యతాత్మా,** యతాత్మానౌ, యతాత్మానః; నకారాన్త పుంలింగ ఆత్మన్ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) సః – **సః,** తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) తపసే – **తపసే,** తపోభ్యామ్, తపోభ్యః; సకారాన్త నపుంసకలింగ తపస్ శబ్దము, చతుర్థీవిభక్తి ఏకవచనము. 5) గంగా....దారు – **....దారు,** ....దారునీ, ....దారూని; ఉకారాన్త నపుంసకలింగ ....దారు శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) మృగనాభిగన్ధి – **...గన్ధి,** ...గన్ధినీ, ...గన్ధీని; ఇకారాన్త నపుంసకలింగ ...గన్ధి శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) క్వణత్కిన్నరమ్ – **క్వణత్కిన్నరమ్,** క్వణత్కిన్నరే, క్వణత్కిన్నరాణి; అకారాన్త నపుంసకలింగ క్వణత్కిన్నర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 8) హిమాద్రేః, **–హిమాద్రేః,** హిమాద్ర్యోః, హిమాద్రీణామ్; ఇకారాన్త పుంలింగ హిమాద్రి శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 9) ప్రస్థమ్ – **ప్రస్థమ్,** ప్రస్థే, ప్రస్థాని; అకారాన్త నపుంసకలింగ ప్రస్థ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము.

***సమాసాలు:–***

1) కృత్తివాసాః – కృత్తిః వాసః యస్య (బహువ్రీహి) సః;
2) యతాత్మా – యతః ఆత్మా యస్య (బహువ్రీహి) సః;
3) గంగాప్రవాహోక్షితదేవదారు – గంగయాః ప్రవాహః (ష.త.) గంగాప్రవాహః, గంగాప్రవాహేణ ఉక్షితాః (తృ.త.) దేవదారవః, యస్మిన్ (బహువ్రీహి) తత్;
4) మృగనాభిగన్ధి – మృగనాభేః గన్ధః (ష.త.) మృగనాభిగన్ధః, సః అస్యాస్తీతి తత్ (బహువ్రీహి);
5) క్వణత్కిన్నరమ్ – క్వణన్తః కిన్నరాః యస్మిన్ (బహువ్రీహి) తత్;
6) హిమాద్రేః – హిమస్య అద్రిః (ష.త.) యస్య.

***సంధులు :–***

1) కృత్తివాసాః + తపసే = కృత్తివాసాస్తపసే, విసర్గసన్ధిః.
2) ప్రవాహ + ఉక్షిత = ప్రవాహోక్షిత, గుణసన్ధి, ఆద్గుణః (సూ 6-1-84).
3) హిమాద్రేః + మృగనాభిగన్ధి = హిమాద్రేర్మృగనాభిగన్ధి, విసర్గసన్ధిః.
4) అధి + ఉపాస = అధ్యుపాస, యణాదేశసన్ధిః, ఇకో యణచి (సూ 6-1-74).

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. కృత్తివాసాః – ఎ) సకారాంత పుంలింగము. బి) కృత్తిర్గజాసురస్య చర్మ వాసో యస్య.
సి) కృత్తివాసః – ఇత్యకారాన్తపక్షే కృత్తిం వసతే ఇతి, వస్ ఆచ్ఛాదనే 'కర్మణ్యణ్'.
డి) ***శ్లో॥ ఈశానః శశిశేఖరః పశుపతిః శూలీ శివః శంకరః
శర్వః శమ్భురుమాపతిశ్చ గిరిశః శ్రీకణ్ఠ ఉగ్రో హరః ।
సర్వజ్ఞస్త్రిపురాన్తకస్త్రినయనో రుద్రః కపర్దీ భవో
భూతేశః పరమేశ్వరోఽన్ధకరిపుర్దక్షాధ్వర ధ్వంసకృత్ ॥ 11***



***శ్లో॥ స్థాణుః స్రష్టా ధూర్జటిర్వామదేవః
కామధ్వంసీ వ్యోమకేశః కపాలీ ।
నీలగ్రీవో వహ్నిరేతాః పినాకీ
భీమో భర్గః కృత్తివాసా వృషాంకః ॥ 12***

***శ్లో॥ అహిర్బుధ్నో విరూపాక్షః శిపివిష్టో గణాధిపః ।
గంగాధరో మహాదేవో మృడః స్యాన్నీలలోహితః ॥ 13***

అని హలాయుధకోశము **'కృత్తివాసాః'** పదమునకు 45 నామములను పేర్కొన్నది.

ఇ) ఇట మహాకవి శ్రీకాళిదాస విరచిత 'మాళవికాగ్నిమిత్ర' నాటక ప్రథమాంక ప్రథమ శ్లోకాన్ని అనుసంధానం చేసుకొనదగును –*మాళవికాగ్నిమిత్రమ్ 1-1*

***శ్లో॥ ఏకైశ్వర్యే స్థితోఽపి ప్రణతబహుఫలే యః స్వయం కృత్తివాసాః
కాన్తా సమ్మిశ్రదేహోఽప్యవిషయమనసాం యః పురస్తాద్యతీనామ్।
అష్టాభిర్యస్య కృత్స్నం జగదపి తనుభిర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వస్తామసీం వృత్తిమీశః ॥***

సి) ***చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తినుడువడేని
దయయు సత్యంబులోనుగా దలపడేని
గలుగనేటికి తల్లుల కడుపుచేటు.*** ***భా.ప్ర 12***

ఈ పద్యము రాని తెలుగువాడు కానరాడు. అది సాధ్యమా! ఇట విశ్వనాథవారు ఈ పద్యాన్ని వ్యాఖ్యానించిన 'సాహిత్య సురభి' గ్రంథాన్ని సంపాదించి దాని భావాన్ని చవిచూడ ప్రార్థన. 'శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు' – దీన్ని అనుభవం లోనికి తెచ్చుకోవటమే – మానవజీవితధ్యేయంగా రూపొందించుకోవాలని తలంతును. **సర్వమూ శివమయమే.**

***క్రియాదర్శము :–*** **అధ్యువాస** – అధి + ఉవాస, భ్వాదిప్రకరణమ్ (1) వస (వస్) నివాసే (నివసించుట) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లిట్ ప్రథమపురుషైకవచనమ్.

ప్రథమపురుషరూపాలు : అధి+ఉవాస – అధి+ఊషతుః – అధి+ఊషుః.

***అలంకారములు :–*** ఇట 'పరికరాలంకార'మున్నదని చెప్పదగును.

అభిప్రాయగర్భితాలైన విశేషాలను ఉపయోగించి విశేష్యంలో ఒక విధమైన వైశిష్ట్యాన్ని సూచించడం పరికరాలంకారము.

శివుడు తపస్సు కొఱకు ఎన్నుకున్న హిమాలయ చరియ – 1) గంగాప్రవాహము చేత తడుపబడిన దేవదారు వృక్షములు కలదిగాను, కస్తూరి పరిమళము కలదియును, ఇంచుక పాడుచున్న కిన్నరులు గలదినియు, చెప్పబడుటచే నిది 'పరికరాలంకార'ముగా చెప్పదగును.

**శ్లో॥ గణా నమేరుప్రసవావతంసా**
**భూర్జత్వచః స్పర్శవతీర్దధానాః ।**
**మనశ్శిలావిచ్ఛురితా నిషేదు -**
**శ్శైలేయనద్ధేషు శిలాతలేషు ॥ 55**

***పదవిభాగము :-*** గణాః, నమేరుప్రసవాతంసాః, భూర్జత్వచః, స్పర్శవతీః, దధానాః, మనశ్శిలావిచ్ఛురితాః, నిషేదుః, శైలేయనద్ధేషు,శిలాతలేషు.

***అన్వయక్రమము :-*** గణాః, నమే....సాః, స్పర్శవతీః, భూర్జత్వచః, దధానాః, మనఃశిలావిచ్ఛురితాః, శైలేయనద్ధేషు, శిలాతలేషు, నిషేదుః.

***ప్రతిపదార్థము :-*** గణాః = ప్రమథులు, నమేరుప్రసవావతంసాః = సురపొన్నపూలు శేఖరముగా గలవారును, స్పర్శవతీః = మృదువగు, భూర్జత్వచః = భూర్జవృక్ష పట్టలను, దధానాః = ధరించువారును, మనఃశిలావిచ్ఛురితాః = మణిశిలచేత పూయబడినవారును అయి, శైలేతలేషు = శిలాజిత్తుచేత వ్యాప్తములైన, శిలాతలేషు = ఱాతిప్రదేశములందు, నిషేదుః = కూర్చుండిరి.

***తాత్పర్యము :-*** ప్రమథులు = సురపొన్నపూవులు శేఖరముగాగలవారును, మృదువగు భూర్జవృక్షపట్టలను ధరించినవారును, మణిశిలచేతపూయబడినవారును అయి శిలాజిత్తుచేత వ్యాప్తములైన ఱాతిప్రదేశములందు కూర్చుండిరి.

***విభక్తులు / క్రియలు :-*** 1) గణాః – గణః, గణౌ,**గణాః;** అకారాన్తపుంలింగ గణశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 2) నమేరుప్రసవాతంసాః – అవతంసః, అవతంసౌ, **అవతంసాః;** అకారాన్తపుంలింగ అవతంస శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 3) స్పర్శవతీః – స్పర్శవతీమ్, స్పర్శవత్యౌ, **స్పర్శవతీః;** ఈకారాన్త స్త్రీలింగ స్పర్శవతీ శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 4) భూర్జత్వచః – భూర్జత్వచమ్, భూర్జత్వచౌ, **భూర్జత్వచః;** చకారాన్త స్త్రీగింగ భూర్జత్వక్శబ్దము, ద్వితీయావిభక్తి బహువచనము. 5) దధానాః – దధానః, దధానౌ, **దధానాః;** అకారాన్త పుంలింగ దధాన శబ్దము ప్రథమావిభక్తి బహువచనము. 6) మనఃశిలావిచ్ఛురితాః – విచ్ఛంతః, విచ్ఛురితౌ, **విచ్ఛురితాః;** అకారాన్తపుంలింగ విచ్ఛురితశబ్దము, ప్రథమవిభక్తి బహువచనము. 7) శైలేయనద్ధేషు – శైలేయనద్ధే, శైలేయనద్ధయోః, **శైలేయనద్ధేషు;** అకారాన్తనపుంసకలింగ శైలేయనద్ధ శబ్దము, సప్తమీవిభక్తి బహువచనము. 8) శిలాతలేషు – శిలాతలే, శిలాతలయోః, **శిలాతలేషు;** అకారాన్తనపుంసకలింగ శిలాతల శబ్దము,సప్తమీవిభక్తి బహువచనము. 9) నిషేదుః – క్రియ (లిట్).

***సమాసాలు :-***

1) నమేరుప్రసవావతంసాః – నమేరూణాం ప్రసవాః (ష.త.) నమేరుప్రసవా అవతంసాః యేషామ్ (బహువ్రీహి) తే.
2) భూర్జత్వచః – భూర్జానాం త్వచః (ష.త.).
3) మనఃశిలావిచ్ఛురితాః – మనఃశిలాభిః విచ్ఛురితాః (తృ.త.).
4) శైలేయనద్ధేషు – శైలేయేన నద్ధాని(తృ.త.) తేషు.
5) శిలాతలేషు – శిలానామ్ తలమ్ (ష.త.) శిలాతలమ్ తేషు.



***సంధులు :-***

1) స్పర్శవతీః + దధానాః = స్పర్శవతీర్దధానాః, విసర్గసన్ధిః.
2) నిషేదుః + శైలేయ = నిషేదుశ్శైలేయ, విసర్గసన్ధిః.

***పాఠాంతరాలు :-*** 1) దధానాః – వసానాః, 2) శైలేయనద్ధేషు – శైలేయగన్ధేషు.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. ***గణాః –*** ఎ) గణః – గణ్యతే గణయతి వా, కర్మణ్యప్ కర్తరి అచ్ వా. ప్రమథః – ప్రమథతీతి, ప్ర + మథ్ + అచ్.

బి) ***శ్లో॥ షట్ త్రింశత్తు సహస్రాణి ప్రమథా ద్విజసత్తమాః ।***
***తత్రైకత్ర సహస్రాణి భాగే షోడశ సంస్థితాః ॥*** కాళికాపురాణే.

సి) ‘ప్రమథశ్చ ప్రమాథీ చ దీర్ఘరోమశ్చ వీర్యవాన్’ – భారతే 1-117-12

డి) ***శ్లో॥ భర్తుః కణ్ఠచ్ఛవిరితి గణైః సాదరం వీక్ష్యమాణః***
***పుణ్యం యాయాస్త్రిభువనగురోర్ధామ చణ్డీశ్వరస్య*** *-మేఘదూతమ్ 33*

‘ఓమేఘుడా। ప్రభువగు నీలకంఠుని యొక్క కంఠము కాన్తిగలవాడవను కారణము వలన ప్రమథగణములచేత ఆదరముగ చూడబడుచున్నవాడవగుచుండ...’

ఇ) .....ప్రమథా పార్షదా గణాః 115 అని అభిధానచిన్తామణి ‘3’ నామము లందించినది.

ఎఫ్) గణానాం త్వా గణపతిం హవామహే కవిం కవీనామ్...

జి) ***శ్లో॥ తతో గణైః శ్శూభృతః పురోగై***
***రుదీరితో మంగళ తూర్యఘోషః ।*** *...కు. సం. 7-40*

‘ఆ తరువాత శివునకు ముందుగా నడుచు ప్రమథగణములు మంగళవాద్య ఘోషను చేసిరి’...

***క్రియాదర్శము :-*** .నిషేదుః – ని – ఉపసర్గ; షద్ల(సద్)విశరణగత్యవసాదనేషు (1. నశించుట) 2 గమనము (3 చంపుట). 1. అకర్మకమ్, 2, 3 సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్ (6) .లిట్ ప్రథమ పురుష బహువచనము,
ప్రథమపురుషరూపాలు:- నిషషాద – నిషేదతుః – నిషేదుః.

***అలంకారములు :-*** ఇట “స్వభావోక్త్యలంకార” మున్నదని చెప్పదగును. ప్రమథుల వర్ణన సహజసిద్ధముగ చేయబడుటచేనిది ‘స్వభావోక్త్యలంకాలంకార’మగును

***లక్షణము :- శ్లో॥ స్వభావోక్తిరలంకార ఇతి కేచిత్ ప్రచక్షతే ।***
***అర్థస్య తదవస్థత్వం స్వభావోఽభిహితో యథా॥*** *కావ్యాలంకారః. 2- 93.*



శ్లో॥ తుషారసఙ్ఘాతశిలాః ఖురాగ్రైః-
స్సముల్లిఖన్ దర్పకలః కకుద్మాన్ ।
దృష్టః కథంచిద్గవయైర్వివిగ్నై-
రసోఢసింహధ్వనిరున్ననాద ॥ **56**

***పదవిభాగము :–*** తుషారసంఘాతశిలాః, ఖురాగ్రైః, సముల్లిఖన్, దర్పకలః, కకుద్మాన్, దృష్టః,కథంచిత్, గవయైః, వివిగ్నైః, అసోఢసింహధ్వనిః, ఉన్ననాద.

***అన్వయక్రమము :–*** తుషా.... శిలాః, ఖురాగ్రైః, సముల్లిఖన్, దర్పకలః, వివిగ్నైః, గవయైః, కథంచిత్, దృష్టః, కకుద్మాన్, అసోఢసింహధ్వనిః,(సన్), ఉన్ననాద ।.

***ప్రతిపదార్థము :–*** తుషారసంఘాతశిలాః = మంచుగుంపనెడు ఱాళ్ళను, ఖురాగ్రైః = గిట్టల యొక్క మొనలతో/లేదా కొమ్ముల యొక్క కొనలతో, సముల్లిఖన్ = త్రవ్వుచు, దర్పకలః = మదముచే మధురస్వరముగలదై, వివిగ్నైః = భయపడిన, గవయైః = గవయమృగములచే, కథంచిత్ = ఏట్టికేలకు, దృష్టః = చూడబడినదై, కకుద్మాన్ = వృషభము, అసోఢసింహధ్వనిః(సన్) = సహింపరాని సింహధ్వని గలదై, ఉన్ననాద = బిగ్గఱగా ఱంకెవైచెను.

***తాత్పర్యము :–*** మంచుగుంపనెడు ఱాళ్ళను గిట్టల/కొమ్ముల యొక్క మొనలతో త్రవ్వుచు మదముచే మధురస్వరముగలదై, భయపడిన గవయమృగములచే ఎట్టకేలకు చూడబడినదై వృషభము సహింపరాని సింహధ్వని గలదై బిగ్గఱగా ఱంకె వైచెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) తుషారసంఘాతశిలాః – శిలా, శిలే, **శిలాః;** ఆకారాన్త స్త్రీలింగ తు....శిలాశబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 2) ఖురాగ్రైః – ఖురాగ్రేన,ఖురాగ్రాభ్యామ్, **ఖురాగ్రైః;** అకారాన్తనపుంసకలింగ ఖురాగ్రశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 3) సముల్లిఖన్ – **సముల్లిఖన్,** సముల్లిఖన్తే, సముల్లిఖన్తః; తకారాన్తపుంలింగ ప్రథమావిభక్తి ఏకవచనము, సముల్లిఖత్‌శబ్దము. 4) దర్పకలః – **దర్పకలః,** దర్పకలౌ, దర్పకలాః; అకారాన్త శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) వివిగ్నైః – వివిగ్నేన, వివిగ్నాభ్యామ్, **వివిగ్నైః;** అకారాన్తపుంలింగ వివిగ్న శబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 6) గవయైః – గవయేణ, గవయాభ్యామ్, **గవయైః;** అకారాన్తపుంలింగ గవయశబ్దము, తృతీయావిభక్తి బహువచనము. 7) కథంచిత్ – అవ్యయము. 8) దృష్టః – **దృష్టః,** దృష్టౌ, దృష్టాః, అకారాంత పుంలింగ దృష్ట శబ్దం, ప్రథమావిభక్తి ఏకవచనం, కకుద్మాన్ – **కకుద్మాన్,** కకుద్మంతౌ, కకుద్మంతః; తకారాన్త పుంలింగ కకుద్మచ్ఛబ్దము. 10) అసోఢసింహధ్వనిః – **ధ్వనిః,** ధ్వనీ, ధ్వనయః; ఇకారాన్తపుంలింగ ధ్వనిశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 11) ఉన్ననాద – క్రియ (లిట్).

***సమాసాలు :–***

1) తుషారసంఘాతశిలాః – తుషారాణాం సంఘాతాః(ష.త.) తుషారసంఘాతా ఏవ శిలాః (కర్మధా.) తాః।
2) ఖురాగ్రైః – ఖురాణామ్ అగ్రాణి (ష.త.) ఖురాగ్రాణి,తైః.
3) దర్పకలః – దర్పేణ కలః (తృ.త.). 4) అసోఢసింహధ్వనిః – సింహనాం ధ్వనిః (ష.త.) సింహధ్వనిః, అసోఢా సింహధ్వనిః యేన (బహువ్రీహి) సః.



***సంధులు :–***

1) ఖురాగ్రైః + సముల్లిఖన్ = ఖురాగ్రైస్సముల్లిఖన్, విసర్గసనిః.
2) కథంచిత్ + గవయైః = కథంచిద్గవయైః (జశ్త్వసన్ధిః).
3) గవయైః + వివిగ్నై = గవయైర్వివిగ్నైః, విసర్గసంధిః,
4) ధ్వనిః + ఉన్ననాద = ధ్వనిరున్ననాద, విసర్గసంధిః.

***పాఠాంతరాలు :–***

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1) **కకుద్మాన్:** ఏ) తకారాన్తపుంలింగము.

బి) కకుదస్యాస్తీతి । మతుప్, 'మాదుపధాయాశ్చ మతోర్వోఽ యవాదిభ్యః ఇతి న మస్య వకారత్వమ్.

హలాయుధకోశ వ్యాఖ్య. ఈ శ్లోకాన్నే ఉదహరించినది.

సి) ***శ్లో॥ ఉక్షానడ్ వాన్బలీవర్దః కకుద్మానృషభో వృషః ।***
***ఋషభః సౌరభేయో గౌర్వాడవేయోఽ ధ శాక్వరః ॥***

అని హలాయుధకోశం '11' నామములను పేర్కొనగా.

డి) ... కథ ఋషభో వృషభో వృషః ॥ 322

***శ్లో॥ వాడవేయః సౌరభేయో భద్రః శక్వరాశాక్వరౌ ।***
***ఉక్షాఽనడ్వాన్ కకుద్మాన్ గౌర్వలీవర్దశ్చ శాఙ్కరః ॥ 323***

అని అభిధానచిన్తామణి'14' నామములను పేర్కొన్నది.

ఇ) ***"శ్లో॥ మదోదగ్రాః కకుద్మన్తః సరితాం కూలముద్రుజాః ।***
***లీలాఖేలమను ప్రాపుః మహోక్షాస్తస్య విక్రమమ్ ॥"*** *ర.వం. 4-22*

"మదముచే గొప్పవైనవియు, ఎత్తైనమూపురములు గలవియును, నదుల గట్టులను తమ కొమ్ములచే పొడచి క్రూల దోయునవియునగు మహావృషభములు ఆ రఘువు యొక్క పరాక్రమమును అనుకరించినవి.'

***క్రియాదర్శము:–*** ఆ1) ఉన్ననాద, ఉత్ + ననాద = ణద(నద్),అవ్యక్తే శబ్దే (అవ్యక్తముగ ధ్వనించుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1), లిట్, ప్రథమపురుష రూపాలు:– ఉన్ననాద, ఉన్నేదతుః, ఉన్నేదుః.

***అలంకారములు:–*** ఇట'స్వభావోక్త్యలంకార'మున్నదని చెప్పదగును. వృషభ స్వభావరూపాదులు ప్రకృతి సిద్ధంగా సహజంగ వర్ణింపబడుటచే నిట 'స్వభావోక్త్యలంకార' మున్నదని చెప్పదగును.

***లక్షణము :–*** "స్వభావోక్తిర్దురూహార్థస్వక్రియారూపవర్ణనమ్".



శ్లో॥ తత్రాగ్నిమాధాయ సమిత్సమిద్ధం
స్వమేవ మూర్త్యన్తరమష్టమూర్తిః ।
స్వయం విధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తపశ్చచార ॥ 57

**పదవిభాగము :–** తత్ర, అగ్నిమ్, ఆధాయ, సమిత్సమిద్ధమ్, స్వమ్, ఏవ, మూర్త్యన్తరమ్, అష్టమూర్తిః, స్వయమ్, విధాతా, తపసః, ఫలానామ్, కేన, అపి, కామేన, తపః, చచార.

**అన్వయక్రమము :–** తపసః, ఫలానామ్, స్వయమ్, విధాతా, అష్టమూర్తిః, తత్ర, స్వమ్, ఏవ, మూర్త్యన్తరమ్, సమిత్సమిద్ధమ్, అగ్నిమ్, ఆధాయ, కేన, అపి, కామేన, తపః, చచార.

**ప్రతిపదార్థము :–** తపసః = తపస్సుయొక్క, ఫలానామ్ = ఫలములగు యింద్రత్వాదులకు, స్వయమ్ = తానే, విధాతా = నిర్మాతయగు, అష్టమూర్తిః = ఎనిమిది స్వరూపములు గలవాడగు మహేశ్వరుడు, తత్ర = ఆ హిమవత్ చరియ యందు, స్వమ్ + ఏవ = తనదే యగు, మూర్త్యన్తరమ్ = రూపాంతరమును, సమిత్సమిద్ధమ్ = సమిధలచే ప్రకాశించుచున్న, అగ్నిమ్ = అగ్నిని, ఆధాయ = ప్రతిష్ఠాపన చేసి, కేన + అపి = ఏదో, కామేన = కోరికచే, తపః = తపస్సును, చచార = ఆచరించెను.

**తాత్పర్యము :–** తపఃఫలములగు యింద్రత్వాదులకు తానే నిర్మాతయగు పరమేశ్వరుడు ఆ హిమవచ్చరియ యందు తనదే యగు రూపాంతరమును, సమిధలచే ప్రకాశించుచున్న అగ్నిని ప్రతిష్ఠాపన చేసి ఏదో కోరికచే తపస్సును ఆచరించెను.

**విభక్తులు / క్రియలు :–** 1) తపసః – **తపసః,** తపసోః, తపసామ్; సకారాన్త నపుంసకలింగ తపస్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 2) ఫలానామ్ – ఫలస్య, ఫలయోః, ఫలానామ్; అకారాన్త నపుంసకలింగ ఫల శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 3) స్వయమ్ – అవ్యయము. 4) విధాతా – **విధాతా,** విధాతారౌ, విధాతారః; ఋకారాన్త పుంలింగ విధాతృ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) అష్టమూర్తిః – అష్టమూర్తిః, అష్టమూర్తీ, అష్టమూర్తయః; ఇకారాన్త పుంలింగ అష్టమూర్తి శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 6) తత్ర – అవ్యయము. 7) ఏవ – అవ్యయము. 8) స్వమ్ – స్వమ్, స్వౌ, స్వాన్; అకారాన్త పుంలింగ స్వ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 9) మూర్త్యన్తరమ్ – మూర్త్యన్తరమ్, మూర్త్యన్తరౌ, మూర్త్యన్తరాన్; అకారాన్త పుంలింగ మూర్త్యన్తర శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 10) సమిత్సమిద్ధమ్ – **సమిత్సమిద్ధమ్,** సమిద్ధౌ, సమిద్ధాన్; అకారాన్త పుంలింగ 'సమిత్సమిద్ధమ్' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) అగ్నిమ్ – అగ్నిమ్, అగ్నీ, అగ్నయః; ఇకారాన్త పుంలింగ 'అగ్ని' శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) ఆధాయ – ఆ+ధా+క్త్వా (ల్యబన్తము). 13) కేన – కేన, కాభ్యామ్, కైః; మకారాన్త పుంలింగ కిమ్ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 14) కామేన – కామేన, కామాభ్యామ్, కామైః; అకారాన్త పుంలింగ కామ శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 15) తపః – **తపః,** తపసీ, తపాంసి; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 16) చచార – క్రియ (లిట్ ప్రథమపురషైకవచనము).

**సమాసాలు :–**

1) అష్టమూర్తిః – అష్టౌ మూర్తయో యస్య (బహువ్రీహి) సః;



2) మూర్త్యన్తరమ్ – అన్యా మూర్తిః (మయూరవ్యంసకాది సమాసము) తత్;

3) సమిత్సమిద్ధమ్ – సమిద్భిః సమిద్ధః (తృ.త.) తమ్.

**సంధులు :–**

1) మూర్తి + అన్తరమ్ = మూర్త్యన్తరమ్, యణాదేశసన్ధిః, ఇకో యణచి.

2) కేన + అపి = కేనాపి, సవర్ణదీర్ఘసన్ధిః, అకః సవర్ణే దీర్ఘః.

3) తపః + చచార = తపశ్చచార, శ్చుత్వసన్ధిః.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.**

1. **అష్టమూర్తి –**

ఎ) ***శ్లో॥ జలం వహ్నిస్తథా యష్టా సూర్యాచంద్రమసౌ తథా ।***
***ఆకాశం వాయురవనీ మూర్తయోఽష్టౌ పినాకినః ॥***

బి) ***శ్లో॥ పృథ్వీ సలిలం తేజో వాయురాకాశమేవ చ ।***
***సూర్యాచన్ద్రమసౌ సోమయాజీ చేత్యష్టమూర్తయః ॥***

సి) అభిజ్ఞానశకున్తల నాటక ప్రథమాంక ప్రథమ శ్లోకమును ఇట అనుసంధానము చేసుకొనదగును.

***శ్లో॥ యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ***
***యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్।***
***యామాహుః సర్వభూతప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవన్తః***
***ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః ॥*** **1-1**

డి) జగద్గురు శ్రీశంకరాచార్య విరచిత 'శ్రీదక్షిణామూర్త్యష్టకమ్'ను కూడ ఇట అనుసంధానము చేసుకొనదగును. సర్వమూ శివమయము గదా!

*శ్లో॥ కైలాసగౌరం వృషమారురుక్షోః*
*పాదార్పణానుగ్రహపూతపృష్ఠమ్ ।*
*అవేహి మాంకింకర**మష్టమూర్తేః***
*కుంభోదరం నామ నికుమ్భతుల్యమ్ ॥* *రఘువంశమ్ 2-35.*

వెండి కొండవలె తెల్లనగు నందిపై ఎక్కునిచ్చగల శివుని చరణవిన్యాసానుగ్రహమున పవిత్రమయిన వీపుగల నన్ను పరమేశ్వరుని సేవకునిగా నికుంభునితోడ సమానునిగా కుంభోదరుడను వానినిగా తెలియుము.

2. **అగ్నిమ్** – ఎ) అగ్నే

**మంత్రము – అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయూవాని విద్వాన్ యుయోధ్యస్మజ్జుహురాణమేనః భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ.** ఋగ్వేదం 1-189-1

ఓ అగ్నీ! నీవు సమస్తము తెలిసినవాడవు. కుటిలములగు మా పాపములను పోగొట్టి మంచి మార్గమున మమ్ము ప్రవేశపెట్టుము. మాకు సంపదలను లభింపజేయుము. నీకు నమశ్శతములు.

బి) శ్లో॥ *ప్రాణానాం ధారణార్థాయ యో౽న్నం భుఙ్క్తే చతుర్విధమ్ ।*
*అంతర్భూతః పచత్యగ్ని స్తస్మై పాకాత్మనే నమః ॥*

–మహాభారతమ్ – భీష్మస్తవరాజము – 75

"...పాకస్వరూపుడగు ఆ పురుషోత్తమునకు నమస్కారము చేయుచున్నాను."

సి) ఇట అగ్నిసూక్తమును అనుసంధానము చేసికొనదగును.

***క్రియాదర్శము :–*** 1) **చచార–** చర (చర్) భక్షణే, గతౌ (తినుట, వెళ్ళుట) భ్వాదిప్రకరణమ్ (1). సకర్మకమ్, సేట్, పరస్మైపదీ. లిట్.

ప్రథమపురుషరూపాలు : **చచార** – చేరతుః – చేరుః

***అలంకారములు :–*** 'అనుప్రాస'



***అవతారికా :–*** పార్వత్యాః పరిచర్యా. (పార్వతి పరిచర్య)

శ్లో॥ **అనర్ఘ్యమర్ఘ్యేణ తమద్రినాథః**
**స్వర్గౌకసామర్చితమర్చయిత్వా ।**
**ఆరాధనాయాస్యసఖీ సమేతాం**
**సమాదిదేశ ప్రయతాం తనూజామ్ ॥ 58**

***పదవిభాగము :–*** అనర్ఘ్యమ్, అర్ఘ్యేణ, తమ్, అద్రినాథః, స్వర్గౌకసామ్, అర్చితామ్, అర్చయిత్వా, ఆరాధనాయ అస్య, సఖీసమేతామ్, సమాదిదేశ, ప్రయతామ్, తనూజామ్.

***అన్వయక్రమము :–*** అద్రినాథః, అనర్ఘ్యమ్, స్వర్గౌకసామ్, అర్చితమ్, తమ్, అర్ఘ్యేణ, అర్చయిత్వా, అస్య, ఆరాధనాయ, సఖీసమేతామ్, ప్రయతామ్, తనూజామ్, సమాదిదేశ.

***ప్రతిపదార్థము :–*** అద్రినాథః = హిమవంతుడు, అనర్ఘ్యమ్ = అనంత మహిమాన్వితుడైనట్టియు, స్వర్గౌకసామ్ = దేవతలకు, అర్చితమ్ = పూజ్యుడైనట్టియు, తమ్ = ఆ శివుని, అర్ఘ్యేణ = పూజకొఱకగు జలముతో, అర్చయిత్వా = పూజించి, అస్య = ఆ శివునియొక్క, ఆరాధనాయ = పూజ కొఱకు, సఖీసమేతామ్ = సఖులతో కూడినదియును, ప్రయతామ్ = నియమవంతురాలగు, తనూజామ్ = తన కుమారితను (పార్వతీ దేవిని), సమాదిదేశ = నియమించెను.

***తాత్పర్యము :–*** హిమవంతుడు, అనంత మహిమాన్వితుడైనట్టియు, దేవతలకు పూజ్యుడైనట్టియు ఆ శివుని పూజ కొఱకగు జలముతో పూజించి ఆ శివునియొక్క పూజ



కొఱకు సఖులతో కూడినదియును, నియమవంతురాలగు తన కుమారిత యగు పార్వతీదేవిని నియమించెను.

***విభక్తులు / క్రియలు :–*** 1) అద్రినాథః – **అద్రినాథః,** అద్రినాథౌ, అద్రినాథాః; అకారాన్త పుంలింగ అద్రినాథశబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) అనర్ఘ్యమ్ – **అనర్ఘ్యమ్,** అనర్ఘ్యౌ, అనర్ఘ్యాన్; అకారాన్త పుంలింగ అనర్ఘ్య శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 3) స్వర్గౌకసామ్ – స్వర్గౌకస్య, స్వర్గౌకయోః, **స్వర్గౌకసామ్;** అకారాన్త పుంలింగ స్వర్గౌకస శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 4) అర్చితమ్ – **అర్చితమ్,** అర్చితౌ, అర్చితాన్; అకారాన్త పుంలింగ అర్చిత శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) తమ్ – **తమ్,** తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) అర్ఘ్యేణ – **అర్ఘ్యేణ,** అర్ఘ్యాభ్యామ్, అర్ఘ్యైః; అకారాన్త పుంలింగ అర్ఘ్య శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 7) అర్చయిత్వా – అవ్యయము. 8) అస్య – **అస్య,** అనయోః, ఏషామ్; మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 9) ఆరాధనాయ – **ఆరాధనాయ,** అరాధనాభ్యామ్, అరాధనేభ్యః; ఆకారాన్త నపుంసకలింగ 'ఆరాధన' శబ్దము, పంచమీవిభక్తి ఏకవచనము. 10) సఖీసమేతామ్ – **సఖీసమేతామ్,** సఖీసమేతే, సఖీసమేతాః; ఆకారాన్త స్త్రీలింగ సఖీసమేతా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 11) ప్రయతామ్ – **ప్రయతామ్,** ప్రయతే, ప్రయాతాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రయతా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 12) తనూజామ్ – **తనూజామ్,** తనూజే, తనూజాః; ఆకారాన్త స్త్రీలింగ తనూజ శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 13) సమాదిదేశ – క్రియ.

***సమాసాలు :–***

1) అద్రినాథః – అద్రీణాం నాథః (ష.త.);
2) అనర్ఘ్యమ్ – న అర్ఘ్యః (నఞ్‌తత్పు.) అనర్ఘ్యః తమ్;
3) స్వర్గౌకసామ్ – స్వర్గః ఓకః యేషామ్ (బహువ్రీహి) తే స్వర్గౌకసః, తేషామ్;
4) సఖీసమేతామ్ – సఖీభ్యాం సమేతా (తృ.త.) తామ్.

***సంధులు :–***

1) స్వర్గ + ఓకసామ్ = స్వర్గౌకసామ్, వృద్ధిసన్ధిః, వృద్ధిరేచి (సూ 6–1–85).
2) ఆరాధనాయ + అస్య = ఆరాధనాయాస్య, సవర్ణదీర్ఘసన్ధిః.

***పాఠాంతరాలు :–*** 1) సఖీసమేతామ్ – సఖీసమగ్రామ్.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

1. **అర్ఘ్యేణ** – ఎ) అర్ఘః – అర్ఘ్ + ఘఞ్ 'పాదార్ఘాభ్యాం' చేతి యత్ప్రత్యయః.

బి) దూర్వాక్షత సర్షపపుష్పాది విరచితో దేవబ్రాహ్మణాది సమ్మానార్థః పూజోపచారభేదః

సి) 1) అయే వనదేవతేయం ఫలకుసుమ పల్లవార్ఘేణ మాముపతిష్ఠతే।

–ఇతి ఉత్తరచరితే.

2) 'స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై' – ఇతి మేఘదూతే.

3) 'దూర్వాసర్షప పుష్పాణాం దత్త్వార్ఘపూర్ణమంజలిమ్' – ఇతి యాజ్ఞవల్క్యః

డి) తుల్యభావమున్న రఘువంశము (5–2) లోని ఈ శ్లోకాన్ని ఇట అనుసంధానము చేసుకొనదగును.

***శ్లో॥ స మృణ్మయే వీతహిరణ్మయత్వా -***
***త్పాత్రే నిధాయార్ఘ్యమనర్ఘ్యశీలః ।***
***శ్రుతప్రకాశం యశసా ప్రకాశః***
***ప్రత్యుజ్జగామాతిథిమాతిథేయః ॥***

అతిథిప్రియుడై యమూల్యస్వభావము గలిగిన రఘుమహారాజు మృత్పాత్రమున పూజాద్రవ్యమునుంచుకొని సకల శాస్త్రముల యందును ప్రసిద్ధికెక్కిన యభ్యాగతుడైన కౌత్సర్షి నెదురేగెను.

ఇ) శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారు రచించిన **'శ్రీ శివమానసికపూజాస్తుతిః'** ని ఇట అనుసంధానము చేసుకొనుట అత్యన్తమనోహరమగు విషయము. సర్వము శివమయమే గదా!

***శ్లో॥ కియదాసనం ప్రకల్ప్యం***
***కృతాసనస్యేహ సర్వతోఽపి శివ ।***
***పాద్యం కుతోఽర్ఘ్యమపి వా***
***పాద్యం సర్వత్ర పాణిపాదస్య ॥ 3***

ఇచట - అచట అని కాక అంతటను స్థిరాసనాసీనుడైన స్వామికి ఎంత ఆసనమును కల్పించుట? దానిని ఎచటనుండి తెచ్చుట? ఇవి రెండును అసంభవములే! స్వామి పాదములిచటనున్నవి, అచట లేవు - అని లేదు. అట్లే ఆయన చేతులును. ఆయన సర్వతః పాణిపాదుడు. అట్టివానికి అర్ఘ్య-పాద్యముల నెచటనుండి తెచ్చి ఆపాదింపగలము?

"సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోరుహమ్' - అని శ్రుతి.

***క్రియాదర్శము :-* సమాదిదేశ -** (సమా +దిదేశ) పూర్వము చెప్పబడినది.

***అలంకారములు :-*** 'అనుప్రాస'



**శ్లో॥ ప్రత్యర్థిభూతామపి తాం సమాధేః**
**శుశ్రూషమాణాం గిరిశోఽనుమేనే ।**
**వికారహేతౌ సతి విక్రియన్తే**
**యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ॥ 59**

***పదవిభాగము :-*** ప్రత్యర్థిభూతామ్, అపి, తామ్, సమాధేః, శుశ్రూషమాణామ్, గిరిశః, అనుమేనే, వికారహేతౌ, సతి, విక్రియన్తే, యేషామ్, న, చేతాంసి, తే, ఏవ, ధీరాః.

***అన్వయక్రమము :-*** గిరిశః, సమాధేః, ప్రత్యర్థిభూతామ్, అపి, శుశ్రూషమాణామ్, తామ్, అనుమేనే, వికారహేతౌ, సతి, యేషామ్, చేతాంసి, తే, ఏవ, ధీరాః



***ప్రతిపదార్థము :-*** గిరిశః = శివుడు, సమాధేః = యోగమునకు, ప్రత్యర్థిభూతామ్+అపి = ప్రతికూలురాలు ఐనను, శుశ్రూషమాణామ్ = సేవించుచున్నట్టి, తామ్ = ఆ పార్వతీ దేవిని, అనుమేనే = అంగీకరించెను, వికారహేతౌ (సతి) = మనశ్చలనమునకు కారణముండగా, యేషామ్ = ఎవరియొక్క, చేతాంసి = చిత్తములు, న విక్రియన్తే = మాఱవో, తే + ఏవ = వారే, ధీరాః = దృఢచిత్తులు.

**తాత్పర్యము :-** శివుడు యోగమునకు ప్రతికూలురాలైనను సేవించుచున్నట్టి ఆ పార్వతీదేవిని అంగీకరించెను. మనశ్చలనమునకు కారణముండగా ఎవరి చిత్తములు మాఱవో వారే దృఢచిత్తులు.

***విభక్తులు / క్రియలు :-*** 1) గిరిశః - **గిరిశః,** గిరిశౌ, గిరిశాః; అకారాన్త పుంలింగ, గిరిశ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) సమాధేః - **సమాధేః,** సమాధ్యోః, సమాధీనామ్; ఇకారాన్త పుంలింగ సమాధి శబ్దము, షష్ఠీవిభక్తి ఏకవచనము. 3) అపి - అవ్యయము. 4) ప్రత్యర్థిభూతామ్ - **ప్రత్యర్థిభూతామ్,** ప్రత్యర్థిభూతే, ప్రత్యర్థిభూతాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రత్యర్థిభూతా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 5) శుశ్రూషమాణామ్ - **శుశ్రూషమాణామ్,** శుశ్రూషమాణే, శుశ్రూషమాణాః; ఆకారాన్త స్త్రీలింగ శుశ్రూషమాణా శబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 6) తామ్ - **తామ్,** తే, తాః, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ద్వితీయావిభక్తి ఏకవచనము. 7) అనుమేనే - క్రియ (అను + మన్ - లిట్) - ఆత్మనేపదిరూపము. 8) వికారహేతౌ - **వికారహేతౌ,** వికారహేత్వోః, వికారహేతుషు; ఉకారాన్త పుంలింగ వికారహేతు శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 9) సతి - **సతి,** సతో, సత్సు; తకారాన్త పుంలింగ సత్ శబ్దము, సప్తమీవిభక్తి ఏకవచనము. 10) యేషామ్ - యస్య, యయోః, **యేషామ్;** దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 11) చేతాంసి - చేతః, చేతసీ, **చేతాంసి;** సకారాన్త నపుంసకలింగ చేతశ్శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 12) ఏవ - అవ్యయము. 13) న - అవ్యయము. 14) విక్రియన్తే - క్రియ (లట్) (కర్మణి). 15) తే - సః, తౌ. **తే;** దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి బహువచనము. 16) ధీరాః - ధీరః, ధీరౌ, **ధీరాః;** అకారాన్త పుంలింగ ధీర శబ్దము, ప్రథమావిభక్తి బహువచనము.

***సమాసాలు :-***

1) ప్రత్యర్థిభూతామ్ - ప్రత్యర్థినీ భూతా (సుప్సుపా) తామ్;

2) వికారహేతౌ - వికారస్య హేతుః (ష.త.) వికారహేతుః, తస్మిన్;

3) గిరిశః - గిరౌ శేతే (అలుక్ సమాసః)

***సంధులు :-***

1) గిరిశః + అనుమేనే = గిరిశోఽనుమేనే, ఉత్వాదేశసన్ధిః.

2) తే + ఏవ = త ఏవ.

***పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణములు - కావ్యప్రయోగములు.***

1. **సమాధేః** - ఎ) సమాధిః - 1) సమాధీయతేఽస్మిన్ మనో జనైరితి. సమ్+ఆ+ధా+ 'ఉపసర్గే ధోః కిః' ఇతి కి.

2) "ప్రణిధానం సమాధానం సమాధిశ్చ సమాస్త్రయః ॥" హ.కో. 128.

3) "అవధానసమాధానప్రణిధానాని తు సమాధౌ స్యుః ॥" అభిధానచిన్తామణి(6-14)

4) శ్లో॥ కదాచిదాసన్నసఖీముఖేన సా
మనోరథజ్ఞం పితరం మనస్వినీ ।
అయాచతారణ్యనివాసమాత్మనః
ఫలోదయాన్తాయ తపః సమాధయే ॥ కు.సం (5-6)

"....తన కోరిక ఫలించువరకు తపస్సు చేసికొనుటకై అనుమతిని తన ఇష్టసఖి ద్వారా కోరెను."

***క్రియాదర్శము :-*** **అనుమేనే** – అను ఉపసర్గ; మను (మన్) అవబోధనే (తెలియుట). తనాదిప్రకరణమ్ (8), సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ. లిట్.

ప్రథమపురుషరూపాలు : **అనుమేనే** – అనుమేనాతే – అనుమేనిరే

2) **విక్రియన్తే** – వి–ఉపసర్గ, డు కృ ఞ్ కరణే (చేయుట). తనాదిప్రకరణమ్ (8). సకర్మకమ్, అనిట్, కర్మణి ప్రయోగము, ఆత్మనేపదరూపము. లట్.

ప్రథమపురుషరూపాలు : విక్రియతే – విక్రియేతే – **విక్రియన్తే.**

***అలంకారములు :-*** ఇట 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును.

శ్లోక ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడుటచే నిది 'అర్థాన్తరన్యాసాలంకార'మని చెప్పదగును. అన్వయము – సరళము.

***లక్షణము:- శ్లో॥ సామాన్యం వా విశేషేణ విశేషస్తేన వా యది ॥***
***కార్యం చ కారణేనేదం కార్యేణ చ సమర్థ్యతే ।***
***సా ధర్మ్యేణేతరేణార్థాన్తరన్యాసోఽష్టధా తతః॥*** *– సాహిత్యదర్పణే -10*



***అవతారికా :-*** శుశ్రూషాప్రకారమేవాహ। పార్వతి శివునికెట్లు శుశ్రూష చేసినదో వివరించ బడుచున్నది.

**శ్లో॥ అవచితబలిపుష్పా వేదిసమ్మార్గదక్షా**
**నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ ।**
**గిరిశముపచచార ప్రత్యహం సా సుకేశీ**
**నియమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః ॥ 60**

ఇతి మహాకవి శ్రీకాళిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే **ఉమోత్పత్తిర్నామ** ప్రథమః సర్గః.

***పదవిభాగము :-*** అవచితబలిపుష్పా, వేదిసమ్మార్గదక్షా, నియమవిధిజలానామ్, బర్హిషామ్, చ, ఉపనేత్రీ (సతీ), గిరిశమ్, ఉపచచార, ప్రత్యహమ్, సా, సుకేశీ, నియమిత పరిఖేదా, తచ్ఛిరశ్చన్ద్రపాదైః.



***అన్వయక్రమము :-*** సుకేశీ, సా, అపచితబలిపుష్పా, వేదిసమ్మార్గదక్షా, నియమవిధి జలానామ్, బర్హిషామ్, చ, ఉపనేత్రీ (సతీ) తచ్ఛిరచన్ద్రపాదైః, నియమితపరిఖేదా (సతీ), ప్రత్యహమ్, గిరిశమ్, ఉపచచార.

***ప్రతిపదార్థము :-*** సుకేశీ = సొంపైన తలవెంద్రుకలు గలదైన, సా = ఆ పార్వతీదేవి, అవచితబలిపుష్పా = కోయబడిన పూజాపుష్పములు గలదియు, వేదిసమ్మార్గదక్షా = నియమ వేదికను ఊడ్చుటయందు నేర్పరియు, నియమవిధిజలానామ్ = నిత్యానుష్ఠానమునకైన నీళ్ళను, బర్హిషామ్ చ = దర్భలను, ఉపనేత్రీ (సతీ) = తెచ్చిపెట్టునదియు, తచ్ఛిరశ్చన్ద్రపాదైః = ఆ శివునియొక్క శిరమందున్న చంద్ర కిరణములచేత, నియమితపరిఖేదా (సతీ) = అడచ బడిన యయాసము గలదియై, ప్రత్యహమ్ = ప్రతిదినమును, గిరిశమ్ = శివునిగూర్చి, ఉపచచార = సేవించెను.

***తాత్పర్యము :-*** సొంపయిన తలవెంద్రుకలు గలదైన ఆ పార్వతీదేవి, కోయబడిన పూజాపుష్పములు గలదియు, నియమవేదికను ఊడ్చుటయందు నేర్పరియు, నిత్యానుష్ఠానమునకైన నీళ్ళను, దర్భలను తెచ్చిపెట్టునదియు, ఆ శివుని శిరమందున్న చంద్రకిరణములచేత అలసట లేనిదియై ప్రతిదినమును శివుని గూర్చి సేవించెను.

***విభక్తులు / క్రియలు :-*** 1) సుకేశీ – **సుకేశీ,** సుకేశ్యౌ, సుకేశ్యః; ఈకారాన్త స్త్రీలింగ సుకేశీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 2) సా – **సా**, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 3) అవచితబలిపుష్పా – **...పుష్పా,** ...పుష్పే, ... పుష్పాః; ఆకారాన్త స్త్రీలింగ ...పుష్ప శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 4) వేదిసమ్మార్గదక్షా – **...దక్షా,** ...దక్షే, ...దక్షాః; ఆకారాన్త స్త్రీలింగ ...దక్షా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 5) నియమవిధిజలానామ్ – ...జలస్య, ...జలయోః, **...జలానామ్;** అకారాన్త నపుంసకలింగ నియ...జల శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 6) చ – అవ్యయము. 7) బర్హిషామ్ – బర్హిషః, బర్హిషోః, **బర్హిషామ్;** షకారాన్త నపుంసకలింగ బర్హిష్ శబ్దము, షష్ఠీవిభక్తి బహువచనము. 8) ఉపనేత్రీ–**ఉపనేత్రీ,** ఉపనేత్ర్యౌ, ఉపనేత్ర్యః; ఈకారాన్త స్త్రీలింగ ఉపనేత్రీ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 9) త...పాదైః – పాదేణ, పాదాభ్యామ్, **పాదైః;** అకారాన్త పుంలింగ పాద శబ్దము, తృతీయావిభక్తి ఏకవచనము. 10) నియమిత పరిఖేదా – **....ఖేదా**, ....ఖేదే, ....ఖేదాః; ఆకారాన్త స్త్రీలింగ ....ఖేదా శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనము. 11) ప్రత్యహమ్ – అవ్యయము. 12) గిరిశమ్ – **గిరిశమ్,** గిరిశౌ, గిరిశాని; అకారాన్త పుంలింగ గిరిశ శబ్దము, ద్వితీయావిభక్తి ద్వివచనము. 13) ఉపచచార – క్రియ.

***సమాసాలు :-***

1) అవచితబలిపుష్పా – బలేః పుష్పాణి (ష.త.) అవచితాని బలిపుష్పాణి యయా (బహువ్రీహి) సా;
2) వేదిసమ్మార్గదక్షా – వేదేః సమ్మార్గః (ష.త.) తస్మిన్ దక్షా (స.త.);
3) నియమవిధిజలానామ్ – నియమస్య విధిః (ష.త.) నియమవిధేః జలాని (ష.త.) తేషామ్;
4) తచ్ఛిరశ్చంద్రపాదైః – తస్య శిరః (ష.త.) చంద్రస్య పాదాః (ష.త.) తచ్ఛిరసి చంద్రపాదాః (స.త.) తైః;

5) నియమితపరిఖేదా – నియమితః పరిఖేదః యస్యాః (బహువ్రీహి) సా;

6) ప్రత్యహమ్ – అహని అహని (అవ్యయీభావ సమాసః).

***సంధులు :–***

1) చ + ఉపనేత్రీ = చోపనేత్రీ.

2) తత్ + శిరః = తచ్ఛిరః, ఛత్వసంధిః, **శశ్ఛోఽటి** (సూ 8-4-62). ఛత్వమవీతి వాచ్యమ్–పదాంతమందున్న వర్గముల మొదటి నాలుగు అక్షరములకు (ఝయ్యులకు) పరముగా నున్న శకారమునకు అచ్చులుగాని, హయవరలలుగాని పరమగుచో ఛకారము వికల్పముగ వచ్చును. తద్ + శిరః – దకారమునకు శ్చుత్వము, తజ్ + శిరః – జకారమునకు చర్త్వము, తచ్ + శిరః – శకారమునకు ఛత్వము, తచ్ + ఛిరః – తచ్ఛిరః, తచ్శిరః.

3) శిరః + చన్ద్రపాదైః, శిరశ్చన్ద్రపాదైః, శ్చుత్వసన్ధిః.

***పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణములు – కావ్యప్రయోగములు.***

**1. గిరిశమ్ –** ఎ) గిరిశః– గిరిరాశ్రయత్వేన వసతిత్వేనాస్త్యస్య ఇతి। 'లోమాదిపాదిపిచ్ఛాదిభ్యః శనేలచః' ఇతి శ। యద్వా గిరౌ కైలాసాఖ్య పర్వతే, ఆధ్యాత్మికార్థే తు నిత్యశుద్ధమనసీత్యర్థః, శేతే విరాజతే ఇతి। యద్వా గిరిం త్రిగుణవృత్తాత్మకం మనః శ్యతి తనూకరోతి విశుద్ధం కరోతి శరణాగతభక్తసాధూనామ్। శీఙ్ శయనే, శో తనూకరణే వా, 'గిరౌ డశ్ఛన్దసి' ఛాన్దసానాం క్వచిద్భాషాయామపి ప్రయోగ అశుశుక్షణివదిత్యాహ స్వామీ। –హలాయుధకోశవ్యాఖ్య.

ఇట రఘువంశమహాకావ్యము నందలి ఈ పద ప్రయోగములు చూడగలరు.

> ***శ్లో॥ ఇతి ప్రగల్భం పురుషాధిరాజో***
> ***మృగాధిరాజస్య వచో నిశమ్య ।***
> ***ప్రత్యాహతాస్త్రో గిరిశప్రభావా –***
> ***దాత్మన్యవజ్ఞాం శిథిలీచకార ॥ 2-41***

నరాధిపుడగు దిలీపుడు మృగాధిపుడగు సింహము యొక్క ప్రతిభాసముపేతములైన ఆ మాటలను విని శివుని మహత్త్వము చేతనే అస్త్రము విఫలమైనదని గ్రహించి తనకు కలిగిన అవమానము పరిగణింపలేదు.

> *శ్లో॥ ఆపింజరా బద్ధరజఃకణత్వాత్ మంజర్యుదారా శుశుభేఽర్జునస్య ।*
> *దగ్ధాపి దేహం గిరిశేన రోషాత్ ఖణ్డీకృతాజ్యేవ మనోభవస్య ॥ 16-51*

...మన్మథుని దహించియును కోపము చల్లారని శివునిచే మన్మథుని ధనుస్సున కున్న త్రెంపబడ్డ అల్లెత్రాడేమో అనునట్లు ప్రకాశించెను.

2. **పరిఖేదా – సుకేశీ :** అత్ర పరిఖేదాసుకేశీ శబ్దాభ్యాం శ్రమావస్థాసులభ శోభాతిశయః ప్రత్యాయ్యతే। యథోక్తం శాకున్తలే.



> ***శ్లో॥ స్రస్తాం సావతిమాత్రలోహితతలౌ బాహూ ఘటోత్క్షేపణాత్***
> ***అద్యాపి స్తనవేపథుం న జహతి శ్వాసః ప్రమాణాధికః ।***
> ***బద్ధం కర్ణశిరీషరోధి వదనే ఘర్మాంభసాం జాలకం***
> ***బన్ధే స్రంసిని చైకహస్తయమితాః పర్యాకులా మూర్ధజాః ॥ 1-28.***

ఏతాదృశశోభావిశేషదర్శనే కస్యచిత్ క్షోభో న భవేదితి భావః –

– మిగిలిన వివరములకు 'వివరణమ్' వ్యాఖ్య చూడగలరు.

***క్రియాదర్శము :–*** ఉపచచార – 57వ శ్లోకవ్యాఖ్య ను చూడగలరు.

***అలంకారములు :–*** ఇట 'పరికరలంకార'మున్నదని చెప్పదగును.

***లక్షణము :– " ఉక్తిర్విశేషణైః సాభిప్రాయైః పరికరో మతః ।"***

***ఛందస్సు :–*** ఇది 'మాలినీ' వృత్తము.

***లక్షణము :–*** 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః" 15 అక్షరములు, యతిస్థానము '8' వ అక్షరము పిదప.

***ఇతరవిశేషాంశములు :–*** శ్రీమహాకవి శ్రీకాళిదాసవిరచిత 'శ్రీకుమారసంభవ'మహాకావ్యము నందు ప్రథమ సర్గయందు శ్లోకములు 'ఉపజాతి' వృత్తమునకు చెందినవి. ఇది ఇంద్రవజ్రా, మఱియు ఉపేన్ద్ర వజ్రా వృత్త లక్షణముల కలయికచే ఏర్పడినది. ఇందలి శ్లోకములలోని ప్రతిపాదమును అది ఇంద్రవజ్రా లేదా ఉపేంద్ర వజ్రా లక్షణమున్న పాదమో చూచుకొనవలసియుండును. సర్గాంతమున గల ఈ శ్లోకము 'మాలినీ' వృత్తమునకు చెందినది. సర్గయందలి శ్లోకములన్నియు ఒక వృత్తమున రచించుట, సర్గాంతమందలి శ్లోకమును వేరొక వృత్తమున రచించుట సంప్రదాయము. 'సువృత్తతిలక' యందు 'సర్గాంత శ్లోకమ'ను దానిని వివరించుతూ ఈ శ్లోకమునే ఉదాహరణగా పేర్కొనుట గమనించదగును.

ప్రథమసర్గ నామము **'ఉమోత్పత్తి'.** శ్రీ రమణమహర్షి వారిచే 'నాయన' గా పిలువబడిన శ్రీ వాసిష్ఠమహాగణపతి ముని రచించిన **'ఉమాసహస్ర'**మను కావ్యమును విద్వాంసులు ఇట అనుసంధానము చేసుకుందురు గాక.

'మృణాలినీ నామమున ఈ సర్గకు నాచే చేయబడిన వ్యాఖ్యానము వికృతి నామ సంవత్సర అధిక వైశాఖ శుద్ధ పంచమి అనగా 19-04-2010 ఉదయం 9 గంటలకు ప్రారంభింపబడి, 13-05-2010, అనగా 'అమా' తిథిగడియలలో సాయం సమయము గం. 3-46 ని.లకు పూర్తి కావింపబడినది.

శ్రీమహాగణపతి, కుమార సహిత శ్రీ సాంబసదాశివులకు మనసా, వాచా, కర్మణా నమస్సులర్పించుచున్నాను. అస్తు!!

